# వ్యాసవాణి!

## శ్రీవేదవ్యాస-గురుదేవుల అమృత సందేశాలు ప్రవచనాలు!


మూలం :

**శ్రీపూజ్య గురుదేవులు**

**డా. వేదవ్యాస IAS, Ph.D., D.Litt.**



ప్రచురణ :

**యోగమిత్రమండలి – USCEFI-(Reg)**

హైదరాబాద్-33

**2002**

# సమర్పణ

పూర్వం ఎవరో ఒక మహాపండితుడూ కవీ 'ప్రపంచంలో ఎవ్వరూ ఇంతకుముందు రాయని విషయంపై తానో గ్రంథం రాయాలని' - పూనుకున్నాట్ట! ఆయన ఎంతటి అపూర్వ విషయాన్ని తన గ్రంథానికి ఎన్నుకున్నాసరే - తీరాచూస్తే వేదవ్యాస మహర్షి దానిమీద ఎక్కడో ఏదో వ్రాసినది కనిపిస్తూనే వుండేదట! దాంతో ఆయన విసిగిపోయి - ఈ ప్రపంచంలో ప్రతిఒక్కటీ వ్యాసమహర్షి ఉచ్చరించి ఎంగిలిచేసినదే! - ఈ ప్రపంచం యావత్తూ వ్యాసోచ్ఛిష్ఠమేగదా? అని విసుక్కున్నాట్ట!!

అంటే - వ్యాసుడు ఒక జ్ఞానసముద్రం వంటివాడు, అని కవి హృదయం!

వేదవ్యాసుడని తల్లిదండ్రులు పేరుపెట్టడం సార్ధకనామం - అని జగద్గురువులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారే మన శ్రీవేదవ్యాస గురుదేవులనుగూర్చి - "అన్వర్ధ నామదేయః ఆశీః" అని దీవించారంటే శ్రీ గురుదేవులు నిజంగా వేదవ్యాసులవంటివారే.

అని తెలిపే శ్రీవారి ఉపన్యాసములను యోగమిత్రులకు కీ.శే. శ్రీ వై.వి.యల్. నరసింహారావుగారి సంకల్పబలంతో శ్రీ పూజ్యగురుదేవుల పాదపద్మముల చెంత సమర్పించే అదృష్టం కలగడం నాజన్మ సార్ధకతగా భావించుచూ

శ్రీవారి పాదరేణువు

శ్రీ వై.వి.యస్.యస్.గిరిరావు

"సంకలనం నాదైనా సంకల్పం కీ.శే. నాన్నగారిదే."

# ఇందులో...

## 1

# "శ్రీమన్నారాయణ యజ్ఞం"లో ప్రవచనం

# సంక్రాంతి! - ఉత్తరాయణ పుణ్యకాలం

ఈ జనవరి 14వ తేదీ గురువారం సూర్యుడు ఉత్తరాయణ పుణ్యకాల ప్రవేశము. ఈ ఉత్తరాయణ పుణ్యకాల ప్రవేశములో చేసిన ధ్యానముగానీ, జపముగానీ, తపస్సుకానీ, ఇతర యే దానములు చేసినాగానీ అది కోట్ల ఫలితము యిస్తుంది. దీని కారణమేమంటే ప్రపంచములోని అన్ని జీవరాసులునూ జన్మించడము, పెరగడం, మరణించడం, ఈ మూడూ కాలము వలన ఏర్పడు చున్నవి. కాలము వలననే పెరుతున్నాము. కాలము వలననే అన్ని జీవరాసులు నశిస్తున్నవి.

ఈ కాలానికి ఆత్మ అయినటువంటివాడు సూర్యుడు. కాలానికి ఆత్మ అంటే అర్ధమేమిటి ? సూర్యుని చుట్టూ గ్రహాలన్నీ తిరుగుతాయి కాబట్టి. ఈ గ్రహములన్నింటికీ కూడా కాలము అంతే [illegible] తిరగడం సూర్యుడి వలననే ఏర్పడుతుంది. ఈ సూర్యుడు కేంద్ర స్థానములో ఉండి

దానికి చుట్టూ తక్కిన గ్రహాలు తిరగడం మూలాన మనకి ఏర్పడేటటువంటి కాలచక్రానికి సూర్యుడు ఆత్మ. ఈ సూర్యుడు ఉత్తరదిక్కుగా ప్రయాణం చేస్తూ, ఉత్తర దిక్కుగా ఉన్న సప్తర్షి మండలం, ధృవమండలం, విష్ణుపురం తిరుగుతాడు. అందువల్ల ఈ ఉత్తరాయణ పుణ్యకాలం అపూర్వమైనటు వంటి మోక్షకాలము, పుణ్యకాలము. ఈ సమయంలో చేసే పుణ్యకర్మలన్నీ మామూలు టైములో చేసిన పుణ్య కర్మలకంటే కొన్ని వేల రెట్లు ఫలితాన్నిస్తాయి. ఈ సమయంలో ఎక్కడ స్నానం చేసినా ఆ జలం గంగతో సమానమవుతుంది. ఏ వస్తువు దానం యిచ్చినా అది బ్రహ్మాండము అంత దానం ఇచ్చిన ఫలితం కలుగు తుంది. ఏ దేవతలు, ఏ గుళ్ళు ఎక్కడ మ్రొక్కినా అక్కడ సాక్షాత్ వైకుంఠములో ఉన్నటువంటి నారాయణుని దర్శించిన ఫలితము ఇస్తుంది. అంటే చాలా స్వల్పమైన ఆధ్యాత్మిక ఫలితాలు ఇచ్చేవికూడా ఈ టైములో చాలా ఎక్కువ ఫలితాన్నిస్తాయి. ఎలా ఇస్తాయంటే కాలము వలన అని ముందే చెప్పాను. వర్షాకాలములో విత్తనాలు చల్లితే మొలిచి పండుతున్నాయి. అదే కాలము వ్యతిరేకముగా ఉన్నప్పుడు చల్లితే మాడిపోతాయి. అలాగే మనకు ఆధ్యాత్మిక ఫలితా లిచ్చేందుకు విత్తనాలుచల్లే సరైన కాలము ఈ ఉత్తరాయణ పుణ్యకాలము. ఎవరు యోగా భ్యాసాన్ని, ధ్యానాన్ని, జపాన్ని, దానాన్ని ఈ ఉత్తరాయణ పుణ్యకాలంలో చేస్తారో ఆ సమయంలో కాలపురుషుని యొక్క సహాయం విశేషంగా లభిస్తుంది. అనగా మన ప్రయత్నానికి కాలము కూడాసహాయం చేస్తుంది.

దీనికి కారణము ఏమిటి? ఎందువల్ల ఈ ఉత్తరాయణ పుణ్యకాలములో ప్రత్యేకమైన సహాయము కలుగుతుంది అంటే ఈ బ్రహ్మాండములో ఉండేటటు వంటి నక్షత్రములు, గ్రహములు అన్నీ కూడా ఈ మన శరీరంలో

ఎలా అయితే అవయవములు నిర్మాణము చేసి ఉన్నాయో అదే ప్లానుమీద నిర్మాణము చేయబడి ఉన్నాయి. ఈ సూర్యుడు మధ్యనఉండి, వాని చుట్టూ తిరిగే గ్రహాలు అన్నీ కూడా అణువు లోపల సెంటరులో న్యూక్లియర్ ఉండి దాని చుట్టూ పరమాణువులు తిరుగుతూ ఉండేపద్ధతిలోనే ఉంటాయి. అణువులోనూ, సూర్యుడులోనూ ఒక్కటే ప్లాను.

అలాగే మన శరీరంలో ఈ తలపైన సహస్రార చక్రము అని, శిరస్సును మోక్షస్థానము అనీ అంటారు. యోగులు మోక్షాన్ని పొందాలంటే ధ్యాన సమాధిలో ఈ సహస్రారముపైన ఉండే ద్వారాన్ని తెరచుకొని, శిరస్సు బ్రద్దలుకొట్టుకొని అందులోని జీవుడు బయటకు వెళ్ళగల్గితే అతడికి జన్మ రాహిత్యం కలుగుతుంది. ఈ మోక్షమార్గమే ఉత్తర మార్గము. శరీరంలో మోక్షద్వారం సహస్రారంపై ఉంటుంది. అందరూ వినే ఉంటారు. శరీరానికి నవద్వారములున్నాయని. కన్ను, ముక్కు, చెవి, నోరు ఇలాగ పనులుచేసే శరీరావయవములు ప్రాణకర్తలు. మనం బ్రతకడానికి కావలసిన పనులు చేసే తొమ్మిది ద్వారములు. కానీ ఇవి అన్నం తినడానికి, మాట్లాడటానికి ఏదో ఒక పనిచేసేవే. కానీ కేవలము మోక్షానికి పనికి వచ్చే పదో ద్వారం ఒకటుంది. ఈ పదవ ద్వారము శిరస్సుపై చిన్న గుండుసూది అంత కనిపించీ కనిపించనంత సూక్ష్మ రంధ్రము. పసిపిల్లవాని మాడు మెత్తగా ఉండి ఈ మోక్షద్వారం తెరచు కొని ఉంటుంది. అందువలన పసిపిల్లవాడు రెండు నెలల వయస్సు వచ్చే వరకూ ఈ లోపల ఉన్న జీవుడు, పైన ఉండేటటువంటి భగవంతునికి కనెక్షన్ కలిగి ఉంటాడు. అందువల్లే అమాయకంగా ఉండే పసిపిల్లలకి బ్రహ్మస్థితి కలిగి ఉంటుంది. అంటే పూర్వజన్మ జ్ఞానము. కేవలం పుణ్యస్థితిలో మనస్సు ఉంటుంది. ఆ తర్వాత

మాడు క్రమంగా మూసుకుపోతుంది సిమెంటు చేసినట్లుగా. అపుడు భగవంతునికీ, మానవునికీ మధ్య గోడ ఏర్పడుతుంది. దాంతో తన స్వార్థము, అహంకారము మొదలగు కర్మలన్నీ ఈ మాడు మూసుకుపోవడంతో ప్రారంభమౌతాయి.

దీన్ని వ్యతిరేకించి సాధనతో తనలో ఉన్న చెడు కర్మలన్నీ దగ్ధము చేసి, ఎట్లాగంటే ఉపవాసము ద్వారా కొంత, దానమువలన కొంత, జపము చేసి కొంత, అన్నిటి కంటే ముఖ్యమైనది సేవ. సేవ వల్ల మరికొంత చెడు కర్మను దగ్ధము చేసి ముందుకు వెళ్ళాలి. గత జన్మ నుంచీ మనకు ఉన్నటు వంటివి ఇప్పుడు అక్కడి నుంచీ, ఇక్కడి నుంచీ తెచ్చు కొంటాము కాబట్టి ఆ సంపాదించుకొన్న పాపాలతాలూకు కర్మదోషాన్ని నివృత్తిచేసికొనాలి. ముఖ్యమైనది సేవ. శరీరమంతటితో శక్తిని ఖర్చుపెట్టి చేసే సర్వీసు వల్ల, శరణాగతివల్ల, ఆత్మ సమర్పణ (అంటే తనను తానే భగవంతునికి, భగవంతుని రూపంలో ఉన్న గురువుకు సమర్పణ చేసుకొనడం) వల్ల స్వార్థము, దాని వల్ల ఏర్పడే దోషాలూ నివృత్తి అవుతాయి. ఈ విధంగా యజ్ఞము, దానము, తపస్సు, జపము, ధ్యానము ఆత్మసాక్షాత్కారానికి దారితీసేటటువంటి మార్గాలు. ఇవి మోక్ష మార్గాలు. ఇవన్నీ కూడా ఈ ఉత్తరాయణ పుణ్యకాలంలో అనంతమైన ఫలితాల నిస్తాయి. ఎందుచేతనంటే నిటారుగా కూర్చుని ఓంకారముచేసి ప్రాణాయామము చేయాలి. ప్రాణాన్ని పైకి లాగాలి. ప్రాణాయామము అనగా క్రిందకు వెళ్ళే శ్వాసను పైకి అంటే బొడ్డుదగ్గరనుంచి హృదయానికి, హృదయము దగ్గరనుండి కంఠానికి, కంఠము నుండి భ్రూమధ్యానికి, అక్కడి నుండి శిరస్సు పైకి - బోరింగు పంపులోని నీరు ఎట్లా అయితే పంపుకొట్టితే క్రింద అడుగున పర్వతం

క్రింద నుంచీ పైకివస్తున్నాయో అట్లా మన శరీరములో అడుగున ఎక్కడనో ఉన్న ప్రాణము లోపల ఉండే లైఫ్ అంతా శిరస్సులోకి పైకి వెళ్తుంది. ఈ క్రొవ్వొత్తిలో లేక దీపారాధనలోనున్న నెయ్యి పైకి ఎక్కినట్లుగా మన శరీరములోఉన్న ప్రాణాన్ని పైకి ఎక్కించే విద్యయే యోగాభ్యాసము. దీనికి మనము క్రిందికిలాగేటటువంటివి ఏమైతేఉన్నాయో కోరికలు, అహంకారము, బద్ధకము, సోమరితనము, స్వార్థము ఇటువంటివి తగ్గించు కొనడానికి ఈ ఉత్తరాయణ పుణ్యకాలము నుంచి అరుమాసాలు ఉత్తరాయణ కాలమంతా అనుకూలమైన టైము. ఎందువల్ల ? నీళ్ళన్నీ ఆవిరై పైకి వెళ్తాయి. ఈ జనవరి 14 నుండీ జులై 14 వరకూ, అంటే వర్షాకాలం తిరిగి ప్రారంభం అయ్యేదాకా. ప్రపంచములోని అన్ని వస్తువులూ క్రింద నుంచి పైకి ప్రయాణించే టైము.జులై నుండీ మళ్ళీ ఆరు మాసాలు పైకి వెళ్ళిన నీళ్ళు మళ్ళీ క్రిందకు వర్షిస్తాయి. అంటే వర్ష రూపములో, మంచు రూపములో, ఐస్ రూపములో పైనుంచి క్రిందకు వస్తాయి అది దక్షిణాయన మార్గము. అంటే జీవులందరూ జన్మించేటటు వంటిది దక్షిణాయనము. మోక్షము పొందేది ఉత్తరాయణ మార్గము. అందువల్ల వేదములలో ఉత్తరాయణ పుణ్యకాలములో వైకుంఠములో ద్వారము తెరచి ఉంటుంది. అంటే వైకుంఠ ద్వారము (విష్ణులోకము) భూగోళానికి సరాసరి ఎదురుగా ఉంటుంది. సూర్యుని చుట్టూ భూమి తిరుగుతూ ఉంటుంది కదా! అలా తిరిగేటపుడు భూమియొక్క ఉత్తరధృవము, ధృవ నక్షత్రానికి, సప్తర్షి మండలానికి, విష్ణులోకానికి సరాసరి డైరెక్ట్ లైన్‌లో అంటే ఇక్కడి నుంచి చూస్తే విష్ణులోకం డైరెక్ట్‌గా కనబడేటట్లుగా ఉంటుంది. సప్తమహర్షులు, మోక్షము ఇచ్చేటటు వంటి బ్రహ్మవిద్యకు గురువులు. మన శరీరంలో ఏడు చక్రాలు ఎలాగో,

ఈ విశ్వంలో ఈ ఏడుగురూ ఏడు స్పిరిట్యువల్ సెంటర్స్. వాళ్ళయందు మనస్సుపెట్టి ఇక్కడ నుండి ఆరు నెలలు ధ్యానము చేస్తే క్రమముగా మనం బయట ఉన్నటువంటి విచిత్రాలన్నీ మన శరీరంలోనే చూడవచ్చు.

వేదములో చెప్పబడ్డ మంత్రములో కూడా ఈ విష్ణులోకము 'తద్విష్ణోః పరమం పదం...'. ఈ పైన కనబడే (ఉత్తరాయణ పుణ్యకాలములో కనబడే) లోకము 'విష్ణోః పరమం పదం' అంటే విష్ణుమూర్తి యొక్క వైకుంఠ లోకము. ఎందువల్లనంటే అందరు మూర్తులలో విష్ణుమూర్తి మోక్షాధికారి. ఇతర దేవతలందరూ వేర్వేరు కోరికలు తీర్చేవారు. డబ్బు ఇచ్చేది లక్ష్మీదేవి. చదువు ఇచ్చేది సరస్వతి. ఇట్లా ప్రతి దేవతకూ ఒక్కొక్క డ్యూటీ ఉన్నట్లే మోక్షకారకుడు విష్ణుమూర్తి. అన్ని కోరికలు నశించి అప్పుడు మోక్షానికి వెళ్ళదల్చుకొన్న వాళ్ళకు ఉత్తమమైన అధికారాన్ని ఇచ్చేవాడు. ధృవుడు అందరికంటే ఉత్తమ పదము ప్రార్థించాడు.ఈ ధృవపదము తక్కిన బ్రహ్మాండములో అన్నిటికంటే పైన ఉన్నది. ఎందుకంటే మోక్షమును చిన్న వయస్సులోనే కోరిన వాడు ధృవుడు. కాబట్టి కోరికలలో పడకుండా, సంసారములో పడకుండా, మొట్టమొదట దాటిపోయాడు. ఆ ధృవుడుకంటే పైన ఏమి ఉంటుంది ? ధ్యానము చేస్తుంటే వాడి శిరస్సు సహస్రారముపైన విష్ణుమూర్తి పాదాలుంటాయి. అక్కడి నుండి 30 కోట్ల యోజనాలు పైకి విష్ణు లోకము వ్యాపించి ఉంటుంది. ఆ విష్ణులోకము నుంచి వచ్చే తేజస్సు విష్ణుపాదాల్లోకి వచ్చి ఆ పాదాల లోంచి వచ్చే శక్తిని ఆకాశగంగ అంటారు. అంటే తేజస్సు రూపములో గంగ. అంటే ఆవిరి రూపంలో నీళ్ళు ఉంటాయే అలా పైన ఆకాశంలో ఉంటుంది. అది క్రింద సప్తఋషుల నెత్తిమీదపడి ఒకరి మీద నుంచి మరొకరి మీద పడి కొండ మీద నుంచి జలపాతము

పడ్డట్టుగా ఈ గంగ క్రిందకు దిగుతుంది. ఏడుగురు మహర్షుల మీద నుంచి దిగి క్రిందికొచ్చి క్రింద భూమి మీద శివుడి నెత్తిన పడి అక్కడ నుంచి మనకు మామూలుగా కళ్ళకు కనిపించే గంగానదిలాగా భూలోకంలో క్రిందకు వెళ్తుంది. ఈ మొత్తము విష్ణు పాదోదకము. హరిపాదము లోనుంచి పుట్టింది కాబట్టి ఈ గంగదిగిరావడము, మోక్షద్వారమునుంచి, మోక్షలోకము నుంచి క్రిందకు దిగి వస్తుంది. ఈ క్రిందినుండి వెళ్ళే జీవులు మోక్షార్హులు. నరకలోకము వెళ్ళే వారు క్రిందికి, మోక్షలోకమునకు వెళ్ళే వారు పైకి వెళ్తారు. ఊర్ధ్వ లోకములోకి వెళ్ళే వారు మెట్లు, మెట్లుగా వెళ్ళి సప్తర్షి మండలము, ధ్రువ మండలము, సూర్యమండలము దాటి విష్ణుమండలము గ్రహించి విష్ణు లోకానికి పోతారు.

వైకుంఠములోనికి పోయిన జీవులు వెనుదిరిగి రారు. అంటే మళ్ళీ జన్మ అనేది లేకుండా మార్గాన్ని ప్రసాదించేది వైష్ణవ పుణ్యకాలము. పరమపద పుణ్యకాలము. అందువల్ల ఈ టైములో సరిగ్గా మనస్సును ఏకాగ్రతపెట్టే ప్రాణాయామము చేసి, ధ్యానము చేసి, మనస్సును ఏక మతముచేయడం ప్రయత్నిస్తే మనకు సాధనలో అన్ని విధములా సహాయం కలుగుతుంది. అట్లాగే దేవతలలో విష్ణుమూర్తి మోక్షాధి కారకుడైనట్లుగానే మనకు మంత్రములలో మంత్రరాజము నారాయణ మంత్రము. మోక్ష మంత్రము. అంటే మనకర్మలను నశింపజేసి, మనస్సును, శరీరమును ప్యూరిఫై చేసి కర్మలు క్యాన్సిల్ చేసేటటువంటి పనిచేసే మంత్రము నారాయణ మంత్రము. ఈ ప్రణవము పరబ్రహ్మ తత్త్వాన్ని మనస్సులో ధ్యానించి, శిరస్సు గురుస్థానమును ఆవాహన చేసికోవాలి. ఈ మోక్షానికి వెళ్ళే ద్వారానికి పైన గురుపాదము ఉంది. అంటే ఎలా అయితే ఆలయానికి

వెళ్ళేటప్పుడు ధ్వజస్తంభము దగ్గర శఠారిపెట్టి ఉంటుందో, ఈ శఠారిమీద పాదుకలుంటాయి. ఈ పాదుకలు గురుపాదాలు. ఆ గురు పాదాలను శిరస్సుతో తాకడం వల్ల శిరస్సులో ఉండే మోక్షద్వారము తెరచుకొని, జ్యోతి దర్శనం అవుతుంది. అందువల్ల పరమగురు స్థానము, సప్తఋషులుండే టటువంటి శిరస్సులో ఉందే ఓంకారము, ఆ ఓంకారం చెప్పి ఇక నారాయణ అష్టాక్షరీమంత్రాన్ని చెప్పడంమూలాన ఈ శరీరంలో కేంద్రాలన్నీ తెరచుకొని ఈ తేజస్సును చూడవచ్చు. ఇది ఈ సంక్రాంతి పండుగ ప్రాముఖ్యము. సంక్రాంతి అని ఎందుకంటారంటే సంక్రాంతి అనగా సూర్యుడు మకర రాశిలో ప్రవేశించడం. మకరరాశి విష్ణుమూర్తియొక్క స్థానము. ఈ మకరములో ఉన్న శ్రవణా నక్షత్రము, విష్ణు నక్షత్రము. దానియందుండే టటువంటి విష్ణుమూర్తి గరుడ వాహనము మీద ఆశీనులై దేవతలందరికీ దర్శనమిస్తాడు. సూర్యుడు ఉత్తరాయణం తిరిగేటప్పటికి విష్ణులోకము, ఉత్తరాయణము, దానిమీద గరుత్మంతుడు, దానిమీద ఉండే విష్ణుమూర్తి మొత్తం దర్శనము అయ్యే మార్గము కాబట్టి పూర్వము భీష్ముడుకూడా ఈ ఉత్తరాయణము వచ్చినపుడే జీవుడిని విడిచి మోక్షము పొందాడు. అందువల్ల ఈ ఉత్తరాయణపుణ్యకాలంలో జరిగే ఈ శ్రీమన్నారాయణ యజ్ఞానికి హాజరగుతున్న యోగమిత్రులందరూ ఇది పవిత్రమైన సమయం కాబట్టి అటూఇటూ తిరిగి టైము వేస్ట్ చేయకుండా ఎంత అయితే జపము చేస్తారో, ఎంతవరకూ మనస్సు ఏకాగ్రత చేస్తారో. ఎంతవరకూ సాధన చేస్తారో మన ప్రయత్నములన్నీ సత్ఫలితాన్ని ఇచ్చే టైము. ఈ నారాయణయజ్ఞానికి నిస్వార్థసేవగా కష్టపడి పనిచేసే వారందరికీ కూడా భగవంతుడు మోక్ష మార్గానికి వెళ్ళేటటువంటి శక్తిని, సహాయాన్ని ఇవ్వాలని మంగళా శాసనము

చేస్తున్నాను.అంతే కాకుండా భక్తితోను, శ్రద్ధతోను ఎవరైతే సర్వీసుచేసి ఇక్కడకు వస్తారో వారందరికీ కూడా కర్మలు నశింపజేసి వారికి హృదయ నిర్మలత్వాన్ని ప్రసాదించి, వారికి చెడుకోరికలు నశింపజేసి మోక్షమార్గంలో ప్రేరణచేస్తూ సత్ఫలితాలను కలిగించే శక్తిని అందరికీ ప్రకాశింపజేస్తూ ఆశీర్వదిస్తున్నాను. అయితే సాధనకు సూర్యుడు కిరణాలు ఇచ్చినట్లుగా గురువు ప్రకాశాన్ని ఇస్తాడు. సూర్యుడు ఉదయించినాగానీ మన కిటికీ తలుపులు మూసుకొనిఉంటే ఎండ లోపలికి రాదు. అలాగే మన హృదయము, మన మనస్సు, అనుమానము, బద్ధకము, అహంకారము అనే కిటికీలు అడ్డముఉంటే గురువుఇచ్చే ప్రకాశము లోపలికి చేరదు. అందువల్ల సాధకుడుగా శిష్యుడు చేయవలసిన డ్యూటీ ఏమంటే మనలో సాధనకు పనికిరాని లక్షణాలు ఏవైతే ఉన్నాయో వాటిని నివృత్తి చేసుకోవాలి. హృదయాన్ని ఓపెన్ చేయాలి. మనకు ఇష్టము అయినా లేక కష్టము అయినా ఏ రకమైన పని ఏరకమైన డైరక్షన్ గురువుఇస్తాడో అది మనలో మనదోషాలను నిర్మూలించాలనే కానీ మన వల్ల ఏమి లాభము పొందు దామనే ఉద్దేశ్యముతో ఇచ్చాడో అని మనయందు భావన ఉంటే మన మనస్సుయందు అనుగ్రహము లోపలికి రాదు.

గురువును సర్వదేవతా మూర్తిగా శాస్త్రాలు ఎందుకు చెప్పాయంటే గురువును సర్వదేవతా మూర్తిగా అనుకోవడం వల్ల గురువు మనిషి అనే భావన ఉండకుండా భగవంతుడు అనే భావము కలుగుతుంది. భగవంతుడు అనే భావన కలగడం వల్ల ఏమౌతుందంటే సూర్యుడిలో నుండి వేడి ఎలా వస్తుందో, కుంపటి నుండి సెగ ఎలా వస్తుందో, గురువు లోనుంచి జ్ఞానము అనే శక్తి, అనుగ్రహము అనే శక్తి, యోగమనే శక్తి ప్రకాశిస్తూ ఉంటాయి.

అవి ఎంతవరకూ మనం రిసీవ్ చేస్తామో (అందుకొంటామో) అంతవరకే మన కళ్ళకు చూడగలిగే శక్తి ఏర్పడు తుంది. అంటే ఎదురుగా కూర్చొని ఉంటే ఇటువంటి తేజస్సు ఏడు రంగులలో ఇంద్రధనుస్సులాగా ప్రకాశిస్తూ కనబడుతుంది. విదేశాలలో ఇటువంటి కెపాసిటీ కలిగిన అనేకమంది సాధకులనుచూచాను. అప్పుడు ఈ ఉపన్యాసము మాత్రము చెపుతున్నపుడు గురువు శరీరములోనుండి ఇంద్రధనస్సు కిరణాలలా పైకి వచ్చినటువంటి చైతన్యకిరణాలు ప్రతివాడి శరీరానికితగిలి వాళ్ళ హృదయాలు ఎలా మేలు కొలుపుతాయో ప్రత్యక్షంగా చూడగల్గుతారు. అందువల్ల ప్రత్యక్షముగా చూడగలిగే శక్తి ఎప్పుడైనా కలుగవచ్చు. కలుగకపోనూ వచ్చు. కలుగక పోయినా గానీ మనము చేసే ప్రయత్నము చేసుకొంటూ పోతే ఒకనాటికి కాకపోయినా ఒకనాటికి మనలో ఆత్మ పరిశుద్ధి కలిగి భగవత్ సాక్షాత్కారము కలుగుతుంది. అందువల్ల ఈ నాలుగు రోజుల నారాయణ యజ్ఞంలో ఎక్కడ చిన్నపని చేసినా, ఎక్కడ పెద్దపని, కష్టమైన పని అయినా ముందు మూడు సూత్రాలు చెప్తాను. సాధనకు తోడ్పడుతవి. అవి మనస్సులో సర్వకాల సర్వావస్థలయందు పెట్టుకొని ఆచరణలో ఉంచుకొంటే ఉపయోగ పడతాయి.

మొట్టమొదట సాధనలో అడ్డము ఏమిటి ? (1) ఇష్టము, (2) కష్టము. మానవుడు సరాసరి పురోగమించకుండా అడ్డుపడేది ఒక పని అంటే ఇష్టము. ఒక పని అంటే కష్టము. అలానే కొందరంటే ఇష్టము. కొందరంటే కష్టము. ఈ ఇష్టము కష్టము అనేటటువంటిది గేటు వంటిది. అంటే గేటు లోపలికి తెరచుకొంటుంది. బయటకు తెరచుకోదు. అలాగే హృదయానికి గేటు వంటిది. కొన్నిటికి తలుపులు తెరచుకొంటాయి.

కొన్నింటికి తెరచుకోవు. ఎవరైతే మోక్షానికి వెళ్ళదల్చుకొన్నాడో ఈ ఇష్టము, కష్టము అనే రెండు తలుపులు పీకి అవతల పారెయ్యాలి. తలుపులు లేని గేటులాగా హృదయాన్ని తయారు చేయాలి. అంటే తనకు ఇష్టమైన వస్తువులు, కష్టమైన వస్తువులు సమాన దృష్టితో భగవత్ ప్రసాదములాగ స్వీకరించాలి. కష్టములు ఎప్పుడైనా శరీరానికి, మనస్సుకు కలుగుతాయి. మనము గతములో చేసిన కర్మలవల్ల కలిగే కష్టమువల్ల కర్మనశించి పోతుంది అనే భావన ఉన్నట్లైతే కొన్నాళ్ళకు తనంటే ఇష్టము, ఫలానిది కష్టము అనే తేడా నశించిపోతుంది.

యోగులు, మహాత్ములు అందరూ కూడా కష్టసుఖాలు జయించినవారు. కష్టసుఖాలు జయించినందువలన మనిషికి ఆకలి దప్పులు, నిద్రమెలకువలు, ఆరోగ్య అనారోగ్యాలు ఇటువంటి జంజాటాలన్నీ పోయి ఏకస్థితి కలుగుతుంది. సర్వకాల సర్వావస్థలయందు ఆనందమే అనుభవించే పరబ్రహ్మ స్థితి కలుగుతుంది. అలాకాకుండా మన ఇష్టము, కష్టము అని కొట్టుకు ఛస్తుంటే ఇక్కడ ఇలాగే ఉంటాము. నీళ్ళలో పడ్డ ఈగలాగ కష్టము, సుఖము అనే దాన్లో కొట్టుకొంటూ ఉంటాము. ప్రక్కవాడిని చూసి చీదరించుకొంటూ, అసూయపడుతూ ఉండే మనస్సుకు ధ్యానానికి సమయం ఎక్కడిది!? అందువల్ల ఈ చిల్లర ఆలోచనలను కట్టిపెట్టి ప్రతివాడు ఒక డైరీ పెట్టుకొని తనలో ఉన్న ముఖ్యమైన డిఫెక్ట్స్ ఏమున్నాయో నోటు చేసుకోవాలి. తన బలహీనతలు తనకు సామాన్యముగా ఏవి అడ్డము ఉన్నాయో, ఒకరికి కోపము ఉంటుంది. ఒకరికి అహంకారము ఉంటుంది. ఇంకొకడికి ఇతరుల మీద అధికారముచేసే లక్షణము ఉంటుంది. ఇంకొకరికి పడుకొని ఎప్పుడూ నిద్రపోయే అలవాటు ఉంటుంది. ఇంకొకరు

ఏదైనా పని చెప్పగానే ఇతరులు చేస్తారేమో మనకంటే ముందు వాళ్ళు వెడతారులే చూద్దాము అని వెనక్కి తప్పుకొనే అలవాటు ఉంటుంది. ఇలా ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క రోగము ఉంటుంది. అది పోగొట్టుకోగలిగితే వీడు ముందుకు వెళ్ళగలుగుతాడు. అప్పుడు గురువు ఇచ్చే ప్రకాశము హృదయాన్ని చేరుతుంది. అప్పుడు దోషాలుపోతాయి. ఇది సాధనలో ముఖ్యమైన మెట్టు. రెండవది ప్రతి నిత్యమూ ఐదు నిమిషాలు మానవుడు ధ్యానము చేయాలి. జపముకాకుండా ఈ సూర్యుడులోనుండి వస్తున్న కిరణాన్ని, గురువులో నుండి వచ్చిన ప్రకాశాన్ని మన అంతరాత్మలోని వెలుగునూ కలిపి అనుసంధించి ఏకస్థితిలో దర్శించడానికి ప్రయత్నము చేయాలి. ఈ ప్రయత్నం మొదట్లో మన వల్ల కాకపోయినా సహాయము చేయుమని గురువును ప్రార్థించి నమస్కారముపెట్టి కూర్చుంటే- నమస్కారము పెట్టేక సాయము చేస్తారో లేదో అని సందేహములో కూర్చొనకుండా పూర్తి భారము వాడి మీద విడచి కూర్చోవాలి. వాడు అనగా ఎవరు ? ఒక్కడే గురువు అంటే భగవంతుడు. మనము మేకుకు చొక్కా విప్పి ఎలా తగిలిస్తామో అలా మనస్సు, బుద్ధి, అహంకారములను విడిచి భగవంతుడు అనే ఆధారానికి కట్టి కండ్లు మూసుకొని కూర్చోవాలి. సర్వ బాధలు, సర్వచింతలు అవే చూసుకొంటాయి. క్రమముగా నశించి పోతాయి. ఆలోచనలు క్రమముగా అంతర్ముఖమవుతాయి. క్రమముగా ధ్యానము, తేజస్సు, కళ్ళు మూసుకోగానే బ్రహ్మాండమంతా వెలుగు కనబడి ఒక్కొక్కటి ప్రతివారికీ అనుభవంలోకి రావాలి.

ఈ రావడానికి మహాత్ములయొక్క చరిత్ర పారాయణ చేయాలి. మహాత్ములను దర్శించాలి. ఎక్కడికి వెళ్ళి వారిని దర్శించినా లోపల

పరమాత్మని, పరమగురువుని, ప్రపంచానికి అంతటికీ గురువు లోపల ఉండేటటువంటి భగవంతుడు ఒక్కడే అనే భావనతో నమస్కరించి వారి యందున్న మంచిని తీసుకొంటూ తనకున్న గురువును, తనకు ఇచ్చిన మార్గాన్ని విడిచి పెట్టకుండా ఉండాలి. తనకిచ్చిన మాట విడిచిపెడితే ఏమవుతుంది. తను వెళ్ళేటటువంటి ప్రయాణము టిక్కెట్టు పారేసుకొన్నట్లు అవుతుంది. తన టిక్కెట్టు తాను జాగ్రత్తగా ఉంచుకొని ఏది కనబడినా దీనిలోనే కలిపేయాలి. ఒక అగ్నిని సమిధతో వెలిగించి ఎన్ని సమిధలు దొరికినా అందులోనే పెడితే అంతా కలిసి ఒకే మంట (అగ్నిహోత్రం) అవుతుంది. అలాగే మన లోపలఉన్న ధ్యానాన్ని, తనకున్న గురువును తనకున్న మంత్రాన్ని విడిచిపెట్టకుండా ఉండాలి. అలాకాక ఇది వరకు తెలియకగానీ, వేరే కారణం వల్లగానీ, ఒక నిర్దిష్టమైన గురువు, మంత్రం లేకుండా పది మార్గాలు పడి, పది రకాలుగా చేస్తూ ఉండి ఉంటే మనము ఆలోచించుకొని ఏదో ఒకటి నిలబెట్టుకొని మిగతావన్నీ దానికంటే తక్కువ చేసుకొంటూ తీసివేసి క్రమముగా ఏకముఖము చేయాలి. మనస్సు, అనేక ముఖములు అయినపుడు ఏకాగ్రతరాదు.

ఇవి సాధనకు ముఖ్యమైనవి. ఇది ఈ సంక్రాంతి మహాపర్వదిన సందర్భముగా మంగళాశాసనములు చేస్తూ ఈ నాలుగుమాటలు మీకు చెప్పాను. అందరికీ మంగళాశీస్సులు. హరిః ఓం తత్సత్

(పూజ్యగురుదేవుల ఉపన్యాసం క్యాసెట్ ఆధారముగా)

గురుసేవగా ఈ ఉపన్యాసమును వ్రాసినవారు

కీ.శే. శ్రీ వై.వి.యల్. నరసింహారావుగారు.



# 2

# “గురుపూర్ణిమ” - సందేశము

## సాధనలో - సద్గురువు సహాయం

ప్రియమైన యోగమిత్రులందరికీ ప్రేమపూర్వక మంగళా శాసనములు. ఈరోజు పవిత్రమైన విజయదశమినాడు శ్రద్ధగా ఈ శుభలగ్నమందు ‘నిడదవోలు’ యోగమిత్రమండలి శాఖలో నిర్మాణం చేసిన ఈ సాయినాథుని విశాలమందిరాన్ని మనం సద్గురువు అయినటువంటి సాయినాథుని ఆశీస్సులతో ఆవిష్కారము చేస్తున్నాము.

ఈ సందర్భంగా ‘సాధనలో సద్గురువు సహాయం’ అన్న విషయం పైన ఒకటి రెండు మాటలు చెప్పుకొందాము. బాబా చరిత్ర పారాయణ చేయటం, తద్వారా సద్గురువు యొక్క సహాయం ఎలా ఉంటుందో అన్న అంశం కొంత అనుభవం, కొంత అవగాహన ఉంటుంది.

దీనివిశేషం ఏమిటంటే, మానవుడు సృష్టిలో భగవంతుని స్వయంగా

తనంతతాను చేరుకోలేడు. సామాన్య మానవుడు తన మనస్సుతో భగవంతుని చేరుకోవడం చాలాకష్టము. కొన్ని సంవత్సరాలు పడుతుంది, కొన్నిజన్మలు పడుతుంది. కొన్ని వందల జన్మలు కూడా పట్టవచ్చు. కనుక తనంత తాను స్వప్రయత్నంచేత భగవంతుని చేరుకోలేనటువంటి దుర్బలత్వం వల్ల, మానవునికి భగవత్ సాన్నిధ్యాన్ని కలిగించేటువంటి నిచ్చెనలాంటివాడు సద్గురువు.

మనం మామూలుగా నిచ్చెన ఎందుకు ఉపయోగిస్తాము ? పైకి ఎక్కడానికి. ఆకాశమంత ఎత్తున ఉంది ఈ గోడ. మేడమీదకి క్రింది నుంచే ఎక్కాలంటే ఈ మెట్లు మెట్లుగా ఉన్న నిచ్చెన ఉపయోగిస్తున్నాము. ఆ నిచ్చెనయొక్క స్వరూపం ఏమిటి ? ఈ నిచ్చెన క్రిందిమెట్టు మనకు అందుబాటులో ఉంటుంది మొట్టమొదటి మెట్టు. చివరి మెట్టు పై అంతస్థులో ఉంటుంది. అలాగే ఈ సద్గురువు అనేటువంటి వారి పాదాలు భూమిమీద, మనం నడుస్తున్న చోటే ఆయన నడుస్తూ, మనం బ్రతికేటు వంటి బాహ్యాప్రపంచంలోనే ఆయనా జీవిస్తుంటాడు, కానీ ఆయన మనస్సు, అంతరాత్మ భగవంతునితో లింకు పెట్టుకొని ఉంటుంది. అంటే నిచ్చెనకి ఎట్లా అయితే పైమెట్టు పైఅంతస్థులోను, కింది మెట్టు కింది అంతస్థులోనూ ఉన్నట్లు, ఈ సద్గురువు యొక్క శరీరం భూలోకంలోను, మనస్సు, ఆత్మ పైలోకంలోనూ ఉంటాయి. అయితే ఈ నిచ్చెన మనకు ఎప్పుడు సహాయ పడుతుంది ? మెట్టు మెట్టుగా పైకి పోగలిగినప్పుడే! అంటే సాధనలోమెట్లు మనకి సహాయ పడతాయి.

సూక్ష్మంగా చెప్పాలంటే భగవత్ సాన్నిధ్యాన్ని చేరడానికి మానవునికి సద్గురువు అనేవాడు నిచ్చెనవంటి వాడు. ఈ నిచ్చెనలో మొదటి మెట్టు

భూమిమీద ఎలాగైతే ఉంటుందో, అదే విధంగా సద్గురువు శరీరంలో మనలాగే పైకి అదేలెవల్‌లో కనబడతాడు. ప్రార్ధనలో చెప్పినట్లు 'స్వభక్తేచ్ఛయా మానుషం దర్శయంతం' అంటే స్వభక్తేచ్ఛయా - భక్తుల కోరికవలన, మానుషం - మానుష రూపంలో, దర్శయంతం - కనబడతాడు సద్గురువు. మానుష రూపంలో కనబడకపోతే మనం భయపడ్తాము దగ్గరకి పోలేము. అందువల్ల మనకు సులభంగా అందు బాటులో ఉన్నట్లుగా కనబడతాడు. అందువల్ల భక్తులు ప్రతివారూ దగ్గరకి వెళ్ళి ఆస్వాదించగలుగుతారు. కానీ నిజానికి ఆయన స్వభావం 'సదాసత్ స్వరూపం' ఎప్పుడూ సత్యలోకంలో ఉండేటటువంటి బ్రహ్మరూపం. 'చిదానందకందం' నిరంతర ఆత్మానందంలో ఉండేటటువంటి వాడు సద్గురువు. సత్‌స్వరూపం - అంటే బ్రహ్మ స్వరూపం. పైన ఉండేటువంటి సత్యలోకంలో ఏదైతేఉందో నిచ్చెన యొక్క ఆఖరిమెట్టు ఎక్కడైతే ఉందో దానితో మనస్సు అనుసంధానమై సత్యమునకు లయమై ఉంటుంది. అప్పుడు ఏమౌతుంది ? 'సమాదిత్యుడు' అవుతాడు. అప్పుడు సమాధిస్థితిలో తన అంతరాత్మ భగవంతునితో ఐక్యభావాన్ని కల్గిఉంటుంది. అప్పుడు బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ ఉంటాడు. బ్రహ్మానందము అనేది, తానే భగవంతునితో ఐక్యభావాన్ని కూర్చినటువంటి ఆనందము.

'జగత్సంభవస్థాన సంహారహేతుమ్' ఈ జగత్తునకు సంభవత్ - అంటే ధృతి పుట్టడానికి ఎవరు కారణమో, స్థాన అంటే ఇది ఈ విధంగా నిలవడానికి పోషణ కర్త ఎవరో, సంహార - అంటే చివరికి ప్రపంచ ప్రళయానికి ఎవరు కారణమో అనగా సృష్టి, స్థితి, లయలనే మూడు దశలు ఈ ప్రపంచానికి జరిపించేటువంటి పరమాత్మ ఎవరైతే ఉన్నారో ఆయనే ఈ లోకం దర్శిస్తాడు. అంటే ఈ శ్లోకానికి అర్థం ఏమిటంటే, సృష్టి, స్థితి, లయలు చేసేటువంటి

పరబ్రహ్మమే మానుషస్వరూపంలో, మానవులు తరించటం కోసం తాను పరబ్రహ్మ స్థితిలో ఉండేటువంటి ఆనందానుభూతి స్థితిలోనే ఉంటూ మానవులను ఉద్ధరించడానికి భూలోకంలో సద్గురురూపంలో అవతరిస్తాడు.

సాయినాథ చరిత్ర చదువుకొనే వారిలో ఉపాసినీ బాబా విశేషత చాలా మందికి తెలియదు. ఎందుకంటే వారంతా ఈ మధ్య వ్రాయబడిన బాబా చరిత్ర పుస్తకాలు చదువుతూ ఉంటారు కనుక. కాబట్టి అందులో ఈ ఉపాసినీ శాస్త్రి విషయం చాలామటుకు లేదు. సాయినాథుడు శరీరంతో ఉన్న రోజులలో అనేక వేల మంది ఆయనను దర్శించారు. అనేక మంది భక్తులు వారియొక్క ఆశీస్సులను, ఆయన సహాయాన్ని రక్షణ రూపంలో పొందారు. కానీ అందులో బ్రహ్మత్వాన్ని, మోక్షాన్ని కోరిన వారు చాలా కొద్దిమంది. చాలామంది పిల్లల పెళ్ళిళ్ళకి, కష్టాల నివారణకి, రోగ నివారణకి, ఇలా ఏదో ఆపద వచ్చినపుడు కాపాడటానికి, ముఖ్యంగా టైము ఉన్నప్పుడు సాధన చేసుకోవడానికి ఆశ్రయించారు. అలాకాకుండా పూర్తిగా సర్వస్య శరణాగతి చేసి సాధన చేసినటువంటి ఒక శిష్యుడు ఉపాసనీశాస్త్రి.

బాబా అంటుండేవారు 'నా దగ్గర బోలెడంత ఖజానా మూలుగుతూ ఉంది. దాన్ని పట్టుకు పోవడానికి ఎవరూ రావడం లేదు. తుచ్ఛ వస్తువులు అన్నీ అడుగుతున్నారు, పిల్లలు, పెళ్ళిళ్ళు, డబ్బులు అనీ, నేను ఏదైతే బ్రహ్మాండమనీ, ప్రజలకి ఇద్దామని తాళంలేని ఖజానా ఉంచానో ఆ బ్రహ్మజ్ఞానం వైపు ఎవరూ కన్నెత్తి అయినా చూడటం లేదురా' అని. వీళ్ళ చిల్లర బుద్ధులు చూశాక విసుగొచ్చి శరీరం వదిలివేద్దామని పరమాత్మ సన్నిధికి వెళితే మహాసమాధిలో, భగవంతుడు పర్మిషన్ ఇవ్వలేదు, ఈ ప్రజలంతా అథమ స్థితిలో ఉన్నారు, కాబట్టే వీళ్ళందరినీ ఉద్ధరించడానికి

కొన్నాళ్ళు ఈ భూలోకంలో ఉండాలని తిరిగి పంపించేశాడు. ఇది బాబా చరిత్రలో మనకందరికీ కనిపిస్తుంది. మూడు రోజులు పూర్తిగా ఉచ్ఛ్వాస, నిశ్వాసలు నిలిచిపోయి డాక్టర్లు ప్రాణం లేదని నిర్ధారించినా, తిరిగి మూడు రోజుల తరువాత భగవంతుని ఆజ్ఞ కనుక తిరిగి వచ్చారు. ఆ తరువాతనే ఈ ఉపాసనీ మహారాజు ఆయనను దర్శించారు.

ఈ ఉపాసనీ ఒక అగ్నిహోత్ర బ్రాహ్మణుడు, అంటే పుట్టుకతోనే మంచి బ్రాహ్మణ వంశంలో జన్మించి, చిన్నప్పుడే యోగాభ్యాసం చేసి, భగవంతుని యందు ఆసక్తికలిగిన వేదవేదాంగపారదుడు. ఈయన వైరాగ్యం, యోగాభ్యాసం మీద ఆసక్తిచూచి ఇలా కాదనిచెప్పి తండ్రి, తల్లి గంగాబాయి వీనికి పెళ్ళి చేశారు. చేస్తే రెండుసార్లు ఇంట్లోనుంచి పారిపోయాడు. మళ్ళీ పట్టుకువచ్చి గృహస్థాశ్రమంలో చేర్చారు. తరువాత కొన్నాళ్ళకి భార్య మరణించింది.మరి కొన్నాళ్ళకి ఇంకో పెళ్ళి చేశారు. ఇలాగ 'పరోక్ష ధర్మయా' అని పరధర్మలకి వ్యతిరేకంగా తల్లిదండ్రులు ఎలాంటి ప్రయత్నాలు చేస్తారో అవి ఎలా వీగిపోతాయో ఉపాసనీశాస్త్రి జీవితాన్ని చూస్తే తెలుస్తుంది. చివరికి ఉపాసనీ శాస్త్రి ఒక గురువు వద్ద చేరి యోగాభ్యాసం నేర్చుకొన్నాడు. ఈ యోగాభ్యాసం అంతా చేస్తూ ప్రాణాయామం వరకూ వచ్చాక సాధన చేస్తుండగా ఏదో పొరబాటు జరిగి ఏదో తెలియకుండానే ఆయన ఊపిరి పీల్చుకొంటే బయటకురాని, బయటకు వదిలితే లోనికి పీల్చుకోలేని స్థితి వచ్చింది. ఎవరికి అయినా శ్వాస నిలిచిపోతే మరణిస్తారు అని ఉపాసనీశాస్త్రి భయపడి పోయినాడు. అలా ఆరుమాసాలు బ్రతికున్నాడు. ఇది రోగం అనుకొని తల్లిదండ్రులు ఇచ్చే ఆయుర్వేద మందులన్నీ మింగాడు. తరువాత దేశంలో తెలిసిన వైద్యులందరూ పరీక్ష చేసి ఇది రోగం కాదు యోగా భ్యాసంలో

నీవు ఏదో పొరబాటు చేశావు కనుక సద్గురువులాంటి యోగి ఎవరో స్టడీచేసి చెప్పవలసిందేకానీ మా వైద్యంతో తేలేది కాదు పొమ్మన్నారు.

అపుడు దేశసంచారానికని కాలినడకన బయలుదేరి ఎక్కడెక్కడ మహాత్ములున్నారో వారందరినీ కలుస్తూ ఎవరు తన ప్రాణం నిలబెడతారా అని చూస్తున్నాడు. అలా ఝాన్సీ నుంచి ఆయన మహారాష్ట్రలో వెడుతుంటే అక్కడ ఒక చోట ఫకీరు కనబడి చెప్పాడు. ఇక్కడికి దగ్గరలో కోపర్గామ్ అనే ఊరుఉంది. దానికి దగ్గరలో షిర్డీలో సద్గురువైన సాయినాథుడు అనే యోగీశ్వరుడు ఉన్నాడు. వెళ్ళి ఆయన ఆశీస్సులు తీసుకో, నీకు తప్పక ఉపకారము జరుగుతుంది అని చెప్పాడు. అది విని అక్కడ ఉన్న మిగతా భక్తులని కనుక్కొని సాయినాథుడు ఫకీరు అని తెలుసుకొని ముస్లింను దర్శించటం ఇష్టంలేక మానుకొన్నాడు.

ఆ తరువాత నారాయణవనం అనే ప్రదేశం వెడితే అక్కడ నారాయణ మహారాజు అనే ఇంకో యోగి ఉండి గట్టిగా చివాట్లు పెట్టాడు: 'మూర్ఖుడా ఎవరికీ అందని సమాధిస్థితిలో ఉన్నావు నువ్వు, గురువు యొక్క అనుగ్రహం చాలాఉంది నీకు. అయినా,గురువు దగ్గరకి వెళ్ళకుండా నిలబడి ఉన్నావు'. అంటూ ఆయన కూడా షిర్డీ వెళ్ళమంటాడు. అప్పటికి కూడా వెళ్ళలేక - ఒక ప్రక్క ముస్లిం వద్దకు వెళ్ళవలసి రావడం, ఒక ప్రక్క తన బ్రాహ్మణత్వం అపవిత్రము అవుతుందేమో అనే ఉద్దేశ్యము, పోకపోతే రాలిపోతుందీ శరీరము, ఈ భయము చేత తిరుగుతూ అలా ఒక చోట ఒక గుహలో కూర్చొంటాడు. కూర్చోగానే ఈయనకు నిద్రలాగా వచ్చి సమాధి స్థితిలోకి చేరి ఆరుమాసాలు ఒళ్ళు తెలియని స్థితిలో ఉంటాడు. ఒక రోజు ఆ ప్రక్కనుంచి గుహలోకి నీళ్ళు వచ్చి మెలకువ వస్తుంది. (గుహలోకి

నీళ్ళువచ్చేంత విపరీతమనేదిరాదు ఆజ్ఞలేకుండా). ఆరుమాసాలు అన్నాహారాలు లేక తపస్సులో ఉండటము చేత ఆ ప్రక్క సెలయేరులో నీళ్ళు త్రాగుదామని చేత్తో నీళ్ళు తీసుకుంటుంటే ముందు కనిపించిన ఫకీరే కనిపించి 'ఆ నీళ్ళు తాగావా చచ్చిపోతావు నీవు!!' అన్నాడు. అప్పుడు ఈయన నాకు చాలా బాధలున్నాయి అని తెలియజేయగా, 'ఆ ప్రక్కనే ఊరిదగ్గరకి వెళ్ళి ఎవరినైనా అడిగి కాయించుకొని ఉడుకునీళ్ళు త్రాగమన్నాడు' ఆయన ఆజ్ఞప్రకారం ఈయన వెళ్ళి ఉడుకునీళ్ళు తాగగానే ఆ రోగంపోయి ఆశ్చర్య పోయాడు ఏమిటా ఇది ఎన్నివైద్యాలు చేసినా తగ్గనటువంటిది ఈ వేడి నీళ్ళు తాగగానే, ఉచ్ఛ్వాస నిశ్వాసలు మామూలుగా వచ్చాయి !! అని. అప్పుడు ఎదురుగుండా ఉన్న ఫకీరు చెప్పాడు శిరిడీ వెళ్ళమని. అప్పుడు నిశ్చయించు కొని కాలినడకనే షిరిడీచేరి సాయిని దర్శించి ఆశ్చర్యపోతాడు. ఎందుకంటే ఇంతకు ముందు అనేక చోట్ల చివాట్లు పెట్టి అనేక సార్లు కన్పించిన ఫకీరు అతనే. అప్పుడు బాబాను చూడగానే ఆయన ముస్లిం అన్న భావన అంతరించి శ్రీరామచంద్రుడే వాసుదేవ రూపంగా అవతారంగా అచ్చట ఉన్నట్లు గోచరించి ఆనంద బాష్పాలు రాలగా, పశ్చాత్తాపంతో ఇంత కాలంగా తన తప్పుడు భావంతో గురువు పిలిచినా వెళ్ళని తన కర్మకు ఆవేదన పడి ఆయన కాళ్ళమీద పడి అపరాధము కోరుకొని స్తోత్రము చేశాడు. 'సదానంద రూపం...' అని ఎనిమిది శ్లోకాలలో అష్టకము చెప్పాడు. దత్తాత్రేయ అవతారమే ఈయన అని తెలుసుకొన్నాడు. త్రిమూర్తి అంశయందు సృష్టి, స్థితి, లయకారకులైన పరబ్రహ్మ ఎవరైతే ఉన్నారో 1)కళ్ళతో కనబడనటు వంటివాడు, 2) బుద్ధికి అందనటు వంటివాడు, 3) మనస్సునకు అతీతమైనటువంటి వాడు

అయిన పర్రబహ్మ భక్తులకి కనిపించడం కోసం ఒక ఆకారం ధరించే అవతరించారు. ఎవరైతే అయన పాదాల దగ్గరకి చేరుకుంటారో ఆనాటి నుంచే సద్గురువు వారియొక్క ఐహిక, ఆధ్యాత్మిక కర్మలన్నింటికీకూడా బాధ్యత తీసికొని దాని కర్మ నివారణ బాధ్యత ఆయన తీసుకొంటారు అనే నమ్మకం వారికి కలిగింది. అప్పుడు ఉపాసనీశాస్త్రిని పిలిచి ఆశీర్వదించారు బాబా. ఎవ్వరికీ ఇవ్వలేదు అలా. అందరికీ 'అల్లామాలిక్' అంటే భగవంతుని అనుగ్రహము ఎలా ఉంటే అలా జరుగుతుంది' అనే చెప్పేవారు. కానీ ఉపాసనీశాస్త్రిని పిలిచి 'నీవు మూడు సంవత్సరములు ఇక్కడ కదలకుండా శిరిడీలో నా దగ్గర ఉండు నీ పద్దులన్నీ సరిచేసి పంపిస్తాను' అని చెప్పారు. ఉపాసనీ శాస్త్రికి తెలియదు పద్దులు సరిచేయటం అంటే ఏమిటి అని. వెంటనే రు.50/-లు దక్షిణ ఇవ్వమని అడిగారు బాబా. ఈయన దగ్గర రు.10/-లు కూడా లేవు. అదే విషయం బాబాతో అంటే ఊళ్ళో భిక్ష చేసి పెట్టమన్నాడు. ఎందువల్లనంటే భిక్షచేయడం వలన మనిషిలోని అహంకారం, అభిమానము నశించి, నేను ఏదో గొప్పవాడిని, నాకు చాలా అర్జంటుపనులున్నాయి అనే భావన పోతుంది. ఏదో గురువు దగ్గరికి వెళ్ళటం, భిక్ష చేయడం ఇదంతా ఎక్కడ జరుగుతుంది అనేభావన కూడా పనికిరాదు గురువు దగ్గర. అందువలన ఆ భావం ఉపాసనీనుంచే తీసివేయడానికి భిక్ష చేయమని పంపించేవారు. అట్లా వారాలుంటూ, అన్నం తింటూ, సత్రంలో రోజూ సాయినాథుని సేవించుకొంటూ కొన్నాళ్ళున్నాడు. అయితే ఈ ఉపాసనీ శాస్త్రికి కొన్ని అలవాట్లున్నాయి. అవి ఏమిటంటే చిన్నప్పటి నుంచీ ఆయన నేర్చుకొన్న జపం, గాయత్రీ మంత్రం చేసేవాడు. ఇట్లా ఉదయం ఏదోజపాలు, స్తోత్రాలు చదువుకొంటూ ఉండేవాడు. ఈ

సాయినాథుడు కేక లేసేవాడు. ఎప్పుడు జపం చేసినా మానేయమనే వాడు. ఈ ఉపాసనీశాస్త్రికి ఆశ్చర్యం! ఏమిటి? గురువు అనేవాడు జపం చేయమని చెప్పాలి, స్తోత్రాలు చదవమని చెప్పాలి. ఈయన జపం వద్దంటారు. ఏమిటి? "నోరు మూసుకొని కూర్చో అన్నీ పనులు నేను చేస్తాను. నీవు ప్రశాంతంగా కూర్చో" అని చెప్పారు బాబా. సరే కొన్నాళ్ళకి విసుగొచ్చి జపం మానేసి గురువు చెప్పినట్లే వింటానని కూర్చున్నాడు. కానీ కొంతసేపయ్యాక తనకు తెలియకుండానే జపం మొదలయ్యేది. మనసులో జపం మొదలవగానే సాయినాథుడు కనబడి మళ్ళీ చివాట్లు వేసేవాడు. చివరికి మసీదునుంచే వెళ్ళగొట్టి ఊరిబయట ఖండోబా దేవాలయం దగ్గర కూర్చోమని చెప్పారు. ఖండోబా శివుడు, చుట్టు ప్రక్కల శ్మశానం. ఉపాసనీ శాస్త్రికి శవాలంటే భయం. రాత్రికి దయ్యాలు భూతాలు వస్తేయోమోనని. కానీ సాయి ఆజ్ఞకు తిరుగులేదు. అందుకని నోరు మూసుకొని వెళ్ళి ఖండోబా దేవాలయంలో కూర్చున్నాడు. ఆ కూర్చున్నప్పుడు మనస్సు విడిచిపెట్టేశాడు. అలా విడిచి పెట్టగానే మనస్సు చాలా ఫ్రీ అయింది. ధ్యాన స్థితి కలిగింది. ధ్యానస్థితిలో స్టేజి మీద చూచినట్లు ఒక్కొక్కటి చూచేవాడు. మొదటిరోజు ధ్యానంలో కూర్చోగానే ఒకవ్యక్తి మధ్య వయస్కుడు, 30. సంవత్సరముల వయస్సున్న వ్యక్తి త్రిశూలం పుచ్చుకొని వస్తాడు. వచ్చి శిరస్సుమీద చేయిపెట్టి ఆ పైన సీసామూత తీసినట్లు ఒక పెంకు తీసివేస్తాడు. ఆశ్చర్యపోతాడు. తన తల బ్రద్దలైపోతుందేమోనని. అప్పుడు ఆ తలకాయలో చేయిపెట్టి జాడీలో ఊరగాయ తీసినట్లు ఒక్కోటి తీసి (ఒక్కోటి జ్ఞాపకం ఉండేవి కొన్ని జ్ఞాపకం ఉండవు.) మళ్ళీ సాయంకాలం అయ్యేసరికి శరీరంలోప్రవేశ పెట్టేసి మూతపెట్టేసి వెళ్ళిపోతుండేవాడు. ఆ ప్రకారంగా మెలుకువ వచ్చేది

ఉపాసనీ శాస్త్రికి. అప్పుడు బాబా పిలచి భిక్ష చేసి రా పో! అని పంపించేవాడు. మళ్ళీరాగానే కూర్చుంటే రాత్రికి ఇదే తంతు. ఇదే ప్రకారం జరిగేది. ఇలా ఒకటిన్నర, రెండు సంవత్సరాలు గడిచేటప్పటికి ఉపాసనీశాస్త్రికి అపూర్వ మైన అనుభవాలు కలిగాయి. కొన్ని మనకి తెలియవు. కొన్ని రికార్డులు కూడా ఉన్నాయి. క్రమక్రమంగా బాబా చెప్పారు. 'నీ కోర్కెలన్నీ తీసేస్తు న్నానని, నీ కర్మలన్నీ కూడా క్షయం చేస్తున్నాను' నీవు మాత్రం కదలకుండా మెదలకుండా ఉండమని, ఏమి జరిగినా సరే!! నీ గత కర్మలు ఏవైతే ఉన్నాయో అవి అన్నీ వచ్చేస్తాయి. ఇప్పుడు దానికి తట్టుకొని నీవు నిలబడితే నీ కర్మశేషం పూర్తిఅవుతుంది. అని గత కర్మలు ఒక్కొక్కటిగా వచ్చేవి. ఇంటి నుండి డబ్బులు పంపటం మానేశారు. ఉద్యోగం, సద్యోగం లేకుండా అక్కడ కూర్చుంటే ఎవరు పంపిస్తారు? భోజనం పెట్టేవారు డబ్బు లేకుండా అరువు పెట్టం అనేవారు. కానీ పూర్వకాలం కాబట్టి పంక్తిలో కూర్చుంటే భోజనం లేదు అనేవారు కాదు. ఒక రోజు ఊళ్ళో అందరూ వేళాకోళం చేసారు అరువు భోజనానికి వచ్చాడు అని. ఈయనకి కోపం వచ్చి విస్తరి ముందు నుంచి లేచివచ్చేశాడు. ఆ రోజు సాయినాథుని దగ్గరకు వెళ్ళి కలుసుకొని నా కష్టాలు ఇలా ఉన్నాయని చెబుదామనుకుంటే కసురుకొని పొమ్మంటాడు. పోయి కండోబా దేవాలయంలో కూర్చోమన్నాడు. ఈ బాధకి ఆయన భరించలేక చివరికి అన్నం మానేసి ఉపవాసం చేసి చచ్చిపోదామని నిశ్చయించుకొని కూర్చున్నాడు ఉపాసనీ శాస్త్రి. మర్నాడు ఉపాసనీ శాస్త్రి రోజూలా భోజనానికి ఎందుకు రాలేదు, ఏమిటి? అంటే, కొందరు ఉపవాసము చేస్తున్నాడు అనీ, ఈయన పేరు ఉపాసనీ కాదు ఉపవాసనీ అని వేళాకోళం చేస్తారు. ఇది విని ఇంకా పౌరుషము వచ్చి దుఃఖిస్తూ

సాయినాథుని దగ్గరకు వెళితే, మళ్ళీ మామూలే 'కండోబా దగ్గరకి వెళ్ళు, నా దగ్గరకి రావద్దు, మాట్లాడవద్దు' అని. చివరికి అన్నాహారాలుమాని ప్రాణ త్యాగానికి నిశ్చయించు కొన్నాడు. కానీ పోయే అవకాశం ఏమీ కనబడలేదు!!! అప్పుడు అర్ధమైంది సద్గురువు బలం ఏమిటో !! అన్నం తినకపోయినా బ్రతికించేది బాబా!

అయినా పౌరుషం అనేది ఉండటం చేత ఉపాసనీ శాస్త్రి శరీరం అనేది పోవాలనే ఉద్దేశంతో అప్పుడు శిరిడీలో రోడ్డు బాగుచేస్తున్నారు. పదిమంది పట్టుకులాగే రోలర్‌లాగి రోడ్డు బాగుచేసేవాడు. పెంటకుప్పలన్నీ ఊడ్చేవాడు. అక్కడ లెట్రిన్‌లు, స్నానాల గదులు అన్నీ బాగుచేసేవాడు. అంటే శరీరం త్వరగా అరిగి పతనం అయిపోతుందని. భోజనం మానేసి మిటమిటలాడే ఎండలో ఇసుకలో పండుకొనేవాడు, సూర్యుని వంక చూస్తూ. ముళ్ళు, గాజు పెంకులు అన్నీ వేసుకొని పడుకొనేవాడు. మామూలు జనం ఎవరూ తన దగ్గరకు రాకూడదు, పలకరించకూడదు అని. ఏం చేసినా ఇతడి ఆరోగ్యం అభివృద్ధి అవుతోందే కానీ ప్రాణం పోయే సావకాశం ఏమీ కనబడటం లేదు. తరువాత ధ్యానానికి కూర్చుంటే సమాధి స్థితి కలిగేది. అవన్నీ ఆధ్యాత్మికంగా బ్రహ్మాండంగానే ఉండేవి. లౌకిక సమస్యలు మాత్రం పీడించేవి.

ఒక రోజున టెలిగ్రామ్ వచ్చింది. భార్యకి తీవ్రమైన అనారోగ్యం, చావు బ్రతుకుల మధ్య ఉందని, రమ్మనీను. ఉపాసనీ శాస్త్రికి భార్య అంటే అభిమానము. రెండు పెళ్ళిళ్ళు వరకూ పట్టించు కోలేదు కానీ, మూడవ పెళ్ళితో భార్య అంటే అభిమానము పెరిగింది. కనుక ఆఖరి చూపు

చూడమని వచ్చిన వార్త తీసుకొని బాబా దగ్గరకి వెళ్ళాడు పర్మిషన్ తీసుకోవాలని, ఆయన ద్వారకామాయిలో కూర్చుని ఈయన లోపలికి కూడా రాకముందే 'పో... పోయి నేను చెప్పిన చోటనే ఉండు. పో' అనే గద్దించారు. మూడు రోజులు అయిన తరువాత కనబడమన్నారు. సరే మూడు రోజులు అయిన తరువాత కనబడదామనుకుంటే భార్య పోయినట్లు టెలిగ్రామ్ వచ్చింది. అప్పుడు చాలా బాధపడ్డాడు. జీవితంలో ఎప్పుడూ చేయనటు వంటి నష్టం కలిగింది. కనీసం ఒక్కసారైనా ఆఖరిచూపులైనా నోచుకోలేదు అని. ఆ కోపంతో బాబా మందిరానికి వెళ్ళాడు, మళ్ళీ ఈయన మాట్లాడక ముందే బాబాఅంటారు 'అటాచ్‌మెంట్స్ ఉన్నటువంటి వాడివి యోగాభ్యా సం ఎందుకుచేశావు? మోక్షం ఎందుకుకోరావు ? ఇంటి దగ్గరే కూర్చోలేకపో యావా? నాదాకా ఎందుకువచ్చావు?అని. అపుడు సిగ్గుపడి కూర్చుంటాడు వైరాగ్యం మళ్ళీ ప్రాక్టీస్ చెయ్యాలి అని. వైరాగ్యం అంటే నోటితో అన్నంత తేలికకాదు. ఇలా అనేకదశలు ఈఉపాసనీశాస్త్రి అనుభవించాడు.

తరువాత మురుగు కాలువలలో నీరు ఔపోసన పట్టేవాడు. ఎక్కడెక్కడ చెత్తాచెదారం అంతా భక్షణ చేసేవాడు. పేడని అమృతంలా తీసికొనేవాడు. ధ్యానము చేస్తున్నపుడు పిల్లవాళ్ళు వీపుమీదకు ఎక్కి మూత్రం పోసేవారు. కొందరు నెత్తిమీద పేడ వేసేవారు. వేళాకోళం చేసేవారు. అవి మొదట్లో చికాకు కలిగించేవి. కానీ తరువాత ధ్యానానికి కూర్చుంటే బయట ప్రపంచంలో ఏమి జరుగుతోందో తెలీకుండా సమాధిస్థితిలో ఉండిపోయేవాడు. సంవత్సరకాలము అలా ఉండిపోయాడు. అటు తరువాత మళ్ళీ కళ్ళు తెరవగానే ప్రజలు వచ్చి ఏడిపిస్తారనుకొంటే వారందరూ వచ్చి మేళ తాళాలతో కాళ్ళు కడిగి ఈయనకి గురుపూజ చేయటానికి వస్తారు. అప్పుడు

ఈయనకి కోపంవచ్చి వారందరినీరాళ్ళు పెట్టి కొట్టి పంపించేస్తాడు. అలా నానా రకాలైనటువంటి అనుభవాలు ఈయన జీవితంలో జరిగాయి. అప్పుడు చివరకు అన్నీ అయిన తరువాత అప్పుడు సాయినాథుడు 'గురుపౌర్ణమి' రోజున భక్తులందరినీ పిలిచి తనను పూజ చేయటానికి వచ్చిన వారందరినీ ఉపాసనీ శాస్త్రి దగ్గరకి వెళ్ళి ఆయన కాళ్ళు కడిగి పంచామృత అభిషేకం చేసి గురుపూజ చేయమన్నారు. ఎందుకంటే 'నాకూ అతనికి భేదం లేదు' అని. అప్పుడు ఉపాసనీశాస్త్రికి బ్రహ్మానుభూతి కలిగింది. ఈ బ్రహ్మానుభూతి అనుగ్రహించిన తరువాత ఇంకొక ఆరు మాసాలు ఉండమన్నాడు బాబా. కానీ ఆరుమాసాలు ఉండలేక ముందుగానే 'సక్కోరి' అనే ప్రాంతం వెళ్ళి అక్కడ స్మశానంలో తన జీవితం అంతా వెళ్ళబుచ్చుకొన్నాడు.

ఈ కర్మశేషం అంతా కూడా బాబా ఏవిధంగా పూర్తిచేసాడో మోక్షము ఇచ్చేంతవరకూ మూడు సంవత్సరాలలో చేశాడు. అంటే ఆయన రెండున్నర సంవత్సరాలే ఉన్నాడు. మూడు సంవత్సరాలలో సద్గురువు ఈ పనులన్నీ కూడా సాధనలో ఎట్లా సహాయం చేస్తాడో, కర్మక్షయము ఎట్లా చేస్తాడో తెలుస్తుంది. మనం ఏమనుకొంటాము ? ఉద్యోగము ఇప్పిస్తాడు, డబ్బు ఇప్పిస్తాడు, భోజనం పెట్టిస్తాడు అనుకొంటాము. అవి అన్నీ అక్కరలేని వాడికి, మోక్షము పొందాలనుకొనేవాడికి, మోక్షము రావడానికి ఏమైతే అటాచ్మెంట్స్ ఉన్నాయో అవన్నీ ఉపాసనీ బాబా దివ్యచరిత్రలో ఒక్కొక్కటీ తీసేశాడు. ఇదీ ఉపాసనీశాస్త్రి చరిత్ర. ఇది 1955లో ఒక పుస్తకం దొరికితే చూచాను తెలుగులో. మళ్ళీ ఇంత వరకు కనబడలేదు. ఉపాసనీబాబా 1942లో హైదరాబాదుకు వచ్చి 1947వరకూ ఉన్నారు. అప్పుడు నైజాం

నవాబుయొక్క మంత్రి కిషన్‌ప్రసాద్ బహదూర్ ఈయన శిష్యుడై రోజూ వచ్చి పాదపూజ చేసేవాడు. ఒక రోజున గురుదక్షిణగా మీకు ఏదైనా ఇవ్వదల్చుకున్నాను. ఈ హైదరాబాదు అంతా మనదే. ఎక్కడ కావాలంటే అక్కడ మీరు చూపించిన చోటు మీకు ఇస్తామని చెప్తాడు. అప్పుడు అసెంబ్లీ, సెక్రటేరియట్ వంటి ముఖ్యకూడళ్ళు అన్నీ చూపిస్తే ఇటువంటి స్థలాలు బాగాలేదు అని చెప్పారు ఉపాసనీబాబా. ఆ రోజులలో ఊరు దాటిన తరువాత 20 మైళ్ళు దూరంలో ఎక్కడో పనికిరానటువంటి బండరాళ్ళ ప్రదేశం చూపించి ఆ ప్రదేశం నాకు ఇప్పించమని అడిగారు ఈ ఉపాసనీ. అది విని ఈ నవాబుయొక్క మంత్రి నవ్వి 'ఇది ఎందుకు పనికిరాదు. కనీసం చెట్లు మొలవవు, అక్కడికి వెళ్ళటానికి ట్రాన్స్‌పోర్టు కూడా లేదు అదెందుకండీ?' అన్నాడు. అంటే ఇక్కడ నా గురువుయొక్క పాదుకలు ఉన్నాయి అన్నారు. అప్పుడు ఆ స్థలము బాగుచేయడానికి బండలు అవీ త్రవ్వుతుంటే ఒక రాయి బయట పడింది. ఆ రాయిమీద పాదుకలు ఉన్నాయి. అంటే పాదాల అచ్చులు ఉన్నాయి. అప్పుడు ఉపాసనీని అడుగుతారు మీ గురువుయొక్క పాదాలు ఎట్లా వచ్చాయి ? అని. అడిగితే నా గురువు సాయినాధుడు హైదరాబాదులో ప్రత్యక్షం అయినపుడు అప్పుడు ఆ రాయిమీద నిలబడ్డప్పుడు ఆ పాదాలు అచ్చులు ఇవి అన్నారు. ఇప్పటికీ 68 సంవత్సరాలుగా పాదుకలు అందులో ఉన్నాయి. హైదరాబాదులో వెతికి ఆ ప్రదేశముపట్టుకొంటే అచ్చట మందిరము ఏర్పడి ఉంది. శిరిడీ నుండి ఇద్దరు భార్యాభర్తలువచ్చి నిత్యమూ పూజా అదీ చేస్తుంటారు. అసలు బాబా షిరిడీనుండి ఇంతదూరం హైదరాబాదు ఎందుకువచ్చారు? ఎందుకనిరాయిమీద నిలబడితే పాదుకలు అయినాయి అంటే ఇక్కడ

హైదరాబాదులో ఒక సద్గురువు 'బాబా షర్ఫుద్దీన్' ఉండేవారు. ఆయనకి 'వలీయోంకా షా' అంటే సద్గురువులలో చక్రవర్తి వంటి బిరుదు. దక్షిణదేశాన ఎంతమంది సద్గురువులు ఉన్నారో వారందరికీ అతను సామ్రాట్. ఆయనతో మాట్లాడటానికి వచ్చారు బాబా. ఆయన సమాధిఉంది అక్కడ. ఆ వలీయోంకా షా చరిత్ర చాలా విస్తారంగా ఉంది. మేము రోజూ వెళ్ళి కొన్నిరోజులు అచ్చట ఆయన సమాధిదగ్గర సాధనచేశాము. రోజూ సాయంకాలం ఆఫీసునుంచి రాగానే గం.6-30కు స్నానం అదీ చేసుకొని వెళ్ళే వాళ్ళం. చార్మినార్ దాటిన తరువాత 12 మైళ్ళువెళ్ళాలి. వెళ్ళి అచ్చట కూర్చుంటే తెల్లవారుఝామున గం.5-00లకు ఫస్ట్‌బస్ వచ్చేది ఊళ్ళోకి వెళ్ళడానికి. దాంట్లో తిరిగి వచ్చి మామూలుగా ఆఫీసుకి అదీ వెళ్ళేవాళ్ళం. ఇలాగ 3 సంవత్సరములు గడిచాయి. ఆ సమాధికి నమస్కారం పెట్టి ఇందులో ఏదైనా మహాత్మ్యం ఉండేటట్లైతే ఇక్కడే నిదర్శనం కనబడాలి, కనబడితేనే ప్రార్థిస్తాం అని నమస్కారం పెట్టగానే అక్కడనే బాబా కూర్చున్నట్లుగా సింహాసనం మీద కిరీటం పెట్టుకొని కూర్చున్నట్లుగా దర్శనమైంది. అప్పుడు వారికినీ, వీరికినీ ఉన్నటువంటి సంబంధమూ, ఈ సద్గురువు యొక్క విశేషం తెలిసింది.

ఇప్పటికీ పిశాచం పట్టినవాళ్ళు, భూతాలుపట్టిన వాళ్ళు ఎక్కడా తగ్గనటువంటి వాళ్ళని తీసికొని వచ్చి ఆయన సమాధి దగ్గర గొలుసులేసి కట్టేస్తారు. ఎందుకంటే వాళ్ళు సామాన్యంగా ఆయన దగ్గర కూర్చోలేరు. కేకలేస్తుంటారు, అరుస్తుంటారు, మమ్మల్ని వదిలేయండి అని. అలా కొన్నిరోజులు అయిన తరువాత వాళ్ళదగ్గర పిశాచం ఈ 'ఈవిల్ పవర్'

వదలి వాళ్ళు పూజ అదీ చేసుకొని వెళుతుంటారు. (యాభై సంవత్సరాల నుండీ అక్కడ సమాధి ఉంది.) ఈ సమాధి, దాని చరిత్ర అడిగితే చమత్కారంగా ఒక కథ చెప్పారు. ఔరంగజేబు మన దేశాన్ని పాలిస్తుండగా అతను ఒక రకమైన నాస్తికుడు. భగవంతుడిని నమ్మితాడు కానీ ఈ సద్గురువులనూ అదీ నమ్మడు. వీళ్ళంతా దొంగలని ఆయన ఉద్దేశ్యం. ఒక రోజున ఏం చేశాడంటే ఈ మహాత్ముల సమాధులు ఏవైతే ఉన్నాయో అవన్నీ త్రవ్వి పారేయమన్నాడు. ఆర్డర్ జారీచేశాడు. చేస్తే, ఆ సైనికులకి భయం, వాళ్ళకు ధైర్యం చాలలేదు. అప్పుడు తానే దగ్గర ఉండి త్రవ్వి పారేయిస్తున్నాడు. దానికి అంతా ఒక టెస్ట్ పెట్టాడు ఎవరైతే మహాత్ములు, గొప్పవారు అనే సమాధి ఉంటుందో ఆ సమాధి దగ్గరికి వెళ్ళి ఆయనపేరు పిలిచి మూడుసార్లు గట్టిగా కేకలేసేవాడు. సమాధానం వస్తే ఆ సమాధిని విడిచిపెట్టేవాడు. రాకపోతే ఆసమాధిని పగులగొట్టేవాడు. అలా హైదరాబాదు వచ్చినపుడు ఈ సమాధి దగ్గరకి వచ్చి మూడు సార్లు కేకలేసాడు. పలుకలేదు. అప్పుడు గడ్డపార తీసికొని దానిమీద వేయబోతుంటే అప్పుడు లోపలనుంచే కేక 'క్యా హై బేటా?' 'ఏమిట్రా విషయం?' అని. ఆశ్చర్యపోయాడు. అప్పటికి రెండు, మూడువందల ఏళ్ళనాడు జీవ సమాధి అయ్యాడు ఆయన. అప్పుడు దానిమీదగుడ్డలు అంతా చెమర్చినాయి నీళ్ళుపోసినట్లుగా. వెంటనే ఈయనకి చెమట్లు పోసి 'నేను పిలవగానే ఎందుకు పలుకలేదు ?' అన్నాడు. అప్పుడు ఆయన ఒక తిట్టు తిట్టి 'గడేకే బచ్చే (గాడిదకొడకా) అప్పుడు నేను జపం చేసుకుంటున్నానురా!' అన్నారు. అంటే ఆయన ఇప్పటికీకూడా జీవసమాధిలో ఉన్నారన్నమాట. ఆయనతో ఏదో పనిబడి సాయినాథుడు వచ్చినప్పుడు ఆరాయిమీద కదలకుండా నిలబడినప్పుడు రెండుపాదాల

అచ్చు పడినాయి. ఇప్పటికి పూజ చేస్తున్నారు. ఇటువంటి చిత్రాలెన్నో.

మనం సద్గురువులను వెతుకుకుంటూ వెళితే అది ఒక రకమైన జీవితం. వాళ్ళని వెతికి పట్టుకోవడానికి కొన్ని ప్రక్రియలు ఉన్నాయి. వాళ్ళని గుర్తించడానికి అనుభవంకావాలి. అలాంటివి చేసేవాళ్ళం. అది వేరే కథ.

ఇలాగే గుంటూరు వెళ్ళినప్పుడు చదువుకోవడానికి మిత్రులని అడిగాను. ప్రతిచోటా మహాత్ములు ఉంటారుకదా! బ్రతికి ఉన్నవారో, జీవసమాధి అయినవారో అటువంటి వారు ఇక్కడ ఎక్కడైనా ఉన్నారా అని. అబ్బే గుంటూరులో ఏ మందిరాలు లేవని అన్నారు.

రంగన్నబాబుగారని ఒక అవధూత ఉన్నారు. ఆయనతో పరిచయం అదీ వేరే కథ. ఒక రోజున గుంటూరు వెళ్ళినపుడు బాబూ ఇక్కడ ఎవరన్నా మహాత్ములు ఉన్నారా? అన్నాను. అంటే మనోళ్ళా! ఉన్నారు బాబూ. మన వాళ్ళందరినీ చూపిస్తాను అని చేయి పుచ్చుకున్నారు. ఏమిటి ? మనవాళ్ళు అంటున్నారు, మేము బంధువులము కూడా కాదు!! అనుకొంటూ ఆయన వెంట నడిచాను. అప్పుడు ఆయన నన్ను రిక్షావాళ్ళు ఉండే ప్రదేశానికి తీసికొని వెళ్ళారు. కూలివాళ్ళు, తాగుబోతులు ఉండే ఆ ఏరియాను చూస్తుంటే 'ఏం పరవాలేదు మన వాళ్ళ దగ్గరకే తీసికెళతాను' అని ఒక దూదేకుల వాళ్ళ ఇంటి ముందు తీసుకెళ్ళారు. అచ్చట ఒక 70 ఏళ్ళ వృద్ధురాలు ఉంది. 'ఇదిగో అవ్వా! మన గురువుగారిని తీసుకొని వచ్చాను' అని అన్నారు. నమస్కారం పెట్టాను. 'బాబూ ఏమిటి మీరు నమస్కారం పెడతారు' అంది. రంగన్నబాబుగారితో 'ఏమిటి ఈవిడ విశేషం?' అని అడుగుతుంటే. అబ్బే ఏమీలేదు (అని రంగన్నబాబుగారు చెప్పబోతుంటే) 'నీకేం తెలీదు బాబూ' అంది ఆవిడ. అంటే రంగన్నబాబుగారు నవ్వి

ఇదిగో మనం బయటాళ్ళకి చెప్పక్కర్లెదు. బాబుగారుమనోళ్ళే అంటూ 'ఏమీలేదు! ఈవిడ ఎవరూ లేనప్పుడు 3 అడుగులు పైకిలేస్తుంది జపంలో అంతే!' అన్నారు. ఊరుకో బాబూ ఏమీ లేదు అంది ఆవిడ. 'అలాకాదు నీవు నీ గురువుమీద ప్రమాణంచేయి అన్నాడు'. అంటే అప్పుడు ఒప్పుకొంది ఆవిడ. అప్పుడు ఆవిడ ఆశీస్సులు తీసికొన్నాను.

అలా ఇంకోచోట ఒకమ్మాయి దిగంబరంగా ఉంది అప్పటికి 12 ఏళ్ళ నుండీ అన్నహారాలు లేకుండా ధ్యానసమాధి స్థితిలో ఉంది, ఆవిడనుకూడా చూపించారు. వీళ్ళుకూడా మనోళ్ళే బాబూ. ఎక్కడెక్కడో తపస్సు చేస్తుంటారు. అందరూ మనోళ్ళే అందర్నీ చూడాలఅని చూపిస్తూఉంటే నేను వెళ్తూఉన్నాను.

అప్పుడు నేను అన్నాను 'ఎవరైనా పెద్దవాళ్ళు, మహాత్ములు ఉన్నారా?' అంటే ఇప్పుడున్న వాళ్ళందిరినీ చూపించేశాను కదా! అన్నారు. అలాకాదు పూర్వీకులెవరైనా, ఇంకా పెద్దవాళ్ళు ఎవరైనా ఉన్నారా ? అంటే అప్పుడు ఆయన ఆలోచించి 'ఆ! కాలేషా మస్తాన్ సాబ్' ఉన్నారు అన్నాడు. ఇప్పుడు న్నాడా అంటే 'ఆ ఆయన సమాధి ఉంది. సమాధి ఉంటే ఆయన ఉన్నట్లే నయ్యా' అని అప్పుడు తీసికెళ్ళి చూపించారు. వెళ్తే ఆయన చరిత్ర అది వింటే - ఈ మస్తాన్ బాబా సిటీ ఇంకా డెవలప్‌కాకముందు అక్కడ చెట్ల క్రింద కూర్చొని హుక్కా పీలుస్తూ ధ్యాన సమాధిలో ఉండేవారు. ఆయన ధ్యానం చేసేటప్పుడు తలకాయ ఒక చోట, కాళ్ళు ఒక చోట, చేతులు ఒక చోట, మొండెం ఒక చోట అలా పడుండేవి. ఖండయోగంలో ఉండేవారు. ఎవరైనా వస్తే అప్పుడు మాత్రం లేచి కూర్చునేవాడు, వాడు భయపడ్తాడేమో అని. తరువాత మామూలుగా ఖండయోగంలో ఉండేవారు. అలా అక్కడ తిరిగే చిన్నపిల్లలు చుట్టుప్రక్కల గుడిశెలలో ఉన్నపిల్లలు ఆడుకోవడానికి

వస్తే అక్కడ ఉన్న ఇటుకలు ప్రోగుచేసి ఇటుకకి, ఇంకొక ఇటుక రాయి కొట్టి ముక్కలు చేసి ప్రసాదమని పెట్టేవారాయన. ఎవరో చెప్పారుట ఈ ఫకీరు మీ పిల్లలందరికీ ఇటుకలు, మట్టీ అదీ తినిపిస్తూ అలవాట్లు చేస్తున్నాడు అని. తరువాత వాళ్ళ వాళ్ళు వెళ్ళి చూస్తే మస్తాన్ కొట్టి ఇచ్చిన ఇటుక ముక్కలు వారి చేతులలోకి మారగానే బెల్లం ముక్కలుగా అయ్యేవట పిల్లలందరి దగ్గరా! అప్పుడు ఆయన మహాత్ముడని వారందరూ తెలిసికొన్నారు. ఆయన దగ్గర ఒక కోడిపెట్ట ఉండేది. రోజూ ఒక పాట పాడుకొంటూ ఉండేవాడు. ఎన్నిరోజులైనా గ్రామ్‌ఫోన్ రికార్డ్‌లాగా అదేపాట పాడుకొంటూ ఉండేవాడని రంగన్నబాబు చెప్పారు. ఆపాట అర్థం ఎవరికీ తెలిసేదికాదట. ఆయన ప్రచారమూ వైభవమూ చూసేసరికి చుట్టూ ఉన్న ముస్లింలందరికీ కన్నుకుట్టింది. ఈయన హిందువులందరినీ చేరదీస్తున్నాడు అని. అప్పుడు వాళ్ళు ఏమి చేసారంటే ఆయన కోడిపెట్టని పట్టుకొని కోసి కూర చేసారు. ఈయన అలా అలా తిరిగి వచ్చేసరికి లేదు. ఆ ప్రక్కనఉన్న సాయిబులని అడిగాడు 'కహా కా బేకా జాతా' నా కోడిపెట్ట ఎక్కడికి వెళ్ళింది అని. అదుగో ఇందులో ఉందని గిన్నె చూపించారు.ఆయన చూశాడు. గిన్నెమూత ఓరగా ఉంది. ఆవిర్లు కొడుతూ ఉడుకుతోంది. 'అరే బేకాఅచ్చా ఆవో' అన్నారు. అందులోంచి ఎగిరి బయటకి వచ్చింది అది! వాళ్ళ టైమ్ బాగుంది. తిన్నాక తెలిసింది కాదు. కడుపులోంచి బయటకు వచ్చేది!!! ఆ రోజునుంచీ 'కాలేమస్తాన్' జోలికి ఎవ్వరూ వెళ్ళేవారు కాదు. ఎప్పుడైనా రోడ్డు మీద వర్షం వస్తే నాలుగు రోడ్లు కలిసే ట్రాఫిక్ సెంటరులో పడుకొనేవాడు. లారీలు పోనీ, బస్సులు పోనీ, ఏవన్నా పోనీ, నడిరోడ్డుమీద కూర్చుండే వాడు. ఆయన కూర్చునేంత చోటు వర్షం పడేది కాదు. మిగతా

అంతా వర్షం కురిసేది. ఇటువంటి విచిత్రాలు అన్నీ కూడా ఉన్నాయి కాలే మస్తాన్‌వి. అక్కడికి వెళ్ళినప్పుడు. ఆయన ఎప్పుడో చేసిన విచిత్రాలు చెప్పారు రంగన్నబాబు!. ఈ మస్తాన్ బాబాగారి దగ్గర చాలా బలం ఉంది. ఇప్పటికి కూడా బలవంతుడే అని. అలా రంగన్న గారి దగ్గర అనుకున్న తరువాత ఒకసారి బెజవాడ మీదుగా వెళుతుంటే అర్జంటు పనిమీద గుంటూరు వెళ్ళాల్సి వచ్చింది. బస్ దొరకలేదు మాకు. ఎవరోఒక ఫ్రెండు ప్రక్కన ఉండి. ఫరవాలేదు బాగానే ఉంటుందని లారీలోఎక్కిచ్చాడు. మద్రాస్ పోతుందిలారీ. వాడికి రు.50/-లు ఇస్తామని. అప్పట్లో రు.50/-లు చాలా ఎక్కువ. బెజవాడ దాటాక నిద్దర ముంచుకు వచ్చింది. వాళ్ళు గుంటూరు ఊళ్ళోనే కాఫీలు, టిఫిన్‌లు తీసుకొన్నారు. మళ్ళీ బయలు దేరింది. మాకు ఊరు వచ్చినట్లే తెలీదు. అప్పుడు లేచి ఏమయ్యా ఎక్కడికి వచ్చాం అంటే గుంటూరు దాటాం సార్ అన్నాడు. దాటటం ఏమిటయ్యా మేము, ఇక్కడేకదా దిగాలి అని చివాట్లుపెట్టి దిగాం. ఇది ఏమిట్రా ఇలా దింపాడు అనుకొంటూ. దిగిన తరువాత చూచుకొంటే జేబులో గోల్డ్ ఫౌంటేన్ పెన్ను, పర్స్ సీట్లోక్రింద జారిపోయాయి. బంగారు పెన్ను పోయింది సరే. జేబులో చిల్లర డబ్బులు కూడా లేవు. అర్థరాత్రి ఎవరింటికి పోయి డబ్బులు కావాలని అడుగుతాము. అప్పట్లో తెలిసినవారుకూడా ఎవరూలేరు! తెల్లవారుజాము ఇది ఏమిటయ్యా ఈ ప్రదేశము, జెండా అదీ ఉంది అని అక్కడ వాకబు చేస్తే ఇది కాలే మస్తాన్ దర్గా అండీ అన్నారక్కడ. అయితే సరైన ప్రదేశానికే వచ్చాము అని కాళ్ళు, చేతులు కడుక్కొని అగరు వత్తులు వెలిగించి అప్పుడు అను కొన్నాను. సంకల్పము "నీ యొక్క శక్తి గానీ ఇప్పుడు పనిచేస్తుంటే ఇప్పుడు పోయిన మా వస్తువులు కనబడితే నమ్ముతాము లేకపోతే మానుకొంటాము"

అని. అప్పుడు కాసేపటికి లారీ తిరిగి వచ్చింది. సార్ మీ పర్స్, మీ పెన్ అందులో పడిపోయినాయి సార్ అంటూ లారీవాడు మా పెన్ మాకిచ్చి. మళ్ళీ మీరు పోలీస్ కేస్ అదీ పెడితే మాకు ప్రమాదము కదా! అని. అప్పుడు చూచిన వాళ్ళు ఆశ్చర్యపోయారు. ఎప్పుడూ లారీ వాళ్ళిలా వెనక్కి రారుట. ఇప్పుడితను వచ్చాడు. అప్పుడు కాసేపు కూర్చుని విభూది తీసికొని వెళ్ళాను. అక్కడ కూర్చొని ప్రార్థన చేసుకొని వెళ్ళాను. అప్పటి నుంచే మాకు ఇలాంటి నిదర్శనాలు కనబడుతుంటాయి.

ఆ తరువాత ఐ.ఏ.యస్. ఆఫీసరు అయిన తరువాత గుంటూరు కలెక్టరు ఆఫీసు ఇన్‌స్పెక్షన్‌కి వెళ్ళాను. కొంత మంది ఫ్రెండ్స్‌కి చెప్పాను. ఇక్కడ కాలేమస్తాన్ దర్గా ఉంది మీరు ఎప్పుడైనా చూశారా ? అని. విన్నాం కానీ మేము ఎప్పుడూ వెళ్ళలేదు. అంతా అలగాజనం పోతారు మనలాంటి డీసెంట్ వాళ్ళు పోరు అని. ఓరి వెధవా నీవు డీసెంట్ ఫెలోవాఅనుకొని సరే నేను వెళుతున్నాను వస్తావా ? ఇక చచ్చాడు వాడు. నేను డీసెంట్ ఫెలోనేగా. కలెక్టరుగారి కారులో బయలుదేరాము. ఎక్కడికి సార్ అన్నాడు డ్రైవరు. కాలే మస్తాన్‌దర్గా దగ్గరికి అన్నాను. వాడు డౌట్‌గా రెండుసార్లు అడిగాడు. చెప్పానుగాపోనీ అన్నా. ఏమండీ ఈ మస్తాన్‌గారు చాలా గొప్పవారా అడిగాడు. ప్రక్కనున్న వాడు. చూస్తాడుగా అని ఊరుకొన్నాను. మండువేసవి కాలంలో జూన్‌లో వెళ్ళాము. నుంచుంటే కాళ్ళు మాడి పోతున్నాయి. ఒక కొబ్బరికాయ తీసికొని లోపలికి వెళ్ళుతుంటే లోపలదర్గాలో ఉన్నాయన నన్ను గుర్తు పట్టాడు. పరిగెట్టుకు వచ్చాడు. నేను కొంతడబ్బు ఇచ్చి అచ్చటవున్న ఫకీరులందరికీ భోజనం సంతర్పణ ఈయండి అని లోపలికి వెళ్ళాను. లోపలికి వెళ్ళి ప్రార్థన చేద్దామని అయన అనే లోపల జల్లుమని

వర్షం కురిసింది చూస్తుండగానే! అప్పటికప్పుడు! మేఘాలు లేవు!!! జోరున వర్షం కురిసింది. అప్పుడు వాళ్ళందరికీ ఆశ్చర్యం కలిగింది. శక్తి ఉందా మస్తాన్ బాబాకి అని వారు అడిగిన రెండు నిమిషాలకి అక్కడ వర్షం పడటం, మేము కూర్చున్నంతసేపు. పూజ అయి బయటికి వచ్చేటప్పటికి ఏమీలేదు. ఇలా చాలాచోట్ల బోలెడంతమంది మహానుభావులతో అనుభవాలు. అవన్నీ చెప్పాలంటే చాలా టైమ్ పడుతుంది.

దీనిని బట్టి ఏమి తెలుస్తుందీ, అంటే ఒక సద్గురువు అనేటు వంటివాడు మన కోసం ఏవిధంగా సహాయం చేస్తాడు ? డైరెక్టుగా తాను హెల్ప్ చేయగలుగుతాడు. ఒకసారి మహాత్ములందరినీ దర్శించాలని కోరిక మాత్రంఉంది. ఈప్రారంభం మొదలు ఎట్లా అయిందంటే ఈ ప్రార్థించింది నిజమైతే, గురువే నిజమైతే, గురువుయొక్క మహిమ నిజమైతే నేను ఎక్కడికీ వెళ్ళి ఏ ప్రయత్నము చేయను, ఎవర్ని అడగను, ఎంక్వైరీ చేయను. వాళ్ళే మన దగ్గరికి వచ్చి తెలిసేట్లు చేబితేనే వెళ్ళేట్లు సంకల్పం చేసికొన్నాను. మామూలుగా జరిగే పనికాదది. ఆ ప్రార్థన చేసినప్పటినుండే ఎవరో ఒకరు వాడంతటవాడే వచ్చి చెప్పేవాడు. ఇదిగో ఫలానా చోట ఫలానా సాధువు ఉన్నాడు, లేకపోతే ఫలానాఫకీరు ఉన్నాడు, ఫలానా సద్గురువు ఉన్నాడు వెళ్ళి చూచిరా అని.

నేను ఆఫీసుకి, ఇంటికీ తప్ప ఎక్కడికీ వెళ్ళే వాడిని కాదు. 1962, 1961 ఆ ముందు. ఆ రోజులలో ఎక్కడికీ వెళ్ళేవాడిని కాదు. ఓ రోజు నా దగ్గర పనిచేసే గుమస్తా వచ్చి నమస్కారము పెట్టి 'సార్ ఈ ఊళ్ళో చాలా గొప్ప సత్పురుషుల సమాధిఉంది. ఫలానా మహాత్ముడని చెప్పాడు. హైదరాబాద్ స్టేషన్ ప్రక్కనే ఆ దర్గా ఉంది. కానీ చాలామంది దాని

ప్రక్కనుంచే వెళ్లారు కానీ దానినిచూడరు. దాని గొప్పతనమేమిటో తెలీదు. అంతకు రెండురోజుల ముందరే కలలో సమాధి కనబడి, ఆ సమాధి మందిరము దాని వ్యవహారం అంతా కనబడింది. ఎందుకు ఇట్లా కనబడింది, సమాధి కనబడితే చెడా ? మంచా? ఇంతలోనే ప్రొద్దున మా ఆఫీసులో అతనొచ్చి ఈ విషయం చెప్పాడు. అతనూబ్రాహ్మడే. నేను అన్నాను 'నీవేవెూ బ్రాహ్మడివి. ఈ ముస్లింల దర్గాల చుట్టూ తిరగటమేమిటని ?' అంటే అతను 'అలా అనకండి సార్! ఆయన చాలా గొప్పవాడు' అని. 'యూసఫ్‌సాబ్ దర్గా' అని మీరు పేరు వినే ఉంటారు. ఆ యూసఫ్ సాబ్ చరిత్ర ఏమిటంటే హైదరాబాదును గోల్కొండ నవాబులు పరిపాలన ఉన్నప్పుడు చెప్పులు కుట్టుకుంటూ ఉండేవాడు ఈ యూసఫ్ సాబ్ అనేటు వంటి సద్గురువు. రోడ్డు ప్రక్కన ఎవరికి తెలీకుండా ఉండటంకోసం. కానీ ఎవరైనా హరిభక్తులు, విష్ణుభక్తులు, గొప్పవాళ్ళు వస్తేమాత్రం వాళ్ళదగ్గర చెప్పులు కుట్టిచ్చి డబ్బులు మాత్రం తీసుకొనేవాడు కాదు. ఎలాతెలిసేదో ఆ చెప్పులు ముట్టుకోగానే తెలిసేదిట ఎవరు భక్తులో. అంటే రోజుకి ఆరు జతలు కుడితే ఒక జత ఫ్రీగా పెట్టేవాడు. భక్తులకి ఇచ్చేవాడు. మిగతావారి వద్ద డబ్బులు తీసుకొనేవాడు. కానీ ఎవ్వరికీ తెలీదు ఈయన సద్గురువుఅని, చెప్పులు కుట్టేవాడనే తెలుసు.

గోల్కొండ నవాబుల కాలంలో ఔరంగజేబు గోల్కొండ వచ్చి గోల్కొండ జయించాలని ఆరు మాసాలు ముట్టడిచేశాడు. ఫిరంగులతో ఆరుమాసాలు పట్టింది. వర్షాలు, తుఫానుగాలి, రోగాలు, సైన్యమంతా చచ్చారు. అయినాగానీ గోల్కొండవశం కాలేదు. అప్పుడు ఆయన చాలా దిగులుపడి

ఏమిచేయాలి ఈ గోల్కొండని ఎలాపట్టుకోవాలి అని.రాత్రిపూట తుఫానువచ్చి డేరాలన్నీ పడిపోతుంటే, నిలబడలేకపోతుంటే అప్పుడు ఆయన మారు వేషంలో వర్తకుడి వేషంలో తన సైనికులు, ప్రజలు ఏమిచేస్తున్నారో వారు ఏమి మాట్లాడుకొంటున్నారో అని ప్రతిచోటా వెతుకు తున్నాడు. ఒకచోట ఒక చెట్టుక్రింద గుడ్డకట్టి మామూలుగా డేరాలాగా. దానిలో క్రొవ్వొత్తి వెలిగించి ఆ క్రొవ్వొత్తి వెలుగులో 'ఖురాను' చదువు కొంటున్నాడు. ఇంతతుఫానులో డేరాలు ఎగిరిపోతున్నాయి, గాలి బ్రహ్మాండంగా వీస్తోంది. కానీ క్రొవ్వొత్తి కదలకుండాఉంది. దానితో ఖురాను చదువుకొంటున్నాడు మామూలుగా. అది చూచి ఆశ్చర్యపోయాడు ఔరంగజేబు ఏమిటి ఇంత వాన, తుఫానులో చలించకుండాఇచ్చట కూర్చొని పారాయణ చేయటం ఏమిటి ? క్యాండిల్ కదలకుండా ఉండటం ఏమిటి? అని ఆశ్చర్యపోతూ అక్కడికి వెళ్ళి నమస్కారం చేశాడు. 'సలామ్' అని.

యూసఫ్‌సాబ్ :- ఎవరుమీరు?

ఔరంగజేబు :- నేనోదో మామూలు వాడిని, వర్తకుడిని

యూసఫ్‌సాబ్ :- మొఘల్ సామ్రాట్టు వర్తకుడి వేషం వేసుకొని భిక్షమెత్త డానికి అవసరం ఏమొచ్చింది ?

అప్పుడు ఔరంగజేబు ఉలిక్కిపడి కాళ్ళ మీద పడి...

ఔరంగజేబు :- మీరు మహాత్ములని తెలుసుకొన్నాను

యూసఫ్ సాబ్ :- 'ఏంకావాలి మీకు?'

ఔరంగజేబు :- ఇలా గోల్కొండని ఆరు నెలలుగా ముట్టడిస్తే మాకు

ఏమీ స్వాధీనం కాలేదు. చలనం లేకుండా ఉంది. మీ సహాయం, మీ ఆశీస్సులు కావాలి.

యూసఫ్ సాబ్ :- అలాగా నేను చెప్పులు కుట్టుకొనే వాడిని నేనేం చేస్తాను?

ఔరంగజేబు :- మాకదంతా తెలీదు మీరు భగవంతుని స్వరూపం. మీరే మాకు సహాయం చేయాలి. మీరు ఏమి అడిగినా ఇస్తాను.

యూసఫ్‌సాబ్ :- సరే నేను నీకు సహాయం చేస్తాను నాకు ఎంత ఇస్తావు?

ఔరంగజేబు :- లక్షవరహాలు ఇస్తాను

సరేనని అపుడు ఆయన నీవు ఇక్కడే కూర్చోమని చెప్పి జోలె తీసికొని గోల్కొండ నవాబు దగ్గరికి వెళ్ళాడు. వెళ్ళి

యూసఫ్‌సాబ్ :- నీ గోల్కొండ కోట ఓడిపోకుండా కాపాడాలంటే నాకెంత డబ్బులు ఇస్తావ్ ?

గోల్కొండ నవాబు:- నీకు ఎంత కావాలో చెప్పు అంత ఇస్తాను

యూసఫ్ సాబ్ :- నాకు అవతల వ్యక్తి ఔరంగజేబు లక్ష వరహాలు ఇస్తానన్నాడు. నీవు ఎంత ఇస్తావ్?

గోల్కొండ నవాబు :- ఔరంగజేబుకన్నా వేయి వరహాలు ఎక్కువ ఇస్తాను. ఈ యూసఫ్ సాబ్ మళ్ళీ ఔరంగజేబు దగ్గరికి వచ్చి

యూసఫ్ సాబ్ :- (ఔరంగజేబుతో) నవాబుగారు నీకన్నా వేయి వరహాలు ఎక్కువ ఇస్తానన్నారు. మరి నీ సంగతి ఏమిటి?

ఔరంగజేబు :- రెండువేలవరహాలు ఎక్కువ ఇస్తాను?

మళ్ళీ ఈయన గోల్కొండ నవాబు దగ్గరికి వెళ్ళాడు. ఈ విధముగా గోల్కొండ నవాబు దగ్గరికి, ఔరంగజేబు దగ్గరికి చాలాసార్లు తిరిగే సరికి వీరికే విసుగొచ్చింది. ఇదేమిటి ఈయన మహాత్ముడు ఊరకే బేరమాడుతున్నాడు, చేయదలచు కొంటే సహాయం చేయాలి లేదా మానెయ్యాలి అనుకొని చివరికి గోల్కొండనవాబు నీకుఇచ్చేది ఏదోఇస్తాను. అంతకుమించి అడగొద్దు అంటాడు. అప్పుడు ఈయన ఔరంగజేబు దగ్గరికి వచ్చి నవాబు ఈవిధంగా అన్నాడు మరి నీ సంగతేమిటి అన్నాడు. అపుడు ఔరంగజేబు రెండు లక్షలవరహాలు ఇస్తాను అనగానే సరే పో గెలుపునీదే అని వెళ్ళి పోయాడు. వెంటనే గోడ బ్రద్దలు కావడం, అపుడు ఔరంగజేబు ఈయన అనుగ్రహం సంపాదించి గోల్కొండ కోటను వశం చేసికొని డబ్బు తీసికొని వెళితే ఈయన కనిపించలేదు. ఆయన ఎక్కడైతేఉండి చెప్పులు కుట్టుకుంటూ కనిపించాడో అక్కడ సమాధి, మసీదు కట్టించాడు. అక్కడ ఇప్పుడు కూడా అనేకచిత్ర, విచిత్రాలు అనుభూతులు జరుగుతున్నాయి. ఒకసారి ఆయన రాత్రులు తిరుగుతూ ఉండటం చాలా మందికి దర్శనమివ్వడం జరిగేది. కానీ మొత్తానికి ఈ సాధువులు అందరూ చాలా విచిత్రమైన మనుషులు. అంటే వాళ్ళకి ప్రకృతి చేత అడ్డంకులుగానీ ఏమీ ఉండవు.

త్రైలింగస్వామి అని ఒకాయన దిగంబరంగా కాశీలో తిరుగుతూ ఉండేవాడు. ఈయనను తీసికెళ్ళి జైలులో పెట్టి తాళం వేసి బయటకు వచ్చేసరికి ఈయన రోడ్డుపై తిరుగుతూఉండేవాడు. ఇట్లా చాలాసార్లు జరిగేది. ఈయనకూడా గొప్ప దిగంబరసాధువు. అనుకోకుండా నేను ఔరంగజేబు కట్టించిన సమాధి మందిరాన్ని దర్శించడం, విచిత్రమైన అనుభూతులు

పొందడం జరిగింది. ఎవరెవరో వస్తూఉండేవాళ్ళు. గొప్ప గొప్ప రహస్యాలు అక్కడ అది ఉంది, ఆ మహాత్ముడు ఉన్నాడు అంటూ చెపుతూ ఉండేవాళ్ళు. ఇది సద్గురువుచేసే సహాయం. ఎందుకంటే మనం మహాత్ములను గుర్తించ లేము. అందువల్ల పుణ్యక్షేత్రాలుగానీ, తీర్థయాత్రలు గానీ వెళ్ళేటప్పుడు సద్గురువుల ఆశీస్సులతోవెళ్తే చాలావిచిత్రమైన అనుభూతులు కలుగుతాయి[1].

ఏడాది క్రిందట డాక్టర్ ఒకాయన నాదగ్గరికి వచ్చి షిర్డీ వెళ్ళాలి, ఆశీస్సులు ఇవ్వమన్నాడు. ఇంతకుముందు చాలాసార్లు వెళ్ళివచ్చావ్ కదా! నన్ను అడగడం దేనికి, ఆశీస్సులు ఇవ్వనుఅన్నాను. అలా నెలరోజులు తిరిగాడు. తరువాత ఓ రోజుసాయిమందిరానికి రు.1116/- దక్షిణ ఇవ్వ మన్నాను. ఇచ్చాడు. కొంచెం విభూది పెట్టి వెళ్ళమన్నాను. అక్కడ షిర్డీలో గతంలో ఎన్నడూ చూడనటువంటి అనుభూతులు చాలా ఆశ్చర్యం కలిగించే విచిత్రాలు ఎన్నో చూశాడు. వాటి సంగతి తరువాత. యాత్ర పూర్తి చేసికొని తిరిగొస్తూ ఆయనకు ఏదో సంకల్పంకలిగి అక్కడ గురువుగారు దగ్గర సత్సంగంలో అందరికీ ఇద్దామని కొన్ని సాయిబాబా బొమ్మలు పట్టుకొచ్చాడు. తీసికొచ్చి ఇస్తున్నాడు. నేను కోప్పడి నాకు తెలియకుండా ఈ బొమ్మలన్నీ ఎందుకు ఇస్తున్నావ్ అని కోప్పడ్డాను. సాయిబొమ్మలే కదా ఇస్తున్నాను అన్నాడు. ఈ నలుగురికీ ఇవ్వు అని నలుగురిని చూపాను. వాడి చేతిలో ఐదు బొమ్మలు ఉన్నాయి. ఒకటి నేను లాక్కొన్నాను. నలుగురికి నాలుగు బొమ్మలు ఇచ్చాడు. ఈ బొమ్మ ఎవరికి ఇవ్వాలి అంటూ ఉండగా చేతిలోఉన్న బొమ్మ చేతిలోనే మాయమైంది. ఇప్పటికీ ఆయనకి చిత్రమైన విషయం. చేతిలోని బొమ్మ మాయం కావడం, ఇలాంటి విచిత్రాలు ఎన్నో జరిగాయి.

---

[1] గురుదేవుల ఆశీస్సులు, పర్మిషన్ తీసికొని వెళ్ళిన ప్రతి యోగమిత్రునికీ ఇది అనుభవం.

అట్లాగే ఖమ్మం జల్లాలో మా బంధువు ఒకాయన ఉండేవాడు. చాలా కాలం నుంచి సాయిభక్తుడు. నాకు 'అన్నయ్య' వరుస అవుతాడు. స్వీట్‌ప్యాకెట్‌తో వాళ్ళింటికి వెళ్ళాను. అన్నయ్యను దేవునికి నైవేద్యం పెట్టమన్నాను. ప్యాకెట్ అలాగే దేవుడి దగ్గర పెట్టాడు. ప్యాకెట్ ఊడ దీయకుండానే. పూజ అయిపోయి నైవేద్యం పెట్టి ప్యాకెట్ బయటకు తీసికొచ్చి ఊడదీయగానే సగం, సగం స్వీట్లు ఎవరో తినేసినట్లుగా ఉన్నాయి. చాలా ఆశ్చర్యపోయాను. తర్వాత తినేసినటువంటి స్వీట్లు పెట్టెలో నా బట్టలపై పడిఉన్నాయి.

ఇంకోసారి క్యాంప్ పనిమీద ఖమ్మం వెళ్ళాల్సి వచ్చింది. ఎప్పుడు వచ్చినా ఏ టైములో వచ్చినా మా ఇంటికి వచ్చి భోజనం చేసి వెళ్ళాలని షరతు పెట్టేవాడు, ఆయన. గోదావరికి వరదలు వచ్చి ఉండటం వల్ల పడవలో అక్కడికి చేరాల్సి వచ్చింది. ఆ టైములో వాళ్ళని భోజనానికి ఇబ్బందిపెట్టడం ఎందుకు? తిన్నానని అబద్ధం చెప్పేద్దాములే అనుకొంటూ వాళ్ళ ఇంటికి వెళ్ళేసరికి, ఆయన లైటు వేసుకొని రెడీగా కూర్చొనిఉన్నాడు. ఎవరైనా బంధువులు వచ్చారేమో ఇంకా మేల్కొని ఉన్నాడు అనుకొంటూ ఉండగా నన్ను చూడగానే "రండి మీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు. ఏంటి!? ఇంత రాత్రివేళ నాకోసం ఎదురు చూస్తున్నా నంటున్నావు. నేనువస్తానని మీకేం తెలుసు అంటే ఇందాక పడుకోగానే సాయినాథుడు కనిపించి నేను భోజనానికి వస్తున్నాను. లేచి భోజనం ఏర్పాట్లు చెయ్యమన్నాడు. సాయినాథుడు చెప్పడమేమిటా అని ఆశ్చర్య పోయాను. నిజం తమ్ముడూ, కావాలంటే మీ వదినని అడుగు. లోపలికి వెళ్ళగానే ఆవిడ శుభ్రంగా అన్నం వండి, పులిహోర, చక్కెరపొంగలి, ఇట్లా

మామూలు వంటకాదు, విశేషమైన వంట చేసి ఉంది. 'ఇవన్నీ ఎవరికి' అన్నాను. 'నీకోసమే...' 'నా కోసమా! ఇన్నా!' అన్నాను. అంటే సాయినాథుడే నీ రూపంలో వచ్చాడనుకొంటున్నాము. సాయినాథుడే చెప్పాడు కాబట్టి, అంటూ భోజనం ఏర్పాట్లు చేస్తున్నారు. భోజనానికి కూర్చున్నాను. విసనకర్రతో విసురుతూ సాయి, సాయి అంటూ తన్మయత్వంతో ఉన్నాడు. నేనుకూడా తన్మయత్వంలోకి పోయాను. తర్వాత చూస్తే ఇరవయ్యో, పదిహేనో బొబ్బట్లు అయిపోయి ఉన్నాయి. అసలు సాధారణంగా స్వీట్లు తినను నేను. అపుడు చెప్పాను నేను. ఇక రెండు రోజుల దాకా భోజనం అక్కర్లేదు అని. అలా ఉదయాన్నే వాకింగ్‌కి వెళ్ళి వచ్చానో లేదో మళ్ళీ విపరీతమైన ఆక[illegible] అవుతోంది. ఏమిట్రా ఇది అనుకొంటూ, నాకు [illegible]లియకుండా [illegible] ఐదారు రకాలు తినేశాను. అప్పుడు అనిపించింది. ఈ [illegible]ట్టకు, బ్రహ్మా[illegible]ానికి కనెక్షన్ చేశారా అని! ఇది చూడటానికి తమాషాగా ఉండవచ్చు. కానీ నా రూపంలో ఉండి సాయినాథుడే అలా చేశాడని పించింది. తర్వాత క్యాంప్ నుండి ఇంటికి రాగానే నేను తిన్న స్వీట్లుఅన్నీ పెట్టెలో కనిపించాయి. ఏమిటో ప్రసాదం తెచ్చారు అని మా అమ్మాయి తీసికొచ్చింది. కేంప్ నుండి వచ్చేవారికి ప్రసాదం ఎట్లా వచ్చింది, ఎవరూ దాంట్లో వేయలేదే..! అని ఆశ్చర్యపోయాను. ఇట్లా కొన్ని చెప్పేవి ఉన్నాయి, మరికొన్ని చెప్పనివి ఉన్నాయి. ఎన్నోవిచిత్రాలుఉన్నవి. ఇట్లాంటివి మనం సాధనలోఉండి, అహంకారాన్ని పోగొట్టుకొని సద్గురువును ఆశ్రయించి ఈ ప్రపంచం అంతా భగవంతుడు అనే భావనతో మనం ఎక్కడ ప్రచారంచేసినా సరేమనంచేసే వాటికన్నింటికీ గురువే బాధ్యత వహిస్తాడు. ఈ సద్గురువు అనే భావనతో మనం ఎక్కడ తిరిగినా సరే, సద్గురువుతో సంచారం చేసిన భావనమనకు

కలుగుతుంది. దీనికి ఒకవిషయం చెప్తాను.

బాబాగారి దగ్గర ఉపాసనీశాస్త్రి ఉన్నప్పుడు భార్యకు ఆరోగ్యం బాగా లేదని సమాచారం వచ్చింది. పర్మిషన్ కోసం బాబాగారిని అడిగాడు ఈయన. బాబాగారు పర్మిషన్ ఇవ్వలేదు. ఇక్కడి నుండి వెళ్ళవద్దన్నారు బాబా. ఇలా రెండుమూడుసార్లు అడిగి విసుగువచ్చి చెప్పకుండానే కాలి బాటన బయలు దేరి షిర్డీనుండి కోపర్‌గామ్ బయలుదేరాడు. ఒక రోజు అయింది, రెండు రోజులు అయింది, నాలుగు రోజులు అయింది, ఇట్లా నడుస్తూనే ఉన్నాడు. ఐదురోజులైనా ఊరు చేరుకోలేదు ఆయన. సాధారణంగా రెండురోజులకే ఊరుచేరుకోవచ్చు. ఇదేవిచిత్రం! భార్యకు బాగాలేదని దిగులుతో నెమ్మదిగా నడుస్తున్నానేమో అనుకొన్నాడాయన. మధ్యలో ఒక సత్రం ఉంటే అక్కడ ఆగి, అక్కడ సాధువులందరికీ భోజనాలు పెడతారు. తిన్నాక బాబూ ఇది ఏఊరు అని అడిగాడు. షిర్డీకి 5 కి.మీ. దూరంలో ఏదో ఊరుపేరు చెప్పాడు ఆయన. అపుడు ఈయనకి భయం వేసింది బాబోయ్! 5 రోజులు ప్రయాణం చేస్తే 5 కి.మీ. నేను చేరుకొంది. ఇంకా చాలా దూరం ప్రయాణం చేయాలి కదా! చేయలేము అనుకొంటూ వెనక్కి ప్రయాణం అయ్యాడు. ఒకరోజులోనే షిర్డీచేరుకొన్నాడు. చేరుకొన్నాక భయం వేసింది. చెప్పకుండా వెళ్ళాం కదా! బాబాగారు ఏమన్నా అంటారేమోనని, సరేనని ద్వారకామాయిదగ్గరకి వెళ్ళి నిలబడ్డాడు. ఎక్కడకు వెళ్ళావు నీవు ? ఊరికి. ఎపుడు వెళ్ళావు ? గురువారం. ఎన్ని రోజులైంది ? వారం రోజులు. ఈ రోజు ఏ వారం ? గురువారం. నీవు అసలు వెళ్ళనేలేదన్నాడు ఆయన. అపుడు ఈయనకి మతిపోయింది. చచ్చీ చెడి వారం రోజులు కాలినడకన నడిస్తే వెళ్ళలేదంటాడేమిటి ఆయన. అపుడు బాబా, 'నీవు ఎక్కడ తిరుగుతున్నా నాలోనే తిరుగుతున్నట్లు

అనిపించింది'. అదొక విచిత్రమైన అనుభూతి. ఈ విచిత్రమైన అనుభూతికి మరొక ఉదాహరణ.

రామస్వామిగారని బెంగుళూరు. మాకు లెక్చరర్‌గా పనిచేశాడు. ఆయనకు ఎవరో చెప్పారట. నేను I.A.S. ట్రైనింగ్‌లో ఉన్నప్పుడు, ఈ ఆఫీసరు సాయిబాబా భక్తుడని. ఆయన నా దగ్గరికి రాగానే 'నాకేం తెలీదు. ఈ సాయిబాబా ఎవరో తెలీదన్నాను.' అపుడు ఆయన ప్రక్కకి పిలిచి ఆయన అనుభవంచెప్పాడు. నీకు మహాత్ములంటే నమ్మకం ఉందా? అన్నాడు.ఉందంటే అనవసరమైన డిస్కషన్ ఎందుకని లేదన్నాను. నీదృష్టి చూస్తుంటే నీవు గొప్ప యోగీశ్వరుడిలాగా ఉన్నావు. అయినా నీకు ఒక అనుభవం చెప్తాను. అంటూ... ఇలా చెప్పాడు. ఈయన బాబుగారు బెంగుళూరులో ఇంజనీరుగా పనిచేస్తుండేవారు. అక్కడ ఈయన చదువుకొనే రోజులలో కాశీ, హరిద్వార్ చూడాలని ఈయనకి ఐడియా కలిగింది. హరిద్వార్ దాటిన తర్వాత అన్నగారు ఉన్నారు అక్కడ. రోడ్స్ వేస్తుండేవారు హిమాలయాలలో. అక్కడికి వెళ్ళారు ఆయన.దాదాపు 3,4 రోజుల ప్రయాణం ట్రైనులో. మూడు రోజులు ప్రయాణం చేస్తే నాలుగవరోజు చేరుకొనేవారు. రోడ్డువేస్తుంటే అక్కడికి చూడ్డానికి వెళ్ళి అక్కడ ప్రక్కన ఏరుఉంది. నీళ్ళు త్రాగుదామని అక్కడికి వెళితే, అక్కడ ఒక ఫకీరునీళ్ళు త్రాగి కాళ్ళు,చేతులు కడుక్కొంటున్నాడు. అపుడు ఈయన అక్కడికి వెళ్ళి సాధువుకదా అని నమస్కారం పెట్టాడు. నమస్కారం పెడితే, రమ్మని పిలిచాడు. నోరు తెరవ మన్నాడు ఆయన. ఈయన తెరిచాడు. ఆయన గాండ్రుమని ఉమ్మేశాడు నోటిలో. ఈయన అసహ్యించుకొని ఛ.ఛ.ఛ. ఎంత పనిచేశాడు ఆయన అనుకొంటూ నోరు కడుక్కొని కాళ్ళు, చేతులు కడుక్కొని బయటికి వచ్చాడు.

సాధువు ఏమైపోయాడో కనిపించలేదు. కొంచెం దూరం పోయాక ఒక చెట్టు క్రిందకెళ్ళి అలా కళ్ళు మూసుకొంటే సాధువు కనబడి మూర్ఖుడా! మూడు జన్మల పుణ్యం నీకిస్తే పాడు చేసుకొన్నావు నీవు. అయినా పర్వాలేదు. నీవు ఎక్కడ కూర్చుని కళ్ళు మూసుకొని ఏ ఊరిలో ఉండాలని సంకల్పించు కొంటావో అక్కడ ఉంటావన్నాడు. కానీ గుర్తుపెట్టుకో. మూడు రోజులే ఉంటుంది ఈపవర్ అన్నాడు. వెంటనే కళ్ళు తెరచుకొని ఏమిటిది! చాలా చిత్రంగా ఉందే! సాధువు ఉమ్మేయటం ఏమిటి! నిద్రరావడం ఏమిటి! నీవు ఏఊరు తలుచుకొంటే ఆ ఊరిలో ఉంటావనడం ఏమిటి ! అనిరెండు రోజులు అట్లా తోసేశాడు. మూడవ రోజు అయినా చూద్దాం అనుకొంటూ, కళ్ళు మూసుకొని మైసూరులోని చెల్లెలిగారి ఇంటిదగ్గర ఉండాలి అనుకొని కళ్ళు తెరిచేసరికి వాళ్ళ అరుగుమీద ఉన్నాడు. భయపడి పోయాడు. సామాను ఏమీ లేకుండానే ఒక్కడే అక్కడ ఉన్నాడు. ఇంతలో చెల్లెలు వచ్చి ఏమిటిక్కడ ఉన్నావు! తలుపుకూడా కొట్టకుండా అరుగుమీదే ఉన్నావంటే అప్పుడు ఆమెకు ఏదేదో చెప్పి, మూడోరోజు పూర్తికాగానే మళ్ళీ రైలులో హరిద్వార్ రావడానికి మూడు రోజులు పట్టింది.

అట్లాగే హైదరాబాదులో ఓ సాధువు ఫకీరు ఓ విచిత్రం చేశాడు. అదికూడా చెప్పేసి పూర్తిచేస్తాను. ఆయన ఓ రోజున ముగ్గురు స్నేహితులను పిలిచి ఢిల్లీ వెళుతున్నాను. వస్తారా అని అడిగి రేపువచ్చేద్దాం అన్నాడు. ఇదేమిటి వెళ్ళడానికే మూడు రోజులు పడుతుంది. రేపు వచ్చేద్దాం అన్నాడు. కానీ ఆయనకి ఎదురు సమాధానం చెప్పే ధైర్యంలేక సరే అన్నారు. అయితే జట్కాబండి మాట్లాడమన్నాడు. హైదరాబాదునుండి ఢిల్లీ వెళ్ళడానికి జట్కాబండా!! అనుకొంటూ.. ఆయన పిచ్చివాడు, కోపం వస్తే

కొడతాడు అనుకొంటూ బండి కుదిర్చారు. ఇది జరిగి 30 ఏండ్లు కావస్తోంది. ఢిల్లీలో మీఅక్కగారికి పుస్తకాలు ఇవ్వాలిగదా! అవికూడా పట్టుకురమ్మన్నాడు. ఏమిటి నిజంగానే వెళ్ళినట్టే చెపుతున్నాడు ఈయన అనుకుంటూ పుస్తకాలు తెచ్చి పెట్టుకున్నాడు. కొంచెం దూరం వెళ్ళేసరికి అందరికీ నిద్రవచ్చింది. ఐదునిమిషాలు ఆగి కళ్ళు తెరచి చూచేసరికి ఢిల్లీలో రోడ్డుమీదపోతూ ఉంది బండి. ఆశ్చర్యపోయారు వారు. అప్పుడు రోడ్డుమీద ఉన్న పోలీసు వాడిని బండివాడు అడిగాడు ఇది ఏ ఊరని. రోడ్డుమీద బండిపోనిస్తూ ఏ ఊరు అంటావేమిట్రా వెధవా అని పోలీసువాడు తిట్టాడు. సరేనని అడ్రస్ వెతుక్కొంటూ చెల్లెలి వాళ్ళింటికి వెళ్ళి పుస్తకాలు ఇచ్చేసి, భోజనం చేసి మళ్ళీ బండిఎక్కి సాయంత్రానికి హైదరాబాద్ చేరారు.ఇది చాలావిచిత్రమైన అనుభవం.

ఇంకోసారి వారింటివద్ద సంకీర్తన చేసుకొంటూ ఉండగా 'ఒరేయ్! నీవు గోల్కొండ చూసివస్తావా!?' అన్నాడు ఆ ఫకీరు. అదేమిటి గోల్కొండ చూసి వస్తావా అంటాడు, నా దగ్గర డబ్బుల్లేవన్నాడు. ఎంత ఉందిరా ? అంటే, 5 రూపాయలు అంటాడు. వెధవ 5 రూపాయలు ఏమి చాలుతాయిరా ఈ వేయి రూపాయలు తీసికెళ్ళు అని ఆ ఫకీరే వేయి రూపాయలు తీసిచ్చాడు. ఏమిటీ ఇది చాలా విచిత్రంగా ఉన్నదే! ఈయన వెళ్ళనమకొంటున్నాడు అనుకొంటూ హైదరాబాద్ ఓల్డ్ సిటీలోకి వెళ్ళి అక్కడనుండి ఒక కుర్రవాడిని తోడుతీసికొని యాధృచ్ఛికంగా ఒక ఇంటి తలుపు తట్టాడు. లోపలనుండి ఎపుడో 20 ఏండ్ల క్రిందట పోయిన వీడి భార్య వచ్చి తలుపుతీసింది. భార్యను గుర్తుపట్టి ఆశ్చర్యపోయాడు. 1000 రూపాయలు ఇస్తేగానీ ఆమెను వదలమన్నారు. అప్పుడు ఫకీరు ఇచ్చిన

వేయిరూపాయలు ఇచ్చి ఆమెను వెంట తెచ్చుకొని హైదరాబాదులోనే నివసించాడు. తరువాత అతను ఒక ఆఫీసరుగా ఉద్యోగంవచ్చి తను స్వయంగా చెప్పిన విషయమిది. ఈవిధంగా **గురువు అనుగ్రహం మనకు తెలియకుండానే మనవెంట నడుస్తూ ఉంటుంది.** అంటే మహాత్ములు ఏమి చెప్తారో, ఏమిచేస్తారో మనకు అర్థమయేలా ఉండదు.

సామాన్యమానవుడు సాధనచేత యోగీశ్వరుడు ఎలా అవుతాడో భాగవతంలో నారదుడి చరిత్రచూస్తే అర్థమవుతుంది. ఒక పనిచేసే దాసీదాని కొడుకు నారదుడు పూర్వజన్మలో. ఈ దాసీ కొడుకుగా ఉన్నవాడు దేవర్షి ఎట్లా అయ్యాడో ఆ చరిత్ర అంతా చెప్పాడు భాగవతంలో. వ్యాసుల వారు హిమాలయాలలో, అన్నీ పురాణాలు, భారతం వ్రాసి చివరకు తపస్సు చేసికొంటున్నారు. మనశ్శాంతి కలగటం లేదు. అప్పుడు నారదుడు అక్కడికి రావడం, ఆయనను అర్ఘ్యపాద్యాదులతో పూజించి, నమస్కరించి నాకు మనశ్శాంతిగా లేదు ఋషీశ్వరా అంటే, 'ఏమిటి! నీకు మనశ్శాంతి లేకపోవడం. ఎన్నో పురాణాలు వ్రాసినవాడివి. విష్ణుసహస్రనామం వ్రాసిన వాడివి.' అంటే ఎన్ని వ్రాసినా నాకు తృప్తి కలుగలేదు అంటే 'భాగవతం' వ్రాయమన్నాడు. అపుడు వ్యాసులవారు 'ఇప్పటికి ఎన్నో వ్రాసినాను కదా! ఏమిటి ఈ భాగవతం వ్రాయడంవల్ల ఫలం?' అంటే **'భాగవత ధర్మం అంటే భక్తుడు కేవలం భక్తి ద్వారా సద్గురువును ఆశ్రయించి భగవంతుడిని చేరుకోవడం. కలియుగంలో భక్తికే సాధ్యం. కలియుగంలో ధ్యానం గానీ, యోగంగానీ, తపస్సుగానీ చేసే శక్తి మనుష్యులకు ఉండదు. అందువలన కేవలం సద్గురువుయొక్క దాసాను దాసుడిగా ఉండి వాళ్ళ అనుగ్రహంవలన పైకి వచ్చే మార్గానికి**

**భాగవత ధర్మం అని పేరు.**' ఈ ఒక్క భాగవతధర్మం వలననే కలియుగంలో మానవుడు తరించగలుగుతాడు. అందుకు నా సంగతే చెబుతాను. నేను పూర్వ జన్మలో ఒక దాసీదాని కొడుకును. నాతల్లి అన్నిచోట్ల పాచిపని చేసుకొంటూ బ్రతుకుతూ ఉండేది. కొడుకు 10 ఏండ్ల పిల్లవాడు. బయట పిల్లవాళ్లతో ఆడుకొంటూ బయట ఎవరు ఏమి పెడితే అది తింటూ ఉండేవాడు. ఆ తల్లి ఎవరైనా ఏదైనా తినేందుకు ఇస్తే ఇంటికి తీసికొని వచ్చి పిల్లవానికి పెడుతూ ఉండేది. ఎవరైనా సాధువులుకనబడితే వారికి నమస్కారం పెట్టడం. వాళ్ళకు ఏదైనా సేవ చేయడం పిల్లవానికి అలవాటు. ఓ రోజున సప్తమహర్షులు సాధువుల రూపంలో ఒకచోట రోడ్డుపై వెళుతూ ఉంటే ఈ పిల్లవాడు వారిని చూసి వాళ్ళకి సాష్టాంగ నమస్కారం చేసి మా ఇంటిదాకా వచ్చి మాకు మీ అనుగ్రహం ఇవ్వవలసినదిగా కోరాడు. చిన్న పిల్లవాడు పిలిచాడు కదా! సంతోషపడి అక్కడే ఉండి చాతుర్మాస్య వ్రత దీక్ష చేయడం మొదలు పెడతారు. గ్రామస్థులంతా చూసి ఎవరో సాధువులు వచ్చారనుకొని పందిళ్ళు వేసి వీళ్ళకి ఉదయం, సాయంత్రం నైవేద్యం తెచ్చిపెడుతూ వాళ్ళుచెప్పే ఉపన్యాసాలు వింటుండేవారు. ఇలా జరుగుతూ ఉండగా ఒక రోజు వీడితల్లి వీడిని సాధువుల దగ్గరికి తీసికెళ్ళి, అయ్యా! వీడిని మీతో పాటు ఉంచుకోండి, మీకు సేవలుచేస్తూ ఉంటాడు అనగానే మేము సాధువులం. మేము ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటాం. వీడు మాతో ఎలా ఉండగలడు?అని అనగానే ఆమె 'అయ్యా! అట్లా అనకండి. ఒక్క ముద్ద తిండిపెడితే చాలు. మీరు ఎట్లాచెపితే అట్లా ఉంటాడు వాడు.' అంటుంది. 'సరే! తిండికి, ప్రేమకు లోటు లేదు మా దగ్గర' అంటూ వారి దగ్గరే ఉంచుకొన్నారు. నీ పేరు ఏమిటి? అని అడిగితే 'ఏమీ పెట్టలేదు'

అన్నారు.అప్పటినుండి వీడిని హరిదాసుడు అని పిలవడం ప్రారంభించారు. ఉదయం నిద్రలేచిన దగ్గరనుండి వారికి సపర్యలు చేయడం, పూజాసామగ్రి తెచ్చి పెట్టడం, వాళ్ళతో పాటుగా వెళ్ళి గంగా స్నానం చేసేవాడు. వాళ్ళు పూజ చేసికొనే పాత్రలన్నీ తోమి పెట్టేవాడు. వాళ్ళు వంట చేసికొంటుంటే అన్ని వస్తువులూ తెచ్చి పెట్టేవాడు. వాళ్ళు వంట చేసి నైవేద్యం పెట్టి, వాళ్ళు భోజనం చేసే దాకా ప్రక్కన చేతులు కట్టుకొని నిలబడి, వాళ్ళు భోజనం చేయగనే వాళ్ళ విస్తర్లలో మిగిలినది వీడు ప్రసాదంగా తీసికొనేవాడు. ఇట్లాగ నెల, రెండు నెలలు అయ్యేటప్పటికి వీడికి బ్రహ్మజ్ఞానం కలిగింది. అపుడు వాళ్ళని అడిగాడట 'మిమ్మల్ని చూస్తుంటే మీరు తల్లి తండ్రి అనే భావన కలుగుతోంది. మీ కాళ్ళు పట్టి మీకు సేవ చేస్తాను' అన్నాడు. హరిదాసూ, ఇప్పటి వరకూ ఇటువంటి కోరికలు ఎవరూ కోరలేదు. సరే! కానీమన్నారు. రాత్రి నిద్రపోయేంతవరకూ కాళ్ళు పట్టేవాడు. వాళ్ళు నారాయణ మంత్ర జపం అవీ చేసుకొంటూ ఉంటే అవి అన్నీ విని వీడు నేర్చుకొనేవాడు. చివరికి మూడు మాసాలు పూర్తి అయి, వారి వ్రతం పూర్తి అయి గ్రామాన్ని వదిలిపెట్టి పోవాలనుకొన్నారు. ఈ హరిదాసుకు దుఃఖం పట్టలేదు. ఇన్ని రోజులుప్రొద్దున, సాయంత్రం నేను మీకు సేవలు చేస్తున్నాను కదా! మీరు వెళితే మిమ్మల్ని వదిలిపెట్టి నేను ఉండలేను అన్నాడు. ఒరేయ్! మేము ఇవాళ వచ్చి రేపు వెళ్ళి పోయే వాళ్ళము. నీకు తల్లి ఉంది. ఆమెను చూసుకో! అంటే ఏమో అవన్నీ నాకు తెలీదు. నాకు తల్లి, తండ్రి అన్నీ మీరే అని అన్నం మానివేశాడు. ఎందుకురా హరిదాసూ అన్నం మానివేశావు అంటే నాకు జీవితం మీద ఆశలేదు. మీరు వెళ్ళిపోయిన తరువాత బ్రతికేమి లాభం అన్నాడు. అపుడు వాళ్ళు వెళుతూ అదికాదు

నాయనా! నీకు తల్లి ఋణం ఉంది. అది తీరే దాకా నీవు గృహస్థుడిగా ఉండక తప్పదు. ఇన్నిరోజులు మాకు సేవచేశావు కాబట్టి నీకు మేలుచేస్తాము అని చెప్పి 'నారాయణ వాసుదేవమంత్రం' ఉపదేశంఇచ్చి జింకచర్మం, దర్భలు ఇస్తారు ఆ కుర్ర వాడికి. తూర్పుగా ఎట్లా కూర్చోవాలో, ధ్యానం ఎట్లా చేసుకోవాలో నేర్పుతారు. అట్లా ధ్యానం చేసికొంటూ ఉండగానే తన్మయత్వం కలిగి విష్ణుమూర్తి దర్శనం అవుతుంది. కళ్ళు తెరవగానే గురువు కనిపిస్తాడు. రాత్రింబవళ్ళు గురువు కోసం తపించి దుఃఖిస్తాడు. ఆ తర్వాత ధ్యానం అలవాటై క్రమేణా నదికి వెళ్ళి స్నానం చేయడం, అన్నాహారాలు మానివేశాడు. ఈ ధ్యానం చేసికొంటూ క్రమేణా సమాధిస్థితిని పొందేవాడు. కొద్దిరోజులకి తల్లిమరణించింది. చుట్టుప్రక్కలవారిసహాయంతో దహనసంస్కారాలు చేసి భవబంధాలు వదిలి పోయాయని, ఇపుడు మోక్షం కలుగుతుందనే ఉద్దేశ్యంతో జపం చేయడం ప్రారంభించాడు. అపుడు విష్ణుమూర్తి యొక్క వాక్కు వినబడుతుంది. "ఈ జన్మతో నీకు మోక్షం రాదు. ఈ జన్మలో శరీరంతోపాటు కర్మక్షయం అయిపోతేనేగానీ మోక్షంరాదు" అని. అప్పటినుంచీ ఎపుడు శరీరం పోతుందా అని ఆలోచిస్తూ అడవిలోకి వెళ్ళి ఆకులు తింటూ సాధన చేసికొంటూ పులులు, సింహాలు, ఏనుగులు వీటితో స్నేహంచేస్తాడు. అవి వీడికి అపకారం చేయడం మానివేసి సహాయం చేస్తాయి. తర్వాత ఎక్కడో చెట్టు క్రిందకూర్చొని ధ్యానం చేసికొంటుంటే మెరుపు మెరిసినట్లుగా శరీరం వదిలి వేయడం, దేవలోకంలో నారదుడుగా జన్మఎత్తడం, సిద్ధత్వం రావడం ఇన్ని విషయాలు వ్యాసమహర్షికి చెప్పి, 'సామాన్యుడినైన నాకే ఇట్టి స్థితి రాగా కేవలం సద్గురు సేవతో అహంకారాన్ని వదిలిపెట్టి శరణు పొందిన వారికి కలియుగంలో తరించగల ఉపాయం

భాగవత ధర్మం. ఈ ధర్మాన్ని ప్రజలం దరికీ బోధించి అందరూ తరించగల పుస్తకాన్ని వ్రాయుమ' నగానే వ్యాసమహర్షికి కళ్ళనీళ్ళు వచ్చి అలాగే మానవుల్ని తరింపజేయగల గ్రంథాన్ని వ్రాస్తానని చెప్పి వ్రాసిన ఉద్గ్రంథమే ఈ శ్రీమద్భాగవతం. ఏ భాగవతధర్మం అయితే నారదుడు వ్యాసమహర్షికి ఉపదేశించాడో, వ్యాస మహర్షి భాగవతరూపంలో అందించాడో ఆ ధర్మాన్ని ఆచరించి చూపిన వాడు సాయినాథుడు. అంటే భిక్షాటనం, గురుసేవ, ఇరవై నాలుగు గంటలూ శరీరం మీద మమకారం లేకుండా ఎట్లా తపస్సులో, గురుసేవలో ఉన్నాడో, ఎప్పుడూ భగవన్నామం అల్లామాలిక్ అంటూ స్మరిస్తూ ఉండేవాడు. బాబా చరిత్ర చదివి భాగవతం చదివితే భాగవత ధర్మం అర్థం అవుతుంది. దీనివల్ల ఈ భాగవత ధర్మాన్ని ఆచరించి సద్గురు సేవవలన ఆధ్మాత్మికంగా అభివృద్ధిచెంది ఒక్క జన్మలో ఎలా ముక్తిని పొందవచ్చో తెలుస్తుంది. కాబట్టి పవిత్రమైన ఈ విజయదశమినాడు ఈ మహత్తరమైన విషయాలు రావడం, కేవలం మందిరం గురించి నాలుగు మాటలు చెబుదామని రావడం, కానీ మీ భక్తిని చూసి ఇన్ని చెప్పవలసి రావడం, భగవంతుడి ఆదేశంతో రావడం, ఇవన్నీ మీరు స్మరించుకొంటూ ఉదయం, సాయంత్రం భాగవతం పారాయణ చేయడం, సాయిచరిత్ర పారాయణచేయాలని అందరినీఆశీర్వదిస్తూ మంగళాశీస్సులు అందజేస్తున్నాను.

హరిః ఓం తత్ సత్

నిడదవోలు సాయిమందిరం ఆవిష్కరణ సభలో అనుగ్రహభాషణం చేసినారు.

గురుసేవగా ఈ ఉపన్యాసము వ్రాసి పంపిన యోగమిత్రులు

శ్రీమతి వై.దుర్గాశైలజ, ఉదయగిరి శాఖ మరియు కుమారి శైలజ, పొంగూరు శాఖ.



# 3

# గాయత్రీ మంత్రము - రామాయణ అంతరార్థం

ప్రియమైన యోగమిత్రులకు, భక్తులకు, ఈ రోజు హృదయపూర్వక మంగళాశాసనములు. ఈ రోజు ఈ పవిత్రమైన ఈ ఓంకారక్షేత్రంలో మీ అందరితో కలిసి ఈ విధమైన ఆధ్యాత్మిక కార్యక్రమంలో పాలుపంచు కొన్నందుకు ఎంతో ఆనందంగా ఉంది. చాలాకాలం నుండి ఏదో ఒక ఆధ్యాత్మిక కార్యక్రమములో పాలుపంచుకోవడానికి గుంటూరు రావలసి వస్తూనే ఉన్నది. అది బహుశా నేను గుంటూరులోనే చదువుకోవడం వల్ల పూర్వ సంబంధాలు పోకుండా ఉండటం. పోయిన సంవత్సరం రామనామ క్షేత్రంలో 'రామాయణ రహస్యం' గురించి ప్రసంగించాల్సి రావడం, మరలా ఇపుడు ఇక్కడ రామాయణం యొక్క అంతరార్థం గురించి రామాయణంలో 'గాయత్రీ రహస్యం' గురించి ఉపన్యసించాల్సిందిగా పెద్దలు కోరడం.

వాల్మీకి మహర్షి రామాయణాన్ని రచించి, వేదం చదువుకోలేని, అర్థం చేసుకోలేని సామాన్యులకు, స్త్రీలకు, పిల్లలకు, పండితులు కానటువంటి సామాన్య మానవులు తరించేటందుకు ఒక ముక్తి మార్గాన్ని సూచించాడు. ఈ రామాయణము ఆది కావ్యము. 'ఆది కావ్యమ'నగా ఇంతవరకూ వచ్చిన అన్ని కావ్యాలన్నింటిలోనికి ఇది మొదటి కావ్యము. ఏవిధంగానైనా అన్ని మంత్రాలు ఉచ్ఛరించే ముందు 'ఓం'కారాన్ని ఉచ్ఛరించి మిగతా మంత్రాన్ని చదువుతామో, అలాగే కవులను గురించి చెప్పేటప్పుడు ముందు వాల్మీకి మహర్షిని స్మరించి మిగతావాళ్ళని చెపుతాము. అందుకని వాల్మీకి ఆదికవిఅన్నమాట. అందువల్ల రామాయణం ఆదికావ్యం. అందువల్ల రామాయణంలో వర్ణించబడిన పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీరామ చంద్రమూర్తి కూడా భగవత్ తత్త్వాన్ని మానవుడికి అందించడానికి మానవ రూపంలో జన్మించిన ధర్మావతారమూర్తి. ఇది రామాయణం చదివిన అందరికీ తెలిసినవిషయమే. కానీ వాల్మీకిమహర్షి రచించిన రామాయణాన్ని సరళమైన భాషలో అతి సులభంగా అర్థం చేసికొనే టటువంటి పుస్తకం లేదు. పండితులకు అర్థం అయ్యేవి ఉంటే ఉండవచ్చు. కానీ రామాయణం అంటే ఏమిటి ? అందులో ధర్మం ఏమిటి ? అందులోని ముఖ్యమైన విషయాలు సామాన్యులకు అందించే పుస్తకం, ఈనాడు అందుబాటులో లేవు. ఈ కారణం చేత విద్యార్థులకు, పిల్లలకు మన శాస్త్రాలలో, మన పురాణాలలో ఎంత అద్భుతమైన విషయాలు ఉన్నవో, వాటి ప్రాముఖ్యాత ఏమిటో, మనకు కష్టాలు కలిగినపుడు, సుఖాలు కలిగినపుడు మనకు సహాయం చేసేది ఏమిటో తెలిసికొనే అవకాశం లేకుండా పోయింది. దీని వలన ఏమైందంటే ఇది వరకు కొద్దోగొప్పో కాలం రామాయణాన్ని చదవడం,

భగవద్గీత చదవడం చేస్తే ఇప్పుడు అటైమ కూడా టి.వి.లు, సినిమాలు, చూడటంవల్ల అధ్యాత్మికత అంటే ఏమిటో తెలిసికొనే అవకాశం నశించింది. దీనివల్ల కలిగే నష్టం ఏమిటి? అని మీరు అడుగవచ్చు. ఎప్పుడూ రామాయణమే చదవాలా ? భాగవతమే చదవాలా ? టి.వీలు చూస్తే తప్పేమిటి? సినిమాలు చూస్తే తప్పేమిటి? రాజకీయాల్లోకి తిరిగితే తప్పేమిటి ? ఇది తెలియాలంటే ఇపుడు సాధారణంగా ప్రతి మానవుడికీ తిండి, డబ్బు, బట్ట ఇవే ముఖ్యమనుకొంటారు. ఇపుడు ప్రపంచంలో చాలామంది సుఖం అంటే డబ్బు ఉంటే చాలు, అధికారం ఉంటే చాలు, కోరికలు తీరితే చాలు అనుకొంటారు. ఇదే సుఖం అనుకొంటారు. ఇవి సరిపోతాయా చూడాలంటే ఈనాడు ఇవి అన్నీ ఉండీ అనేక సమస్యలతో బాధపడేవారిని అనేకమందిని చూస్తున్నాము. వారిని చూస్తే తెలుస్తుంది. సుమారు 30 సంవత్సరముల నుండి ఈ అధ్యాత్మిక కార్యక్రమాలకు ఎక్కడికి వెళ్ళినా ప్రతిచోట అనేక మంది కనబడతారు, సలహా కోసం, ఆశీస్సుల కోసం లేదా జాతకం చూపించడం కోసం. వీరందరూ ఎవరు? ఆర్థిక సమస్యలతో బాధపడేవారు, పిల్లలకు పెళ్ళిళ్ళుకాక బాధపడేవారు, రోగాలతో బాధపడేవాళ్ళు, మానసికమైన దిగుళ్ళతో బాధపడేవారు ఈ విధంగా అనేక మంది కనబడుతున్నారు. ఇవి పూర్వం కూడా ఉన్నాయి. కానీ ప్రతివ్యక్తిలో ఏదో ఒక బాధ , దిగులు, చింత. ఇంత ప్రబలడానికి కారణం ఏమిటి? నా కళ్ళముందు పుట్టిన వాళ్ళు, ఇరవై ఇరవై ఐదేళ్ళు ముందు పుట్టినవాళ్ళు పెళ్ళై, సంసారం చేస్తూ కూడా విపరీతమైన బాధలు పడుతూ ఉండేవాళ్ళు, నాకన్నా ముసలి వాళ్ళు కూడా ఉన్నారు. ఎందుకని? మందులు లేకనా? మందులు పెరిగిన కొద్దీ రోగాలు పెరుగుతున్నాయి.

చదువులు పెరిగినకొద్దీ అజ్ఞానం పెరుగుతోంది, పోలీసులు పెరిగినకొద్దీ నేరాలు పెరుగు తున్నాయి. ఇది ఏమివిపరీతం? సామాన్యంగా మనం ఏమనుకొంటాం. స్కూళ్ళు పెరిగే కొద్దీ జ్ఞానం పెరగాలి. పోలీసులు పెరిగే కొద్దీ నేరాలు తగ్గాలి. డాక్టర్లు పెరిగే కొద్దీ రోగాలు తగ్గాలి. అలా అవుతోందా ? కావడం లేదు. ఎంత మంది డాక్టర్లు పెరుగుతున్నారు, ఆస్పత్రులు పెరుగు తున్నాయి. దానిని మించి రోగాలు పెరుగు తున్నాయి. ఎంత మంది పోలీసులు పెరుగుతున్నారో అంతకు మించి దొంగలు పదిరెట్లుగా పెరుగు తున్నారు. చాలా చిత్రమైన దొంగతనాలు చేస్తున్నారు. వీరు బాగా చదువుకొన్నవారు, టెక్నికల్ చదువులు చదివినవారు, సైన్సు చదివిన వారు చాలా తెలివిగా దొంగతనాలు చేస్తున్నారు. పెద్ద పెద్ద పదవులలో ఉన్నవాళ్ళు చేస్తున్నారు. ఇవన్నీ గమనిస్తే ఏమనిపిస్తుంది. ఈనాటి చదువు మనకు సంస్కారం ఇవ్వడం లేదు. చదువుకున్నవారు దొంగతనం చేస్తున్నాడంటే అర్థం ఏమిటి ? చదువు కేవలం అక్షరజ్ఞానం ఇస్తున్నది. తెలివితేటలు ఇస్తున్నది. అంతేకానీ మంచితనాన్ని ఇవ్వడం లేదు. ఈనాడు సమాజంలో మనిషికి లోపించినదేమిటి? తెలివికాదు. 'మంచి'. ఈ మంచి లోపించడానికి,ప్రతిచోట దుర్మార్గం పెరగడానికి కారణం ఏమిటి? ఈ కర్మ అనేటటువంటి దానిమీద ఆలోచించడానికి కనీసం ఒక నిమిషం కూడా టైము ఉండటం లేదు. మానవుడు మాకు ఉద్యోగం ఎక్కడ, ప్రమోషన్ ఎక్కడ, పోస్టింగ్ ఎక్కడ అని అడిగేవాళ్ళే స్త్రీలైనా, పురుషులైనా సరే. చదువుకొనేటప్పటి నుండి అదే చింత. 'ఉదర నిమిత్తం బహుకృత వేషం' భోజనంకోసమే అనేక వృత్తులు ధరిస్తాడు. భోజనం జరగాల్సిందే. దానికై వృత్తి చెయ్యాల్సిందే. కానీ దానితోనే ఆగిపోకూడదు జీవితం. పూర్వకాలంలో

కూడా వృత్తులు చేశారు, వ్యవసాయం చేశారు. కానీ కనీసం కొద్దిసేపైనా, సాయంత్రమైనా దైవచింతన గురించి నాల్గు మంచి ముక్కలు విందాం అని ఒక ఆలయానికో, ఒక సంకీర్తనకో, ఒక సత్సంగానికో వెళదాం అనే చింతన ఉండేది. అప్పుడది ఫ్యాషన్ కాదు. ఫ్యాషన్ అంటే ఏమిటి ? తెలివితక్కువ వాళ్ళు మాత్రమే దేవుని పూజిస్తారు. చదువుకొన్న వాళ్ళు, మంచివాళ్ళు, గొప్పవాళ్ళు, ధర్మాన్ని గురించి వినరు. ముసలివాళ్ళు, ఏమీ పనిలేని వాళ్ళు, పండితులూ వీరు మాత్రమే పూజలు చేస్తారు అనే భావం పత్రికల వల్లనైతేనేమి, సినిమాల వల్లనైతే నేమి, లేదా మనలో ఉన్న చెడుదోషాల వల్లనైతేనేమి, ఇది ధర్మమే కదా అని తగినంత టైము వినియోగించడం లేదు. దీనివల్ల ఏమిటి ఫలితం? డబ్బులు పెరుగుతున్నాయి. పూర్వంకన్నా ఎక్కువ సంపాదిస్తున్నారు. రైతుకు ధరలు ఎక్కువ గిట్టుబాటు అవుతున్నాయి. డబ్బు ఎక్కువైంది. ఈ డబ్బుతో పాటు జబ్బులు వస్తున్నాయి. అంటే **అన్యాయార్జితమైన డబ్బు ఎపుడూ కూడా మనిషికి కష్టాలను కలిగిస్తుంది.** ఇది అనుభవ పూర్వకంగా చూడవచ్చు. పూర్వము ఒకడు నూరు రూపాయలు కష్టపడి సంపాదించి అందులోనే బ్రతికేవాడు. అపుడు 20 సంవత్సరాలలో ఒక్కసారి కూడా డాక్టరు దగ్గరికి వెళ్ళాల్సిన అవసరం ఉండేది కాదు. కానీ ఇపుడు రెండు చేతులా చాలక పదిచేతులా సంపాదించేస్తున్నాడు. కానీ శరీరంలో ఎన్ని అవయవాలు ఉన్నాయో అన్ని రోగాలు పుట్టుకొస్తున్నాయి. దీనికి కారణం ఏమిటి ? డబ్బు ఎక్కువ ఉంటే సుఖం ఎక్కువ ఉండాలి అనుకొన్నాం కదా! తిండి ఎక్కువగా ఉంటే బాగా బలంగాఉండాలి కదా! పూర్వంలో వాళ్ళు ఒంటిపూట తిన్నా బాగా ఆరోగ్యంగా ఉండేవాళ్ళు. ఇపుడు రెండు పూటలా కడుపునిండా

తిని టిఫిన్, కాఫీ తీసికొంటూకూడా నీరసంతో చచ్చిపోతున్నాడు. కొంచెం దూరం నడవలేడు, నీరసం. రకరకాల విటమిన్లు,ఇంజక్షన్లు తీసికొంటున్నాం మరి తినేదంతా ఏమౌతున్నది? ఇది అంతానూ.

ఇవన్నీ కనుక మనసు, బుద్ధి దగ్గర పెట్టుకొని ఆలోచిస్తే - మానవుడికి అన్నం వల్ల బలం రావడం లేదు. డబ్బు వల్ల సుఖం రావడం లేదు. అధికారం వల్ల ఆత్మసంతృప్తి రావడం లేదు. జీవితంలో వీటన్నిటి వల్ల మనం కష్టాలు కొని తెచ్చుకొంటున్నాం మనం. అసలు ఎక్కడ ఉన్నది దోషం? ధర్మచింతన, దైవచింతన, జీవితానికి ఒక లక్ష్యం లేకుండా పోయింది. ఈ కారణంచేత ఈ పరిస్థితికి ఓ పేరుపెట్టారు. ధర్మం నశించినపుడు, భూమి మీద ధర్మం ఎప్పుడైతే తగ్గుతుందో ప్రజలకు కష్టాలు ప్రారంభమవుతాయి. అయితే ఈ ధర్మం అంటే ఏమిటో తెలియకపోవడం వల్ల చాలామంది, ధర్మం తగ్గిపోవడానికి, కష్టాలకి సంబంధం ఏమిటి ? అనుకొంటారు. తుఫాను వస్తుంది ప్రతిసారీ. ఇంతకు ముందు అయితే పదేళ్ళకో, ఇరవై ఏండ్లకో, యాభై ఏండ్లకో ఒకసారి వచ్చిందని చెప్పుకొనేవారు. తర్వాత రెండేళ్ళకోసారి వచ్చిందంటున్నారు. తర్వాత తుఫాను లేని సంవత్సరమే లేదు. ఏడాదికి రెండుసార్లు, మూడుసార్లు కూడా తుఫాన్లు వస్తున్నాయి. ఇంక కొద్ది రోజులు పోతే పౌర్ణమికి, అమావాస్యకి కూడా తుఫాను రావచ్చు. అంటే ధర్మం నష్టం అయినపుడు కష్టములు సామాన్యంగా కాపురం ఉంటాయి. ఈ కారణం చేత పూర్వకాలం ఋషులు ఏం చేశారు. ఈ ధర్మం అనే దాని ప్రభావం ఏమిటి ? ధర్మం అనేదానిని మానవుడు ఎలా సంపాదించుకోవాలి ? మనస్సుకు శాంతి ఎలా కలుగుతుంది? ఒక్క నిమిషం మనశ్శాంతిగా, నిశ్చింతగా కూర్చోవడం

చేతనవుతోందా ఎవరికైనా. దేవుడు ఉన్నాడో లేడో తరువాతి విషయం. సుఖదుఃఖాలు అనేవి మనకు కనబడుతున్నాయి కదా. మనిషికి మనశ్శాంతి ఉంటేనే సుఖం ఉంటుంది. ఒక నిమిషం కూర్చుంటే ఒక అరక్షణం మనసును ఏకాగ్రతతో నిలబెట్టగలుగు తున్నామా? నిలబెట్టలేము. ఆ సమయంలోనే అన్ని సమస్యలూ వస్తున్నవి. అన్ని చింతలూ వస్తున్నవి. అన్ని రోగాలు వస్తున్నవి. ఒక నిమిషం కనుక మనసును ఏకాగ్రత చేయగలుగుతాడో మానవుడు అపుడు మనశ్శాంతి లభిస్తుంది. జీవితంలో ఉన్నటువంటి సమస్యలన్నింటికీ కారణం చెడుకర్మ. తెలిసిగానీ, తెలియక గానీ చేసిన దుష్కర్మలు చెడుపనుల యొక్క ఫలితాలు మనం జీవితంలో అనుభవిస్తాం. ఎందుకని అట్లా అనుభవిస్తారంటే, బంతిని ఎంత గట్టిగా అయితే నేలమీద కొడతామో అంత గట్టిగా అది పైకి లేస్తుంది. అలాగ ప్రతిపనీ మనం జీవితంలో ఏదైతే చేస్తామో, అది మంచికానీ, చెడు కానీ, తెలిసిగానీ, తెలియకగానీ, మళ్ళీ దాని ప్రతిఫలం మనకు కొడుతుంది. అందువల్ల కర్మయొక్క ఫలితం 'అవశ్యమనుభవం కృతంకర్మ'. పూర్వం మహర్షులు ఏం చెప్పారంటే, శ్రీకృష్ణుడు చెప్పాడు భారతంలో 'అవశ్య మనుభవం'. ప్రతివాడూ కూడా అనుభవించ వలసి ఉంటుంది. ఏమిటి అనుభవించవలసినది? అంటే 'కృతం కర్మ' చేసినటువంటి మంచిపని, చెడుపని ఏదైనా సరే ఫలితాన్ని తప్పక అనుభవించ వలసి ఉంటుంది. ప్రతివాడూ సుఖము అనుభవిస్తున్నాడు, కష్టము అనుభవి స్తున్నాడు. కానీ దానికి తను చేసినటువంటి మంచి చెడులే కారణమని గమనించడం లేదు. అప్పుచేస్తాడు. చేసినపుడు చాలా హాయిగా ఉంటుంది. ఖర్చుపెట్టుకొంటూ. అప్పు తీర్చవలసి వచ్చినపుడు కష్టం వస్తుంది. అపుడు

వాడి దగ్గరికి, వీడి దగ్గరికీ వెళ్ళి మ్రొక్కితే తీర్చవలసిన అప్పు పోతుందా. అందువల్ల ఈ కర్మ యొక్క స్వరూపాన్ని మనకు బోధించడానికి వాల్మీకి మహర్షి వ్రాసిన రామాయణం మనకు ధర్మం గురించి చక్కగా వ్రాసినటు వంటి మహాకావ్యం. ఎట్లా అయితే ధర్మం యొక్క స్వరూపం గురించి మహర్షి మనకు తెలియజేశాడో, దాన్ని ఆచరించి చూపిన వాడు రామచంద్ర మూర్తి. కేవలం మీరు ధర్మం ఆచరించండి అని నోటితో చెప్పడం కాదు. ఆచరించి, ఆ ఆచరించిన వాడికి ఏవిధంగా పవిత్రత, శక్తి పెరుగుతుందో చూపాడు. ఒక వ్యక్తిధర్మంగా ఉంటే లోకంలో యావన్మందికీ రక్షణ ఇవ్వగల్గుతాడు. తరువాత అన్యాయంతోనూ, అక్రమంతోనూ, అధర్మంతోనూ సుఖం సంపాదించుకోవాలని ప్రయత్నం చేశాడు రావణుడు. సీతాపహరణం చెయ్యాలని, రాముడిని జయించాలని, మాయోపాయాలతో జయిం చాలనీను, ఇపుడు ఈ సమాజంలో చేసేవే అపుడు ఒక్క రావణుడు చేశాడు. ఇపుడు ఇంటింటా రావణులే. అందువల్ల సుఖం పొందగలుగు తున్నాడా!!? అపుడు వాడికీ (రావణుడికి) లేదు సుఖం. ఇపుడు వీడికీ లేదు. ఈ కారణం చేత రామాయణంలో మనకు నిత్యజీవితంలో ఎదురయ్యే సమస్యలూ, వాటికి నివారణోపాయాలు కూడా చెప్పబడినవి. అందువల్ల ధర్మావతారుడని రామచంద్రమూర్తికి పేరు. 'రామో విగ్రహవాన్ ధర్మః'. ఈ ధర్మమే విగ్రహంగా మూర్తీభవించిన ధర్మావతారుడు రాముడు. అంటే ఆయన సూచించినవి ఏమిటి ? పితృవాక్య పరిపాలన. తండ్రి యొక్క మాటను కొడుకు నిర్వర్తించ వలెను. ఈనాడు ప్రతిచోట తండ్రిని హత్యచేసే కొడుకులు, అట్లాగే గురువును చంపే శిష్యులు, భర్తల్ని చంపే భార్యలు, భార్యల్ని చంపే భర్తలు. ఇవన్నీ కలియుగ దోషాలు. భారతంలో ముందే చెప్పారు వ్యాసమహర్షి, కలియుగం

చివరికి వచ్చేసరికి ఎట్లాంటి కొడుకులు పుడతారంటే, వీళ్ళ బుద్ధులు ఎట్లా ఉంటాయంటే 'పితా పుత్రంచ హంతి', తండ్రే కొడుకును హత్యచేస్తాడు. 'పుత్రం చ పితరం తథా' తండ్రిని కూడా కొడుకు హత్యచేస్తాడు. అట్లాగే 'నకశ్చిత్ కస్యచిత్ దాతా' ఒక వస్తువుకు ఇంకొక వస్తువును దానం చేసేవాడు ఉండడట. దానం చేయడమెందుకు అమ్ముకొంటే డబ్బులు వస్తాయని ఆలోచిస్తాడట. ఎవరుకూడా ఒక విషయం సరిగా చెపుతుంటే వినిపించుకోరు. సరిగాచెప్పే గురువు దొరకడు, ప్రతివాడూ ఎదుటివాడిని వంచన చేసేటటు వంటి వాడు. ఈ విధంగా ప్రపంచం ఎపుడు తయారు అవుతుందో ప్రజ లందరికీ కష్టాలు ప్రారంభం అవుతాయి. అందువల్ల ప్రతివాడూ తప్పుడు పనులు చేస్తాడు కనుక చెడుకర్మ వడ్డీలాగ పెరిగిపోయి, చెడుకర్మ వడ్డీ వ్యాపారంలాంటిది. అంటే పుణ్యం పెట్టుబడిపెడితే వడ్డీతో పుణ్యం పెరుగు తుంది. పాపం పెట్టుబడి పెడితే వడ్డీతో పాపం పెరుగు తుంది. అందువల్ల దీనిని ధర్మచక్రం అంటారు. **ఇవాళ మనం ఒక మంచి పనిచేస్తే రేపు ఇంకొక మంచి పని చేసే పుణ్యాన్ని అది కలిగిస్తుంది.** ఇవాళ గుడికి వెళ్ళి స్వార్థచింతన లేకుండా నమస్కారం పెడితే, రేపు వెళ్ళి కొబ్బరికాయ కొడదామన్న ఆలోచనకలుగుతుంది. ఎల్లుండి జపం చేసుకొందామన్న ఆలోచన కలుగుతుంది. ఆ తర్వాత ఎవరి దగ్గరికైనా వెళ్ళి ఉపదేశం తీసికొని తపస్సు చేసుకొందామన్న ఆలోచన కలుగుతుంది. తర్వాత ఈ జన్మఏమిటి ? ఈ కర్మ ఏమిటి ? జీవుడు ఏమిటి ? ఎంతవరకూ బ్రతకాలి? ఈ జీవిత లక్ష్యం ఏమిటి ? అదే మోక్షోపాయం. మోక్షోపాయం అంటే ఏమిటి ? ఇప్పుడు మనం చిక్కుకున్న జన్మ పరంపరలో మనం ఎందుకు చిక్కుకున్నాం. అందులోంచి బయటపడే ఉపాయం ఏమిటి ? ఈ మనసుకి

భగవంతుడు దారి ఎట్లా కల్పిస్తాడు. గురువుని ఎక్కడ చూపిస్తాడు ? ఇపుడు మనకున్న సమస్యలకు నివారణ ఎట్లా చూపిస్తాడు. ఇలాంటి చింతన మనకు కలగాలంటే కూడా కొంత పుణ్యం కావాలి. అందువల్ల పూర్వీకులు ఏమన్నారంటే 'కారణం పుణ్య కర్మాణాం...' పుణ్య కర్మలకి అన్నింటికీ కారణం భగవంతుడే. అంటే ఇవాళ ఈ పుణ్య కర్మ మనం చేద్దామని ఆలోచన కలిగింది అంటే భగవంతుని అనుగ్రహం మనయందు ఉన్నట్లే. లేకపోతే ఏదో ఒక పాపకర్మ చెయ్యాలని ఆలోచన వస్తుంది. అంటే ఓ పదిరూపాయలు సంపాదించుకొందామన్న ఆలోచన స్వార్థంగా కలుగు తుంది. కానీ ఓ పదిరూపాయలు దానం చెయ్యాలన్న ఆలోచన కలగాలంటే భగవంతుడి అనుగ్రహం ఉంటేగానీ సాధ్యం కాదు. అందువల్ల ఈ పుణ్యకర్మ వల్ల వడ్డీలాగా పెరిగి ఏదైనా సత్కర్మ చెయ్యాలన్న ఆలోచన కలుగుతుంది. ఇట్లా వరసగా పుణ్యం పెరుగుతూ పోతే క్రమంగా పాపం తరగడం ప్రారంభిస్తుంది. చివరికి వాడు పవిత్రుడై, యోగియై, నిరంతరం భగవత్ ధ్యానం చేసికొనేటట్లుగా, అడుక్కొనేవాడు ఎట్లాగైతే అణా, రూపాయి ఇట్లా క్రమేణా కూడబెట్టుకొని చివరికి ముష్టి ఎత్తుకొనే జీవితం నుండి బయటపడి ధనవంతుడు కాగల్గుతాడో అట్లాగే పుణ్యాన్ని క్రమేణా దాని అనుగ్రహం వల్ల రూపాయికి రూపాయి కూడబెట్టినట్లుగా పుణ్యాన్ని ఎక్కువ చేసి, దానిని వృద్ధి చేస్తాడో దానివల్ల మరింత పుణ్యం చెయ్యాలనే ఆలోచన కలుగుతుంది. ఇవాళ ఇక్కడికి వచ్చి ఈ ఉపన్యాసం వినాలన్నా, ఒక సంకీర్తన చెయ్యాలన్నా, ఎప్పుడో ఎక్కడో చేసిన సత్కర్మ ఇవాళ మనల్ని మళ్ళీ ముందుకు నెడుతున్నది. అలాగే చెయ్యకూడనిపని, ఇది చెయ్య కూడదు అని తెలిసి కూడా ఒక్కోసారి ముందుకు నెడుతుంది మనసు.

అది ఎప్పుడో ఎవరికో చేసిన పాపం మనల్ని ఏడిపించడానికి ఈ విధంగా బుద్ధిని నెడుతున్నది. ధర్మరాజు ఎందుకు పాచికలాడాడు? ఆ పాచికలాడటం వలన వనవాసం, దీనివలన ద్రౌపదీ, వీళ్ళందరూ కష్టాలు పడటం. భారత యుద్ధం, ఇవన్నీ ఎందుకు జరిగాయి? ఎందుకు వ్రాశారు వ్యాసులవారు? పాండవులకి ఏం జరిగితే మనకేమి? కౌరవులకి ఏం జరిగితే మనకేం? ఇది కేవలం సినిమా స్టోరీ వ్రాసినట్లు వ్రాయలేదు. జీవితం యొక్క సారాన్ని మనకు బోధించడానికి ఈ విషయాలు వ్రాశారు. ఏమిటంటే ఇన్ని కష్టములు పాండవులకు ఎందుకు వచ్చాయి. ఒకే ఒక తప్పు. అధర్మం అయినటువంటి జూదం వల్ల. సప్తవ్యసనాలలో జూదం మొదటిది. హాయిగా రాజసూయం చేసి రాజ్యపాలన చేసికొంటున్న ధర్మరాజుకు ఈ జూదం ఆడటమనే చింత కలగడంచేత ఒక పాపం చేస్తే, దానికి ఇంకో పాపం, ఇంకో పాపం, చివరికి వారు ఎంత పుణ్యాత్ములైనప్పటికీ కష్టాలు తప్పలేదు. అందువల్ల పాపం యొక్క ఫలితం కష్టము. పుణ్యంయొక్క ఫలితము సుఖము. ఈ విధంగా ఉదాహరణకు ధర్మరాజు అంతటివాడికి ఈ విధంగావచ్చిందే. ఇక మామూలు వాడికి, అసలే ధర్మం తక్కువ చేస్తాడువాడు. మామూలు వాడు చేసే తప్పులు ఎక్కువ. అటువంటి వాడు ఒక తప్పు చేస్తే గడ్డివాములో కనుక అగ్గిపుల్ల వేస్తే ఏమౌతుందో అట్లా మండి పోతుంది వాడి జీవితం. అంతేకద. పుణ్యం ఉన్న వాడు తప్పుచేస్తే కొంత వరకు రక్షించబడతాడు. డబ్బున్నవాడు అప్పు చేస్తే ఈ అప్పులు నుండి రక్షిస్తుంది డబ్బు. పేదవాడు అప్పు చేస్తే అప్పటికప్పుడు రికవరీ అయిపోతుంది. అట్లాగే పాపం కూడా పుణ్యం గతంలో ఉంటే పాపం చెయ్యగానే శిక్షరాదు. ఈ పుణ్యం క్షయం అయితే పాపం చెయ్యడ మేమిటి,

శిక్షపడటమేమిటి. ఇది తెలియక చాలామంది అంటారు ఎన్నో పాపాలు చేస్తున్నారు వారికి ఏమీ కష్టాలు రావడం లేదు. మాకే ఎందుకు రావాలి. అని. అప్పుడు నేను చెప్పాను. ఒకడికి పదివేల రూపాయల ఆస్థి ఉంది. ఐదు వేల రూపాయలు అప్పుతెచ్చుకొన్నాడు. ఆస్థి అపుడే జప్తుకి వస్తుందా? రాదు. ఈ పదివేల ఆస్థి ఖర్చు అయిపోతే అపుడు బ్యాంకు వాళ్ళు నోటీసు ఇస్తారు. అట్లా వెనకాల సెక్యూరిటీ పుణ్యం ఉన్నంతకాలం వీడు చేసిన పాపాలకు ఫలితం నెత్తిమీదకు రాదు. అలా అని చెప్పి ఫలితం లేదు కదా అని చేసుకొంటూ పోతే ఏ పనికి కూడా ఫలితం లేకుండా ఉండదు. అది లేదనుకొనే వాడు మూర్ఖుడు. చేసిన మంచి పనికి మంచి ఫలితం, చేసిన చెడు పనికి చెడు ఫలితం. 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' భాగవత, భారత, రామాయణములు మనకు చెప్పే నీతి ఏంటయ్యా అంటే మనం చేసిన మంచి చెడు పనులకు ఫలితం తప్పక అనుభవించాల్సిందే. ప్రతివాడు సుఖాన్ని కోరుకుంటున్నాడు. కానీ కోరుకొన్నందువల్ల సుఖం వస్తుందా? రాదు. ఈ సుఖం రావడానికి ఏ పనులు అయితే చేయాలో అవి చెయ్యాలి. దాన్ని పుణ్యం అంటారు. పుణ్యం అంటే ఏమిటి ? ఏ పనులు మనకు సుఖాన్ని, సంతోషాన్ని, ఆనందాన్ని, ఆరోగ్యాన్ని, మనశ్శాంతిని ఇస్తాయో వాటికి పుణ్యకర్మలు అని పేరు. ఏ పనులు చేస్తే ఫలితం దరిద్రం, బాధలు, ఇంట్లో గొడవలు, తగాదాలు, అనారోగ్యం వస్తాయో అవి పాప కర్మలు. ఇపుడు ఏం చేస్తున్నారు జనసామాన్యం ? పుణ్యం లేదు, పాపం లేదని అన్నీ చేసేసి నెత్తిమీద కొచ్చిన తర్వాత ఏడుస్తున్నారు. అప్పు చేసిన తరువాత రికవరీకి వస్తే ఎవరు రక్షిస్తారు. ఎవరూ రక్షించరు. పూర్వం ఇంత గొడవలు, దరిద్రం లేకపోవడానికి కారణం, ఇంత కష్టాలు

లేక పోవడానికి కారణం, ప్రజలలో ఇంత మోసం, ఇంత ద్రోహం లేక పోవడానికి కారణం వాళ్ళు ఇంత చదువుకోకపోయినా మనకన్నా సుఖంగా ఉండటానికి కారణం వారు సరైన భోజనం తినేవాళ్ళు, ద్రోహం లేని జీవితం జీవించే వాళ్ళు, ఒక మనిషికి ఇంకొక మనిషి చేతనైతే సహాయం చేయడం ఉండేది కానీ ద్రోహం మాత్రం ఉండేది కాదు. సమయం ఉంటే ధర్మచింతన చేసి, ధర్మంతో గడిపే వాళ్ళు.

పూర్వకాలానికి ఈ కాలానికి ఎంత తేడా వచ్చిందంటే బుద్ధుడి యొక్క జీవితంలో ఒక కథ తెలిస్తే అర్థమవుతుంది. ఒకరాజు పరిపాలన చేస్తుంటే వర్షాలు పడలేదుట. వర్షాలు పడకపోతే ఆ రోజుల్లో ఏమను కొనేవారంటే ప్రజలకు కష్టాలు ఎందుకు వస్తాయంటే ఆ దేశంలో ఎపుడు ధర్మం నశిస్తే అపుడు వస్తాయనే సిద్ధాంతం ప్రతివారికీ తెలుసు అపుడు. ఇపుడు తెలీదు. కష్టాలు వస్తున్నాయని తెలుసు కానీ ఎందుకు వస్తున్నాయో తెలీదు. అపుడు ఆ రాజుగారు ఒక రాజగురువుని పిలిచి అడిగినారట. అయ్యా ఈ సంవత్సరం వర్షం పడలేదు. ఏం తప్పు ఉన్నది మా రాజ్యంలో చెప్పండి అని. అయ్యా ఏం తప్పు ఉందో ఇంతమంది ప్రజలలో వెతికి చెప్పడం కష్టం. కానీ ధర్మరక్షణ పోయినపుడు వర్షములు పోవడం, కష్టములు కలగడం జరుగుతాయి. 'మరైతే నేనేమి చేయాలో చెప్పండి' అన్నాడు రాజుగారు. ఎందుకంటే చెయ్యవలసిన డ్యూటీ రాజుది. చెప్పవలసిన డ్యూటీ గురువుది. వశిష్ఠులవారు ఎట్లా అయితే దశరథులకు చెప్పేవారో, అట్లా చేయకపోతే వీడిది దోషం, అపుడు ఆ రాజగురువు అన్నాడట 'ప్రక్కన కురుదేశంలో పరిపాలించే ఆయన చాలా ధర్మాత్ముడు. అక్కడ వర్షాలు బాగా పడుతున్నాయి. దేశం చాలా సుభిక్షంగా ఉంటోంది. అందుచేత

మన మంత్రుల్ని, గూఢచారులను పంపి ఏ కారణంచేత అక్కడ వర్షాలు బాగా పడుతున్నాయో కనుక్కొని మనం దానిని అనుసరించడం మంచిది' అని. 'సరే! వెళ్ళండయ్యా' అని మంత్రుల్ని అనగానే, మంత్రులు వెళ్ళి వచ్చి ఏం చెప్పారంటే ఆ రాజుగారి దగ్గర సర్వ శుభప్రదమైన ఏనుగు ఒకటి ఉన్నది. ఆ ఏనుగు మన రాజ్యానికి గనుక వస్తే మనకు వర్షాలు బాగా పడతాయి. అంటే ఈ రాజు అన్నాట్ట 'ఆ రాజు ధర్మాత్ముడే గాక మంచియోధుడు కూడా. మరి ఆయన్ని జయించడం ఎట్లా ?' అని. దానికి మంత్రులు 'జయించడం అంటే జరగదు. మీరు వెళ్ళి యాచిస్తే ఇస్తాడు' అని అంటారు.అపుడు ఆయన పురోహితుల్ని పంపాడట. ఆరాజు ప్రతి పౌర్ణమినాడు, అమావాస్యనాడు బ్రాహ్మణులకు దానమిస్తాడట. ధర్మ కార్యాలన్నీ చేసేవాడు. ఆ సమయంలో ఈ బ్రహ్మణులు వెళ్ళి మాకుకూడా దానం ఇవ్వమని అడిగారు. అడిగిన వారికి లేదనక పోవడం ధర్మం.మీకు ఏం కావాలి అని అడిగాడు. 'మీరు ఎక్కినటువంటి అగ్రగజము ఏనుగును ఇవ్వండి'. 'ఆ..!!' త్రుళ్ళిపడ్డాడు ఆయన. ఏనుగును అడుగుతారా ఏవరైనా, డబ్బులు అడుగుతారు. కానీ, ఏనుగును అడిగారు కారణం ఏమిటో చెప్పండి అని. 'అయ్యా! నిజం చెపుతాము. మా రాజ్యంలో వర్షాలు పడటం లేదు. అందుకని మీరు ఏనుగును ఇస్తే వర్షాలు పడతాయని పెద్దలు చెప్పారు. అందుకని ఇవ్వవలసినది'. అపుడు ఆయన ఏనుగు దిగి దాని చుట్టూ మూడు సార్లు తిరిగాడట. అపుడు మంత్రిగారు అన్నారట. 'అయ్యా! ఏనుగు దిగి చుట్టూ చూసుకొంటున్నారు. దానం అడగగానే ఇవ్వాలి కదా!' అని. అయ్యా! ఇది కురుదేశం. ధర్మంగా పరిపాలించే వాళ్ళం మేము. ఎందుకని చుట్టూ చూచామంటే ఏనుగును దానం ఇచ్చేటపుడు సర్వాభరణాలతో

దానం ఇవ్వాలి. ఏదైనా ఆభరణం మరచిపోయామేమోనని ఆయన మూడు సార్లు చూచాట్ట. అన్నీ సక్రమంగా చూసి సంవత్సరమునకు సరిపడేమేత కూడా ఇచ్చాడట ఆయన. అయితే వీళ్ళ యొక్క దురదృష్టం వల్ల ఏనుగు వచ్చినాగానీ వర్షాలు పడలేదు. మళ్ళీ మంత్రుల్ని అడిగాడట. అయ్యా! ఏనుగులను తెచ్చుకొన్నాము అయినా వర్షాలు పడటం లేదు అని. ఏమి కారణం? అయ్యా! మన ప్రజలు ఈ ఏనుగు పుణ్యంకన్నా మించిన పాపం ఏదో చేస్తూ ఉండాలి. ఇపుడు రు.50 తెచ్చుకొన్నా సరిపోలేదంటే రు.100 అప్పు ఉన్నాడన్నమాట. ఈ రు.50లు అందులోకే పోతాయి. అంటే చేసిన పుణ్యంచాలటం లేదు. అపుడు చెప్పారట. ఆ రాజుగారు చాలా పుణ్యం చేసికొన్నారు. ఆ పుణ్యంలో కొంచెం ధారపోయమనండి అని. మంచిదే అని వెళ్ళారు. అపుడు రాజుగారు అన్నారట 'ధర్మపాలన చేస్తున్న మాట వాస్తవమే కానీ మా ధర్మంలో లోపం జరిగింది నేను చేసేదాంట్లో. అందువల్ల నాధర్మపరిపాలన సరిగా లేదని చింతపడుతున్నా నేను. అటువంటి వాడిని మీకు ధర్మం ఏవిధంగా ఇస్తాను' అని. అయ్యా! మీరు చేసిన లోపం ఏంటని అడిగితే 'ఒక రోజు వేటకు వెళ్ళాను నేను. వేటకు వెళ్ళి నాలుగు వైపులా బాణాలు వేశాను. ఒక బాణం చెరువులో దిగి చేపకు గ్రుచ్చుకొంది. అందువల్ల నిష్కారణంగా క్రూరమృగాలను చంపవలసిన రాజును చేపను చంపాను కాబట్టి ఆ విధంగా ధర్మలోపం అయింది నాకు, అంటే ఇది పెద్ద ధర్మలోపం కాదు లెండి, ఇటువంటివి చాలా చేస్తుంటాము మేము అన్నారట. అంటే ఆయన అన్నాడట **'ధర్మంలో చిన్నపెద్దా తేడా ఏమి లేదు. కుండకు పడేది చిన్న చిల్లే. కానీ తర్వాత అన్నీ పోతాయి'**. ఇది ధర్మలోపం జరిగినట్లు మీకు ఎట్లా తెలుసు అంటే 'ఇప్పటికి అరవై ఏండ్ల

నుండి ధర్మం ప్రకారం పరిపాలన చెస్తూ వస్తున్నాను నెను. కాని నెను కూడా చిన్న ధర్మలోపం చేశాను. అందువల్ల మనసు అశాంతిగా ఉన్నది. అందువల్ల ఇవ్వలేను మీకు అన్నాడట. అపుడు వారు ఆ రాజు గారి భార్య దగ్గరకు వెళ్ళి ధర్మం దానం ఇమ్మన్నారు. అంటే 'ఇద్దరు కోడళ్ళు ఉన్నారు నాకు. పెద్దకొడుకు భార్య ఏమో పట్టపురాణి. చిన్న కొడుకు యువరాజు. ఆయన భార్య ఏమో యువరాణి. వీళ్ళిద్దరికీ ఆలయం నుంచి వస్తువులు వచ్చినవి. ఒక చీర ఒక ఆభరణం. ఈ చీర ఏమో యువరాణికి ఇచ్చి,ఆభరణం ఏమో రాణిగారికి ఇద్దామనుకొన్నాను. ఎందుకంటే రాజుగారి భార్యకు నగలు అవసరం కదా అని. కానీ అత్తగారు అయిన నాకు ఇద్దరు కోడళ్ళు సమానంగా ఉండవలసింది. ఈ ధర్మలోపం వచ్చింది కాబట్టి నాకు మనశ్శాంతి లోపించింది. అందువల్ల మీకు ఇవ్వలేను. వీరు ఆశ్చర్య పోయి, ఇంత చిన్నదానికే ధర్మలోపమా! అత్తాకోడళ్ళు మొగుణ్ణి కట్టేసి భోజనంచేసేవాళ్ళున్నారు మా దేశంలో. వాళ్ళకి ఏ చింతా లేకుండా. అంటే ఇదిఅట్లాంటి దేశం కాదండి. ఇదిధర్మానికి శరగోపురము. అందుకని నేను మీకు ధర్మాన్ని ఉపదేశించడానికి వీలు లేదు. వెళ్ళి మా కోడల్ని అడగండి. ఆమె మీకు ధర్మాన్ని ఉపదేశిస్తుంది అంది. ఇట్లా వీళ్ళు వెతుక్కొంటూ వెళితే ఒక్కొక్కరు, ఒక్కొక్కరు ఎట్లా ధర్మపాలన చేసేవాళ్ళో, చివరికి ఓ చెట్టుక్రింద కూర్చున్న ఒక వ్యక్తి, ఒక వ్యవసాయదారుడు అతను ధర్మలోపం లేకుండా ధర్మాన్ని ఆచరిస్తున్నాడు. అప్పుడు ఆయనచేత బంగారు పలకమీద ధర్మంయొక్క సూత్రాల్ని వ్రాయించుకొని ఆయన పుణ్యాన్ని ధారపోయించు కొని తెచ్చారట. వీరు పొలిమేరలోకి రాగానే మూడు వర్షాలు కురిశాయి.

పూర్వం ధర్మలోపం ఎంత చిన్నదైన, ఇది చిన్నది అనుకోరు.

ఎందుకంటే ఇది వడ్డీ పెరిగినట్లుగా పెరుగుతుంది. అప్పు చిన్నదేకదా అని ఇవాళ ఊరుకొంటే అసలుకే మోసం వస్తుంది. అందువల్ల ధర్మాచరణ విషయంలో అంత జాగ్రత్తగా ఉండేవాళ్ళు. ఇది బుద్ధదేవుడి కథలలో ధర్మాచరణ గురించి చక్కగా వివరింపబడింది. మరి వేల సంవత్సరాల క్రితం రామాయణకాలంలో ధర్మమెట్లాఉందో మనంఊహించనైనా ఊహించలేము.

అందుచేత ప్రతివాడు రోజుకొకసారి ధర్మచింతన, మనువు ఏంచెప్పాడు 'ప్రతివాడు తన దినచర్యలో మానవుడు బ్రహ్మ ముహూర్తంలో నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకొన్న తర్వాత ఏం చెయ్యాలంటే మనస్సును ధ్యాన మనస్కుడు గావించి ధర్మం యొక్క స్వరూపాన్ని చింతించాలట ఆలోచించాలి.' ధర్మం, న్యాయం, పుణ్యం అనే దానిని గురించి ఏకాగ్ర మనస్కుడై కాసేపు ఆలోచించమన్నాడు. ముందు ధ్యానంచేస్తే తర్వాత ఆచరణలో ధర్మం గురించి ఆలోచన వస్తుంది. మనకు ధర్మం గురించి ధ్యానించడానికి టైము లేదు. ఆచరించడానికి అసలే టైము లేదు. అందువల్ల ధర్మచింతన అనేటటువంటిది, ధర్మం అనేదానిని గురించి చింతించడం, కనీసం అది చేతగాకపోతే దైవంగురించి చింతించడం. ఈ సృష్టికి కారణ మైననటు వంటి వాడు మన శరీరంలో ఊపిరి పీలుస్తున్నాం, గుండె కొట్టు కొంటోంది. ఇవన్నీ మన తెలివితేటలని బ్రతుకుతున్నాడు మనిషి. అది ఆగిపోతే, చేతులు చల్లబడితే డాక్టర్లువచ్చి ఏమీ చెయ్యలేరు. బంధువులను పిలిస్తే వాళ్ళువచ్చి వీడు పోతే వచ్చే ఆస్థి గురించి లెక్క పెట్టుకొంటారుతప్ప వీడిని గురించి పట్టించుకోరు. అంటే మానవజీవితం మన చేతిలోలేదనే విషయం చివర తెలిసికొంటే ప్రయోజనం లేదు. అందువల్ల మనకు జీవితం ప్రసాదించి, మనస్సుఇచ్చి, శరీరంఇచ్చి, మన చేతిలో లేనటువంటి

ఇంద్రియములు, ప్రాణము ఇచ్చిన భగవంతుని గురించి చింతించడం, దీని వలన భగవంతునిపై ధ్యానం కుదురుతుంది. ధ్యానం ఎందుకయ్యా అంటే, అలవాటు ప్రకారం మీరు ఎట్లా అయితే భగవంతునిపై మనస్సు నిలబెట్టడం నేర్చుకొంటారో దానియందు ఆసక్తి కలుగుతుంది. అంటే ఏ విషయంగురించి మనస్సు ఆలోచిస్తే దానియందు ఆసక్తి కలుగుతుంది. మంచి సినిమా ఆడుతున్నది అని ప్రక్కింటి ఆవిడ చెపుతుంది. దాని గురించి రెండు సార్లు ఆలోచిస్తే మూడవసారి వెళ్ళాలనిపిస్తుంది. అలాగే చక్కని భగవత్ సంకీర్తన జరుగుతున్నది అని రెండు సార్లు ఆలోచిస్తే మూడవసారి పోనీ ఎలా ఉందో చూసొద్దామేమిటి అని ఆసక్తి కలుగుతుంది. రెండుసార్లు చూచేసరికి మూడవసారి మనం ఆచరిద్దామన్న కోరిక కలుగు తుంది. అందువల్ల **ఈ ధర్మచింతనలో ఉన్న చమత్కారం ఏమిటంటే మనం ఈ ధర్మ చింతన గురించి ఆలోచించే కొలదీ దాని బలం పెరుగు తుంది. చెట్లకు నీళ్ళు పోసిన కొద్దీ చెట్లు ఎట్లా అయితే వృద్ధి చెందుతాయో, అట్లా ధర్మాన్ని వృద్ధి చేసుకోవాలి.** అందువల్ల పెద్దలుకూడా ఈ ధర్మాన్ని ఉపదేశించేవారు. ఈ ధర్మాన్ని ప్రబోధంచేసి ఆచరించిన వాడు కనుక రామచంద్రమూర్తిని 'రామో విగ్రహవాన్ ధర్మః' అంటారు. వనవాస కాలంలో రాములవారికి చెప్పారట 'నీవు పెద్దవాడివి అయినా కొడుకుకి రాజ్యం ఇవ్వకుండా వెళ్ళగొట్టారు కాబట్టి నీవు అధికార పూర్వకంగా ఎందుకు తీసికోకూడదు ?' అని. నీతండ్రి ముసలితనం వల్ల లేదా తల్లిమాట వినడంవల్ల నీకు రాజ్యం రాలేదు కాబట్టి న్యాయంగా నీకు రావలసిన రాజ్యాన్ని బలంతో జయించి నీవు తీసికొంటే అది నీ హక్కు. ఈ రోజుల్లో చెప్పినట్లే ఆ రోజుల్లో కూడా చెప్పారట. నీ హక్కును

నీవు ఎందుకు సంపాదించు కోకూడదు? అందుకు ఆయన చక్కటి సమాధానం చెప్పాడు. మానవుడికి సుఖదుఃఖాలు ఎందుకు కలుగుతాయో కారణం మానవుడి చేతిలో లేదు. అన్నీ దైవంచేతిలో ఉన్నాయి. ఆయనే మనిషికి సుఖం ఇవ్వాలన్నా, దుఃఖంఇవ్వాలన్నా ఏ రోజు ఏం జరగాలో దైవం నిర్ణయిస్తుంది. దేన్ని బట్టి నిర్ణయిస్తుంది అంటే ఊరకే ఇష్టం వచ్చినట్లు నిర్ణయించదు. వీడు చేసిన పుణ్యాపాపాల వల్ల సుఖదుఃఖాలు నిర్ణయించబడతాయి. ఇవాళ కష్టంవచ్చిందికదా అని ధర్మాన్ని విడచి పెట్టినట్లైతే, సుఖంగా ఉందికదా అని అధర్మాన్ని ఆచరించినట్లైతే ధర్మ విఘాతం కలుగుతుంది. రాజైనవాడు ఏధైతే ధర్మాన్ని ఆచరిస్తారో ప్రజలందరూ అదే ధర్మం ఆచరిస్తారు. అంటే రాజైనవాడు ఒక్క రూపాయి తింటే ప్రజలందరూ లక్షరూపాయలు తింటారు. రాజుకనుక నీతిగా ఉంటే ప్రజలందరూ కూడా నీతిగా ఉంటారు. అందుకని సుఖం అని మనిషి అధర్మాన్ని ఆచరించి, కష్టం అని ధర్మాన్ని వదిలివేసినట్లైతే ధర్మనష్టం అయిపోతుంది. సుఖదుఃఖాల కంటే కూడా ఈ ధర్మాచరణ ముఖ్యం అనేటటువంటిది ఈ సూత్రం రామచంద్రమూర్తి కష్టాలలో ఉన్నపుడు కూడా, హక్కుగా రావలసిన రాజ్యం రానపుడు కూడా తొందర పడకుండా ఏవిధంగా ఆచరించి చూపాడంటే మానవుడైన వాడు కష్టములలో మనసును నిలదొక్కుకొని ధర్మంపై కాస్త ఏకాగ్రత చేసినట్లైతే కష్టాన్ని జయించవచ్చు అని. చాలా మంది తొందరపడిపోయి అప్పులు చేస్తారు. తొందర పడిపోయి తప్పులు చేస్తారు. దొంగతనాలు చేస్తారు. అందువల్ల పెరిగిపోతాయి కష్టాలు తప్ప తగ్గవు. తేలికగా తప్పించుకోవచ్చు అనుకొంటారు. **ఈ అధర్మంలో ఉండేటటువంటి చమత్కారం ఏమిటంటే తేలికగా తప్పించుకోవచ్చు**

**అనే మాయలోపడేసి మనచేత తప్పలు చేయిస్తుంది. తప్ప చేసిన తర్వాత శిక్ష అనుభవించేలా చేస్తుంది.** అందువల్ల ఈ ధర్మానికి ఓర్పు అనేటటువంటిది మనుష్యుడికి 'యధిక్ష', అంటే కష్టం కలిగినప్పటికీ దీక్షగా ధర్మం వదిలిపెట్టకుండా ఉండటం. ఈ చింతనవల్ల అంటే చెడుకర్మ వల్ల ఇది వరకు చేసిన పాపాల వల్ల కష్టాలు కలగవచ్చు. వాటిని అనుభవిస్తూనే కష్టాలలో ధర్మాన్ని విడచి పెట్టకూడదు అనేది రెండవ సిద్ధాంతం. ఇవి రామాయణంలో మనకు ఉపదేశించినటువంటి ముఖ్యమైన సూత్రాలు. ఈ సూత్రాల్లో ధర్మం అనేటటువంటిది ఒకటే అయినప్పటికీ ప్రతి మనిషికీ జీవితంలో తన జన్మనుబట్టి వాడి ధర్మంవేరే ఉంటుంది. భార్యయొక్క ధర్మం వేరే, భర్త యొక్క ధర్మం వేరే. కొడుకైనటు వంటి వాడు చేయువలసిన ధర్మం వేరే. తండ్రి అయినటువంటి వాడు చేయవలసిన ధర్మం వేరే. గురువుగా, ఒక మాస్టరుగా, ఒక టీచరుగాధర్మం వేరే. ఒక విద్యార్థిగా, ఒక శిష్యుడిగా వీడు చేయవలసిన ధర్మం వేరే. ఈ విధంగా జీవితంలో తన పాత్రను తను యోచించుకొని తన ధర్మాన్ని బట్టి తను నడవాలి. ధర్మం ఒకటేకదా అంటారు. ఒకటే కాదు. ఎట్లా అవుతుంది? రాజుకుధర్మం, ప్రజలకు ధర్మం ఒకటే ఉండదు. గురువుకీ, శిష్యుడికీ ధర్మం ఒకటే ఉండదు. అంటే ఎవడు ఏమి స్థితిలో ఉన్నాడో వాడి పరిస్థితికి కరెక్టుగా చేసుకొంటూ పోతే ఏది ఉందో అదే ధర్మం. అది కష్టం ఉండొచ్చు. లేకపోతే దానిలో ఇబ్బందులు ఉండొచ్చు. పోలీసువాడిగా ప్రొద్దుటనుండి కాపలా కాయడం కష్టమే. కానీ అది వాడి ధర్మం. డ్యూటీ మానేసి పడుకొంటే సుఖం. కానీఅది అధర్మం. ఏ పనిచేసినా ఏది సుఖంగా ఉంటుందాఅని ఆలోచిస్తున్నారు కానీ ఏది ధర్మము అని ఆలోచించట్లే. ఈ కారణంవల్ల

సుఖంగురించి ఉండే ఆశవల్ల కష్టాలు కొని తెచ్చుకొంటున్నాడు.

పూర్వం కష్టాలంటే భయంలేకుండా ధర్మాన్ని ఆచరించడంవల్ల ఇన్ని కష్టాలు ఉండేవి కావు. ఈ ఒక్క సూత్రాన్ని మనం గనుక మన జీవితంలో అన్వయించుకొని మన జీవితంలో మనకు ఉన్న కష్టాలను లిస్టు వేసుకొని రోజూ మనం చేసే తప్పులను గుర్తుంచుకొని, పడుకొనేటప్పుడు ఒక్కసారి తాను ఆత్మవిచారం చేసికొంటే ఇపుడు చేసేటన్ని తప్పులు మానవుడు చేయడు. ప్రతిరోజూ ఆత్మవిచారం అనేటటువంటిది, చేయటంవల్ల అంటే ఇవాళ మనం ఈ తప్పు చేశాం ఇది చేయకుండా ఇలా చేసి ఉంటే బాగుండేది అని నిజమైన పశ్చాత్తాపంతో భగవంతుని ప్రార్థించడంవల్ల అపుడు, చేసిన తప్పులకు శిక్ష కొంతవరకు తగ్గుతుంది. **పశ్చాత్తాపం ఎపుడైతే కలుగుతుందో మానవుడికి పడేటటువంటి శిక్ష కూడా తగ్గుతుంది.** ఇది శాస్త్రాలు పూర్వం నుండి బోధించాయి. ఏదైనా సరే తప్పు చేసినపుడు పశ్చాత్తాప పడి, తిరిగి ఆ తప్పు మళ్ళీ చేయనని మనసులో ప్రతిజ్ఞించు కొంటామో అపుడు ఈ అనారోగ్యాలు, ఈ బాధలు, ఈ ప్రలోభాలు, మనల్ని అన్ని వైపులకూలాగేటటువంటి లంచాలు ఉన్నాయే, లంచంఅంటే ఏమిటి? పతనం చేయించేందుకు మనిషిలో ఉండే స్వార్థమే లంచం. ఇది జయించ డానికి పూర్వఋషులు మనకు మార్గం ఇచ్చారు. ఇది ఇంకొక మెట్టు పైకెడితే ధర్మం చేయడం అలవాటు అయ్యేవాడికి దీనితోపాటు జపధ్యానాలు, అనుష్టానములు, అలవాటు కావాలి. **ఎద్దు ఏ విధంగా అయితే గాడికట్టడం అలవాటు అయితే బండివాడు నిద్ర పోతున్నా సరే అవి ఆదారి వెంబడే వెళతాయో, ఈ శరీరంలో కాళ్ళు, చేతులు ఇంద్రియాలు కూడా ఎద్దుల వంటివే. మనం అలవాటు చేస్తే**

**అవి ధర్మం వెంబడి వెళ్తూ, ధర్మంవెంబడి లాక్కెళతాయి.** లేదా రోజూ కాఫీ హోటల్‌కో, లేదా క్లబ్‌కో ఏ అలవాటు చేస్తే అటు వెడతాయి. అందువల్ల ఈ శరీరాన్ని ఏ విధంగా అభ్యాసం చేస్తామో ఈ రథాన్ని ఆ విధంగా లాక్కెడతాయి. ఈ ధర్మం అలవాటైతే కొంతకాలం ఆచరించడం, అభ్యాసం, అంటే కళ్ళుమూసుకొన్నా సరే తప్పుచేయకుండా, ఆదమరచి ఉన్నా పొరబాటు మాటరాకుండా, తప్పుడు ఆలోచన రాకుండా, ధ్యానశిక్షణలో పెరిగి క్రమశిక్షణతో బ్రతికేటటు వంటి వాడికి అపుడు జపధ్యానం, అనుష్ఠానం, దైవచింతన అట్లే నడుస్తుంది. చాలామంది అడుగుతుంటారు ఈ జపధ్యానాలు చేయమం టారు, ఈ మంత్రాలల్లోపడి మనసు నిలవడం లేదు అని. ఎందుకనివాడు మొదట్లోనే A,B,C,Dలు రాకుండానే పాఠం ఎట్లా చదువుతాడు వాడు. అంటే మొట్టమొదట స్కూలుకు వెళ్ళటం అలవాటైతేనేగా. బడికి వెళ్ళగానే చదువు వస్తుందా ? రాదు. అసలు బడిలోకి వెళ్ళి కూర్చోవడమే వారికి కష్టం. ఇంటికి జారుకొంటాడు. అలాగేమనసు ధర్మంలో పెట్టేసరికి పారిపోయి వచ్చేస్తుంది ఇంటికి, దానికి చాక్లెట్లో, బిస్కెట్లో ఇచ్చి స్కూల్లో కూర్చోబెట్టినట్లుగా, గాథలు, పురాణాలు వీటి మీదకి మనసు మళ్ళిస్తే క్రమంగా ధర్మం వైపుకు తిప్పుతాడు. అపుడు బిస్కెట్లు ఇవ్వకపోయినా చదువు సంగతి తెలిసిన తర్వాత వాడే చదువు కొంటాడు. అట్లాగే మనిషి కూడా ముందు ప్రసాదం పెడతారని వెడతాడు. తర్వాత ప్రసాదం పెట్టినా పెట్టకపోయినా పెడతాడు. తర్వాత భగవంతుడు మనం అడిగింది చేసినా చేయకపోయినా భగవంతుని మీద మనసు లగ్నం పెట్టడం అలవాటు అవుతుంది. ఈ ధర్మం ఆచరించడం అలవాటైన తర్వాత అపుడు మంత్రం, దాని యొక్క అనుష్ఠాన విధానము.

మంత్రరాజమైన గాయత్రీ మంత్రము మోక్షాన్ని ప్రసాదించేటటు వంటిది. దీని యొక్క రహస్యం రామాయణంలో తెలుపబడింది. అయితే ఇపుడు మనం మోక్షాన్ని కోరుకొనే స్థితిలో ఉన్నామా! లేదు. ఈ మోక్షాన్ని కోరుకొనే స్థితి అనగా ఏమిటి ? ప్రతివారికీ కొన్ని కోరికలున్నాయి. కొన్నేమిటి. చాలా ఉన్నాయి. ఈ కోరికలలో చాలామటుకు స్వార్థపూరితమైన కోరికలు. అంటే మనకు డబ్బురావాలి. సుఖం కలగాలి. ఈ విధమైనటువంటి మేలు జరగాలి. ఇవన్నీను. ఇవి తీరుతూ ఉన్న వాళ్ళకి లేదా వీటియందు ఆసక్తి నశించని వారికి, ఈ కోరికలు అనేవి అంతూ పొంతూ లేకుండా ఉంటాయి. ఇసకపాతరలాగా. అంటే ఇసుక త్రవ్వుతున్న కొద్దీ వస్తూనే ఉంటాయి. అంటే ఇవాళ ఒక కోరికను తీరిస్తే రేపు రెండు వస్తాయి. రేపు రెండు తీరిస్తే తర్వాత 10 వస్తాయి. అందువల్ల జీవితాంతం వరకూ, అంటే చచ్చేవాడు కూడా ఏదో ఒక కోరిక కోరుతూ ఛస్తాడు. అందువల్ల కొందరికి జ్ఞానం కలిగినపుడు ఈ కోరికలు తీర్చడం వల్లకాదు. వీటిని ఖండించడం వల్లనే పోతాయి. అలా ఈ కోరికలన్నీ ఖండించినపుడే మోక్షాన్ని పొందగల స్థితి కలుగుతుంది. మోక్షం అంటే ఏమిటి? ఈ నానాగొడవలూ పడి, ఇబ్బందులూ పడి, ఈ సంసారంలో మురికి కూపంలో కొట్టుకు చచ్చే జన్మలు లేకుండా ఉండాలి నాకు. భగవత్ సాన్నిధ్యం, భగవంతుడు నిత్యం ఆనంద స్వరూపంలో, జ్ఞాన స్వరూపంలో, మోక్ష స్వరూపంలో ఎలా ఉంటాడో ఒక్కసారి మనసుకు తెలిస్తేనే ఏదో ఆనందం కలుగుతుంది ధ్యానంలో. కొన్ని సంవత్సరాలు సాధన చేసిన వాళ్ళకి కూడా ధ్యానంలో కొద్ది నిమిషాలు భగవంతుని యందు లగ్నం అవుతుంది. ఆ కాసేపు పరమానందం కలుగు తుంది. ఎంతో శాంతి కలుగుతుంది. ఇది అనుభవంతో తెలిసే విషయం.

ఈ శాంతి వాడికే కాదు. **ఎవరికి అయితే ఒక నిమిషం భగవద్ధ్యానం కుదురుతుందో వారిదగ్గర కూర్చున్న వాడికి కూడా శాంతి కలుగు తుంది.** చాలామంది అంటారు 5 నిమిషాలు మీతో మాట్లాడితే మాకు చాలా ఆనందం కలుగుతుంది అని. ఎందుకు కలుగుతుంది? నేనేమైనా 10 రూపాయలు ఇస్తున్నానా, లేదా టీ.వీ. పెడుతున్నానా? ఏమీ అక్కర్లేదు. కుంపటి దగ్గర కాసేపు కూర్చొంటే చలి పోతుంది అన్నాడు. ఎందుకని, కుంపట్లోంచి వేడి వస్తోంది కాబట్టి. ఒక మానవుడి శరీరంలో నుండి ఆనందం ఎప్పుడైతే వస్తుందో, అగ్ని నుండి వేడి బయటికి వచ్చినట్లుగా అది ఇతరులకు కూడా ఉపయోగంచేస్తుంది. కాసేపు భగవంతునియందు మనసు నిలిపితేనే ఇతరులకుకూడా ప్రశాంతి కలుగు తుంది కదా! వీడు నిత్యంకనుక చేసికొంటే, అటువంటిది శాశ్వితంగా భగవత్ స్థితిలో, మోక్షస్థితి లోతాను ఉండగలిగితే ఈ జన్మలన్నీ అక్కర్లేకపోతే, గాఢమైన నిద్రపోతే మనకు ఏమన్నా ఆలోచనలు వస్తాయా ? రావు. వళ్ళు మరచి నిద్రపోయి నపుడు ఏ ఆలోచనలూ రావు. ఏ దిగుళ్ళూ ఉండవు. భూమి మీదనే కాసేపు నిద్రపోతే ఏ కష్టాలు లేవు కదా! మరి శాశ్వితంగా బ్రహ్మలోకంలో భగవంతునితో సమాధి స్థితిని పొందినపుడు అపుడు కష్టాలు ఎందుకు ఉంటాయి. వేరే జన్మ ఎత్తమంటే మాత్రం ఎత్తుతాడా ! ఈ మానవలోకంలోకి? ఈ మోక్షం యొక్క స్థితి తెలియక మనిషి ఈ నీచమైన, కుక్కలు చింపిన విస్తరిలాంటి జీవితం కోసం ఆశపడతాడు. అందుకని

పూర్వ ఋషులు ఏం చెప్పారంటే 'ఓరి పిచ్చివాడా! డబ్బులో ఏముంది సుఖం ? ఈ సంసారంలో ఏముంది సుఖం ? ఇవి కాసేపే. ఒక పావలా సుఖం ఉంటే ముప్పావలా బాధలే. అంటే పెళ్ళి చేస్తారు

ఒక్కైదునిమిషాలే వీడికి సుఖం భార్యతో. తర్వాత పిల్లలు, సంసారం, గొడవలు ఈ వడ్డీ వ్యాపారంతో ఛస్తాడు వాడు. అంటే ఒకటే పెట్టుబడి పెట్టాడు వీడు సంసారం. అది వృద్ధియై వీడినెత్తిమీద కూర్చుంటుంది అంతా. ఇక వీడికి ఆ రోజు నుండి నిద్ర ఉంటుందనే గ్యారంటీ లేదు. తర్వాత వృద్ధాప్యం వచ్చేవరకూ సమస్యలకు లోటులేదు. ఎందుకంటే వాళ్ళకి భోజనం, ఉద్యోగాలు, పెళ్ళిళ్ళు, వాళ్ళ గొడవలు, అన్నీ ఇంతే. ఇక మిగిలింది 'నేను' ఒక్కడినేనా? 'కూతురి పెళ్ళి చేసావయ్యా, అదృష్టవంతుడివి. అన్ని సమస్యలు తీరినవి కదా!' అన్నాను. 'లేదండీ బాబూ!ఇది వరకు ఒక్క సమస్యే. ఇపుడు నాలుగు సమస్యలు'. అంటే కూతురు ఒక్కతే ఇంట్లో ఉండేది. ఇపుడు అల్లుడికికూడా ఉద్యోగం చూడాల్సి వచ్చింది. అంతటితో ఆగిందా ! మరలా పురుడులకని, పుణ్యాలకని వచ్చినపుడు అదో సమస్య. ఇవి వృద్ధి అవుతాయి కానీ తరగవే! పోనీ మనకెందుకని ఊరుకోగలడా ? వీడి బుద్ధి ఊరుకోనివ్వదు. దిగులు పడుతూనే ఉంటాడు సంసారం గురించి. అందువల్ల కాసేపు సంతోషం అనుభవించిన సంసారానికి చిలవలు పలువలుగా ఇన్ని దుఃఖాలు ఉన్నవి కదా! ఈ లోకంలో 5 నిమిషాల సుఖంతో మనిషి చేసే అనేకపనులలో ఎన్ని బాధ్యతలు, ఎన్ని బాధలు, ఎన్ని వలల్లో చిక్కుకొంటున్నాడో ఇది దీంతోపోలిస్తే ఈ మోక్షంలో ఉన్న సుఖం ఏమిటో అపుడు తెలుస్తుంది. అంటే వళ్ళు మరచి నిదురపోయిన వాడికి దిగుళ్ళు, చింతలు గుర్తుండవు. శరీరంఉందనికూడా మరచి పోతాడు. ఏ ఊరిలో ఉండేది కూడా గుర్తుండదు. మిత్రులు, శత్రువులు ఉండరు. ఈ కాసేపేఇంత సుఖంఉన్నపుడు. పరమమోక్షంలో ఉన్న స్థితిలో ఆత్మకి భగవంతునియందు ఉండే స్థితిలో ఎంత బాగుంటుంది!!

రామకృష్ణ పరమహంసగారిని అడిగారట భక్తులు, 'అయ్యా! నీవు భగవత్సాన్నిధ్యంలో ఉంటావు. ఎలా ఉంటుందో చెప్పగలవా' అని. అంటే ఆయన అన్నాడు 'ఓ పంచదార చిలకను తీసికొచ్చి పానకంలో పడేస్తే ఏమౌతుంది?' అన్నాడు. 'కరిగిపోతుంది'. 'చిలక ఎక్కడుంది ?' అలాగే భక్తులు పంచదార చిలకలాంటి వారు. పానకంలాంటి వాడు భగవంతుడు. అందులో కలిసిపోతే కరిగిపోతాడు. ఇంకెక్కడ ఉన్నాడు రావడానికి. అంటే భగవంతుడు ఆనందస్వరూపుడు. జీవుడు ఆనందాన్ని కోరే లక్షణం గలవాడు. ఈ కోరేటటువంటివాడు ఆనంద సముద్రంలో మునిగి పోతే ఆ సముద్రంలో ఎక్కువ నీళ్ళుఉంటాయి. అంటే ఎంత ఆనందం అనుభవిస్తున్నాడో వీడు గుర్తించడానికి వీడికి ఎరుకనే ఉండదు. ఎరుక ఉంటే మళ్ళీ క్రిందికి వచ్చేస్తాడువాడు. మెలకువవచ్చేస్తుంది. అందువల్ల ఈ మోక్షంలో ఉండేటటు వంటి ఆనందం అటువంటిది. అందువల్ల మోక్షంకోసం ఈ మంత్రా నుష్ఠానం, మంత్రజపం, మనసును అంతర్ముఖం చేయుట, ఇంత పూర్వాంగం ఎందుకు చెప్పానంటే కేవలం పాండిత్యం కోసం నాలుగు శ్లోకాలు చెప్పేసి మీకు నాలుగుముక్కలు చెప్పేస్తే మీకు ఏవిధంగానూ అర్థం కాదు. ఆచరణలో మనకు ఈ మంత్రములెందుకు? ఈ సుఖం ఎందుకు ? ఈ మోక్షం ఎందుకు ? ఈ దుష్కర్మల యొక్క నివారణ ఎట్లాగ ? ఈ మనసు అంతర్ముఖమైతేగానీ మోక్షం యందు మనసు నిలవదు. అంతర్ముఖత్వం అంటే ఏమిటి ? ప్రతి విషయానికి మన మనసు లోపలినుండి బయటి వస్తువు వైపు ప్రసరిస్తూ ఉంటుంది. కంట్లో నుంచి దృష్టి బయటికి వెళ్ళి బయట వస్తువు వైపు ప్రసరిస్తోంది. ఈ మనసే కన్నుల ద్వారా బయటనున్న వస్తువును గమనిస్తోంది. అలాగే చెవి కూడా బయట ఉన్న శబ్దాన్ని వింటూ,

ఈ శబ్దాన్ని మనసు కూడా వింటోంది. అట్లాగ అనేక వస్తువుల ద్వారా మనసు బయటికి పరిగెడుతోంది. **ఇంద్రియాల ద్వారా, బయటికి పరిగెత్తే మనసును లోపలికి త్రిప్పి, ఇంద్రియాల వైపు గనుక పెట్టగలిగితే దానిని అంతర్ముఖత్వం అంటారు.** అంటే బయటికి పనిచేసే మనసును లోపలికి పోయేటట్లు చేయగలిగితే, నాలుక బయటికి చాపుతున్నాడు, కానీ ఈ నాలుకను లోపలికి చాచడం ఎటువంటిదో, ఈ మనసును లోపలికి అంతర్ముఖం చేస్తే, మనలోపల కూడా ఉన్నాడు భగవంతుడు. అంతరాత్మ, బయట వెతికితే ఏమి వస్తుంది ? లోపల ఉన్న వస్తువును బయట వెతికితే, తాను ఎక్కడ ఉన్నాడో చూడాలనుకొన్నాడట ఒకడు. ఎక్కడ ఉన్నాడు? కంటికి కనబడడు. కన్ను బయటి వస్తువులను చూడగలదు కానీ తనను తాను చూడలేదు. ఇతర వస్తువులన్నీ చూడగలడు. మనసు ఇతర అన్ని వస్తువుల గురించి ఆలోచించగలదు. కానీ ఈ మనసు ఎక్కడ నుండి వస్తోందో మనసుకి తెలియదు. మాట కూడా అంతే. అన్నీ మాట్లాడగలదు. కానీ మాట ఎక్కడి నుండి పుడుతున్నదీ, శక్తి ఎక్కడ నుండి వస్తోంది?దీని లోపల ఎవరు ఉండి పని చేయిస్తున్నారు ? ఈ శ్వాస మనం ఎలా పీలుస్తు న్నాము ? లోపల శరీరంలో ఎక్కడ ఉన్నాము మనం. ఒక చిన్న ప్రశ్న వేశాను ఒకడిని. 'అన్ని విషయాలు చదువుకొన్నాను. అన్ని దేశాలు తిరిగాను. ఏ దేశాలలో ఏఏ విషయాలు ఉన్నవో తెలుసు' నన్నాడు. కొద్దిసేపు కళ్ళు మూసికొని లోపల ఎక్కడ ఉన్నావో చెప్పు మన్నాను. శరీరంలో మాత్రం ఉన్నాము. అంతవరకూ గ్యారంటీయే కదా! ఎందుకంటే శరీరం బ్రతికి ఉంది కాబట్టి. ఇన్ని తెలిసిన వాడివి ఈ అయిదు అడుగుల శరీరంలో కళ్ళు మూసికొని నీవు ప్రాణం ఎక్కడుందో జీవుడు అది ఒక్కటి చూస్తే

చాలు. ఏం కనబడుతోంది ? చీకటి కనబడుతుంది కళ్ళు మూసికొంటే. ఎందుకని? ఎప్పుడూ సాధన చేయలేదు. మనస్సుని అంతర్ముఖం చేయలేదు. చదువుకొని పిల్లవాడిని బడిలో వేస్తే పారిపోయి వచ్చినట్లుగా మనసును అంతర్ముఖం చేస్తే బయటికి పరిగెత్తుకు వస్తూఉంటుంది. అది బయటకు ఏ ప్రక్కకైనా పరిగెడుతుంది. దాని నిగ్రహించాలి. భగవద్గీతలో ఏం చెప్పాడు ? 'నిగ్రహేతో తతోవాయుః' వాయువును ఎట్లా నిగ్రహిస్తారో అంత కష్టం మనసును నిగ్రహించడం. గాలిని ఒకచోట బంధించడం కష్టం. అందువల్ల మనస్సును అంతర్ముఖం చేయాలి. ఈ మనసును అంతర్ముఖం చేయాలంటే జీవితంలో కొన్ని చేయాల్సి ఉంటుంది. ఏమిటంటే మనసును సాధన చేయాలి. మోక్షచింతన ఎపుడు కల్గుతుంది ? మనసును పవిత్రం చేసినపుడే కల్గుతుంది. ఈ మనసును సాధన చేయడానికి ఏమిటి మార్గాలు ? **'దానము' అంటే ఎవరికైనా ఏదైనా అవసరం ఉన్నపుడు ఇవ్వడం, ఆకలిగొన్నవాడికి పెట్టడం. స్వార్థంతో ఇవ్వడం కాదు. ప్రేమతో ఇవ్వాలి.** దానము, ఉపవాసము, తర్వాత సత్కర్మలు చేయడము, నామస్మరణము, భగవంతుని గురించి చింతించడము. స్వార్థ త్యాగము అన్నిటికన్నా ముఖ్యం. తనయొక్క స్వార్థం, పేరాశను తగ్గించుకొని కంట్రోలు చేయాలి. ఈ విధంగా మనసును పావనంచేస్తే, నీ అదృష్టం బాగుండి సరైన వాడు గురువుగా దొరికితే, గురుసేవ, అంటే కేవలం గురువు దగ్గరికి వెళ్ళి ఊరికే నమస్కారం పెట్టి మనం మన పని చేసుకోవడం కాదు, డాక్టర్లు చెప్పినట్లు వింటేనే జబ్బులు తగ్గుతాయి. అట్లా చేయకపోతే ఫలితాలు రావు. ఆవిధంగా మనసును పావనం చేయడానికి చేయవలసిన మార్గాలు, దానము, ఉపవాసము,

భగవత్‌చింతన, ధర్మము నందు మనసును నిలుపుట, అనవసరమైన నష్టాలకు మనసు పోనీకుండా నిగ్రహించుట, స్వార్థత్యాగం చేసి కొంతైనా పనిచేయడం, ఈ విధంగా రోజూ అనుష్ఠానం మొదలు పెట్టిన రెండు మూడు నెలలలోనే మనకు అత్యద్భుతమైన ఫలితాలు కనబడతాయి. ఏ రూపుతో కనబడతాయంటే లాటరీలో డబ్బు వస్తుందని కాదు. దానివల్ల అన్నీవర్రీసే. సమస్యలు ఉండవు. మనస్సు నిలుస్తుంది. శాంతి కలుగు తుంది. కళ్ళు మూసికొంటే చీకటి బదులు వెలుగుకనబడుతుంది. ఎందు కంటే ఏనాడో ఒకనాడు మనిషి చావక తప్పదు. అపుడు బయటవాడువచ్చి సాయం చేయలేడు. ఎవడు చేస్తాడు. డాక్టర్లు కూడా ఏమీ చేయలేరు. అందువల్ల తనగురించి తాను పట్టించుకోవల్సిన విషయం ఇదొక్కటే. దీనికి వారు పేరేమి పెట్టారంటే అంతరాత్మయొక్క స్వరూపుడు నారాయణ తత్త్వం. నారాయణుడంటే పరమాత్మ. ఈ భగవంతుని యొక్క స్వరూపమే మన అంతరాత్మయందు కూడా నిలబడి ఉంటుంది. ఎట్లా నిలబడి ఉందంటే, దీపంలో ఉన్న వస్తువే సూర్యుడులో కూడా ఉంది. సూర్యుడిలో ఉన్నవస్తువే దీపంలో కూడా ఉన్నది. ఈ దీపం చిన్నది. సూర్యుడు పెద్దది. అంతే కానీలోపల ఉన్న అగ్ని ఒకటే ఉంటుంది. అందువల్ల మన మనస్సున పనిచేసేవాడు, మన హృదయాగ్ని పనిచేయించేవాడు, ఆత్మను పనిచేయించే వాడు పరమాత్మ అయిన నారాయణుడే. ఈ నారాయణుడిని ఎక్కడ చూస్తాం. ఎట్లా కనపడతాడంటే యోగులు అయిన వారు ప్రత్యక్షం చేసుకో గలుగుతారు. మరి పామరుడికి, మామూలు వాడికి భగవంతుడు అనే గురి ఒక లక్ష్యం కావాలంటే ఎట్లా ? ప్రత్యక్షంగా ఉండి మనకు వెలుగునిస్తున్నాడు సూర్యుడు. ఈ సూర్యుడిలో ఉండి మనకు శక్తినిస్తున్నాడు

సూర్యనారాయణుడు. సూర్యాంతర్వర్తి అయినవాడు అని చెప్పారు. అంటే ఈ భగవంతుడనే వాడు, మన ప్రాణాన్ని నిలబెట్టి మనసును పనిచేయించి, జీవితాన్ని ప్రసాదించేటటు వంటి శక్తి ఈ సూర్యుడిలో నుంచి మన అందరికీ రక్షణ కల్పిస్తున్నది. అందువల్ల కళ్ళు మూసుకొని సూర్యుడియందు ధ్యానం చేయగలిగితే ఏకాగ్రతతో అపుడు నీలో భగవంతుడి యొక్క శక్తి ఉద్భవ మవుతుంది. ఇది మంత్రంలో వారు చెప్పిన దాని అర్థము. లౌకిక అర్థము చెప్పాను. **ఊరికే మంత్రాలు చదివినందు వల్ల దాని అర్థం తెలియ కుండా, ఏమి ప్రయోజనం. ఇపుడు ఆలయాల్లో అర్చకులు అన్నీ అప్పచెపుతారు. కానీ ఫలితాలు ఎవరికీ ఉండవు. అర్థం మీద మనసు ఉండదు కాబట్టి.** అందువల్ల సూర్యాంతర్వర్తి అయిన నారాయణుని ఎప్పుడూ ధ్యానించాలి. ఎవరిని? సూర్యమండల మధ్యలో అగ్నిలాగ వెలుగు తున్నటువంటి ఆ నారాయణమూర్తిని ధ్యానించాలి. ఆ నారాయణుడి యొక్క స్వరూపం, చతుర్భుజ, శంఖుచక్రాలుతోనూ, శరీరం అగ్నితో తయారైన నిర్మాణం, అటువంటి తేజోమయమైన రూపాన్ని ధ్యానించాలి మనసులో. అపుడు మనసులో ఉన్న చీకటి అదే పటాపంచలై పోతుంది. మనసులో ఉన్న అజ్ఞానం అదే నాశనమైపోతుంది. ఈ గాయత్రీమంత్రంలో ఎవరైతే అంతర మూర్తిగా చెప్పబడి ఉన్నాడో ఆ నారాయణుడే ఈ కథలో కూడా రామాయణంలో రామచంద్ర మూర్తిగా అవతరించి ఉన్నాడు. అందువల్ల ఏం చెప్పారు. స్వాముల వారు సూర్యవంశంలో జన్మించారని చెప్పారు. ఈ రామావతారం సూర్యవంశంలో జన్మించడం అంటే అర్థం ఏమిటి ? ఎవరున్నారక్కడ? అంతర్వర్తి అయిన శ్రీమన్నారాయణుడు. అందులోంచే వచ్చింది ఈ అవతారం. తర్వాత ఇంకా ఏమి చెప్పారు. చైత్ర

శుద్ధ నవమినాడు రాములవారు జన్మించారు. అంటే సంవత్సరం మొత్తం మీద సూర్యుడికి మేషరాశిలో బలంఎక్కువగా ఉంటుంది. రోజులో మధ్యాహ్నం ఎట్లా అయితే ఎండఎక్కువగా ఉంటుందో, వేసవి కాలంలో వేడితీవ్రంగా ఉంటుంది. అట్లా చైత్రమాసంలో మిట్టమధ్యాహ్నంలో జన్మించాడట. అంటే అత్యంత ప్రకాశవంతమైన, తేజోవంతమైన సమయంలో సూర్యతత్త్వంలోంచి దిగివచ్చిన అవతారమూర్తి రామచంద్రమూర్తి. అందువల్ల గాయత్రీమంత్రంలో చెప్పబడినటువంటివాడు ఎవరో, 'తత్స వితుర్వరేణ్యం' సవిత అంటే సూర్యుడు. మన మనస్సు భరించదగినవాడు. భరించడం అనగా ఏమిటి? పెండ్లికావల్సిన రాజకన్యకలు ఎట్లా అయితే తమను భరింప గలిగిన వాడి మెడలో దండ వేసేవాళ్ళు. అట్లా మనస్సు తనకు సర్వం మంగళకరమైన కళ్యాణ గుణములు కలిగిన వస్తువు యందు మనస్సు నిలబడుతుంది. అందుకే భగవంతుడు భరించదగిన గుణములు కలవాడట. సర్వవిధములు అయిన వారు కూడా కోరదగిన గుణములు జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, ఇవి ప్రతివాడూ కోరదగిన గుణములు. ఇవి వరించదగిన గుణములు కలవాడు గనుక 'వరేణ్యం'. సూర్యుడు అయన చేసే పని ఏమిటి? బుద్ధిని, మనస్సును నడిపిస్తాడు. 'ధియోయోనః ప్రచోదయాత్' మనబుద్ధులను ఎవడైతే ప్రచోదనములాగా గుర్రంతోలినట్లుగా నడిపిస్తున్నాడో, గాయత్రీ మంత్రంలో ఉన్నటువంటి నారాయణుడి స్వరూపం ఈ అంతరాత్మలో ఉండేటటువంటి సూర్యాంతర్వర్తి అయినటువంటి వాడి లక్షణం ఒకటే. ఈ కారణంచేత 24 అక్షరములు గల గాయత్రీ మహా మంత్రాన్ని. మాసములో కూడా 12వదైనటువంటి మాసములో రాముడు జన్మ ఎపుడు ఎత్తాడట,12వ మాసములో ఎత్తాడట. యజ్ఞం జరిగినటువంటి

12వ మాసం, అంటే 12 పౌర్ణమిలు, 12 అమావాస్యలు కలిసినటువంటి, 24 అక్షరములు కలిగినటువంటి గాయత్రీ కాలచక్రంలో 24 పర్వములు గడిచిపోగా అపుడు సూర్యాంతర్వర్తి అయినటువంటి నారాయణుడు అవతరించాడట. అందు వలన గాయత్రీమంత్రంలో చెప్పబడినటు వంటిది ఏదైతే ఉందో అది ఈ రామాయణంలో 24 వేల శ్లోకాలలో ఆయన చెప్పాడు. రామాయణం అంతాకూడా 24 వేల శ్లోకాలున్నాయి. అంటే ఒక్కొక్క వెయ్యి శ్లోకాలకు ప్రారంభం అయినటువంటి మొదటిశ్లోకం మొదటి అక్షరాన్ని తీసికొంటే అవన్నీ కనుక ఒకచోట వ్రాస్తే గాయత్రీ మంత్రం వస్తుంది. అందువల్ల వాల్మీకి రామాయణం మొత్తం పారాయణం చేయలేనటు వంటి వాళ్ళు ప్రారంభ శ్లోకాలు 24 శ్లోకాలు గనుక చదివితే దానికి గాయత్రీ రామాయణం అని పేరు. ఈ 24 వేల శ్లోకాలను పారాయణ చేసినట్లైతే మొత్తం 24 వేల శ్లోకాల రామాయణాన్ని పారాయణ చేసినట్లు అవుతుంది. ఈ విషయాలు అన్నీ మనసుకు పట్టించుకొని ఒకసారి విని వెళ్ళిపోతే, ఈ ప్రపంచంయొక్క బలం చాలా ఎక్కువఉంటుంది. అది మళ్ళీ నెత్తిమీద పెట్టుకొన్నట్లు అవుతుంది. దీని మీద ఏకాగ్రత పెట్టినట్లైతే మనసు నిలబడు తుంది దానిమీద. అపుడు ఆ విధంగా చేస్తే ఈ గాయత్రీ మంత్రంలో చెప్ప బడినటు వంటి నారాయణ తత్త్వం వాల్మీకి మహర్షి ఎట్లా అయితే 24 వేల శ్లోకాలలో భద్రం చేశాడో, ఈ సూర్యవంశంలో జన్మించిన రామావతా రానికి అర్థం ఏమిటో, శివధనస్సును విరిచేశాడట. ఈ శివధనుస్సు ఏమిటి? విష్ణు ధనుస్సు ఏమిటి ? శరీరంలో ఇడా పింగళ నాడులు ఈ రెండూను సూర్య చంద్ర మార్గములు కలిగినవి. అంటే కుడివైపునఉండే మార్గము సూర్యనాడి. ఎడమ వైపు ఉండేది చంద్రనాడి. చంద్రుడిని శిరస్సుమీద

ధరించినవాడు శివుడు. ఈ సూర్యుడు, సూర్యాంతర్వర్తి నారాయణుడు. శివధనస్సు అంటే ఈ చంద్రభాగమును అంటే పితృదేవతలకు పునర్జన్మను ఇచ్చేటటువంటి మార్గాన్ని భంగంచేసి, బ్రహ్మమార్గమును, మోక్షమార్గమును అయిన ధనస్సును ఎక్కుపెట్టాడు. ఆ ధనస్సుశబ్దం ప్రణవం. ఓంకారం. ఉపని షత్తుల్లో ఏం చెప్పారంటే ప్రణవమే ఓంకార మనబడే ధనస్సు. ఓంకార క్షేత్రంలో కూర్చొని మనం వింటున్నాంకానీ, ఓంకారం ఎక్కడ ఉందో, దీనిని ఎక్కడినుంచి చేయాలి. రాములవారు ధనుష్టంకారం చేసినపుడు గర్జిం చిందట లోకమంతా. అంటే ఓంకారం మనం అనుసంధానం చేస్తామో, పూర్తి శ్వాసతీసికొని 'ఓం' అనేటటువంటిది అంటూ, వింటూ, ఏకకాలంలో చేయాలి. అనడం ఒకేసారి, మనస్సు వినడం ఒకేసారి. ఈ రెండూ ఏక కాలంలో జరిగితే ఓంకారం అంతర్థానమవుతుంది. అంతర్ధానం అంటే అర్థం ఏమిటి? మన నోటినుండి వచ్చేశబ్దం బయటకు పోతుంది మామూలుగా, అలా పోకుండా చెవితో విన్నట్లైతే మళ్ళీలోపలికే వస్తుందది. అపుడు బయటికి వెళ్ళేది, లోపలికివచ్చేది ఒకలాగ తిరుగుతుంది చక్రం. జపమాల ఎట్లా అయితే తిరుగుతుందో, అట్లా తిరుగుతుంది చక్రం. ఈ అనుసంధానం మనంచేసే జపం మనకు పడుతుంది. అందుకే మీరు ఎప్పుడైనా జపం కానీ ఓంకారం కానీ చేస్తే ఏమౌతోంది. బయటికి వెళ్తోంది కానీ మళ్ళీరావట్లా. ఎలక్షన్‌వాళ్ళు మాట్లాడినట్లుగా, అందుకే అంటూ వినమన్నారు. శృతి అనగా వినేది.అపుడు ఓంకారంమీరు అనకపోయినా వినబడుతుంది. మొన్న హైదరాబాద్‌లో నారాయణయజ్ఞం చేసినపుడు చాలామంది యోగమిత్రులు వచ్చారు.అందరిచేతా బలవంతంగా నారాయణ మంత్రం, ఓంకారం ఓ వెయ్యిమార్లు చేయించాను. పిల్లవాడికి ఉగ్గుపాలు బలవంతాన పోయాలి. తర్వాత పాలు పోయమని వాడే ఏడుస్తాడు. అందుకని

రెండురోజులు బలవంతాన చేయిస్తే మూడవరోజున వాళ్ళకే అలవాటు అయ్యింది. మూడో రోజువారు బయట బస్సుకోసం పోతున్నా సరే ఓంకారం వినబడేది.అందరికీ వినబడేది. ఈ కలియుగంలో ఓ వేయిమంది ఒకచోట కూర్చుని చేస్తేనే ఇంత ఫలితం కనబడితే నిత్యాను ష్ఠానం చేస్తే మీకు ఎందుకు కనబడదు. అందువల్ల ఈ సత్సంగం అనేటటు వంటిది మన యోగమిత్రుల కోసం చాలా చోట్ల ఏర్పాటు చేసిన కారణం ఏంటంటే, నిత్యజీవితంలో సతమతమై, సమస్యలతో కొట్టుమిట్టాడుతూ ఊబిలో దిగిన బర్రెలాగ కదల్లేని స్థితిలోఉన్న వాళ్ళకి కొంచెంచేయి ఇచ్చి వాళ్ళని కొంతవరకూ నిలబెట్ట గలిగితే, తర్వాత వాళ్ళే చేసుకుపోతారు. అందువల్ల ఎవరైనా చేస్తున్నారంటే ఆసక్తికలిగి మనం పనిచేస్తాము. చదువుకూడా అంతే. ఇంకొకడు చదువు తున్నాడంటే చదువుతాం మనం. అట్లాగే సంకీర్తన ఇవి ఎందుకు పెట్టామంటే 'సత్సంగం' అనేటటు వంటిది చాలామందికి దాని విధానం తెలియదు. ఊరికే భజన క్రిందచేసుకుపోతారు. భజనచేస్తూ పోతే ప్రక్క వాడికి నిద్ర పోతుంది. అంతేకానీ ఏమీ ఉపయోగం ఉండదు. ఈ ఓంకారం ఎట్లాఅయితే విచారణ పేరుతో అనుసంధానం చేయాలో ఈ సంకీర్తన కూడా విధానం ప్రకారం చేసినట్లైతే కొద్దిరోజులలోనే అద్భుతమైన ఫలితాలిక్కడ యోగమిత్రులు పొందుచున్నారు. కాబట్టి అందరూ ఈ కార్యక్రమంలో పాల్గొని మీయొక్క సమస్యలకు తగిన నివారణపొందాలని మంగళాశాసనములు చేస్తున్నాను.

-హరిః ఓం తత్ సత్

(11-2-1984న గుంటూరులోని ఓంకారక్షేత్రంలో చేసిన అనుగ్రహభాషణం.
గురుసేవగా ఈ ఉపన్యాసము వ్రాసి పంపినవారు
నెల్లూరు జిల్లా, పొంగూరు శాఖ యోగమిత్రుడు శ్రీ వై. మురళీకృష్ణ భరద్వాజ)



# 4

# మన పురాణాల అంతరార్థాలు

## రామాయణంపై సైన్సు పరిశోధన - రామావతార రహస్యం

ప్రియమైన యోగమిత్రులకు, భక్తులకు శ్రీరామనవమి మహోత్సవ కార్యకర్తలకు యావన్మందికీ ప్రేమపూర్వక మంగళాశాసనములు. ఈ రోజు ఈ శ్రీరామనవమి మహోత్సవములలో భాగంగా ఏకాదశి కలిసినటువంటి వసంతోత్సవము పరిపూర్తి అయ్యే సందర్భముగా శ్రీమద్రామాయణం గురించి మీ అందరితో కలసి పాలుపంచుకోవాలని రావడం, ఈ సదవకాశం, ఈ తరుణం కల్పించిన శ్రీరామచంద్ర ప్రభువుకు మీ అందరి తరపున, మా తరపున అభినందనలు తెలియజేసుకొంటూ ఈనాటి సభావిషయం

తెలియజేస్తాను. శ్రీమద్రామాయణం ఆదికావ్యం అనగా మంత్రములలో ఓంకారం ఎంత మొట్టమొదటిదో సకల శాస్త్రములలోనూ వేదము ఎంత ఆరంభమైనదో, ప్రథమమైనదో అదే విధంగా ఈ కావ్యాలలో శ్రీరామాయణం మొట్టమొదటిది. అందువల్ల ప్రపంచంలో ఎన్ని కావ్యాలు ఉద్భవించినా ఎందరు ఎన్ని రచనలు చేసినా వాల్మీకి మహర్షిని ఆదికవిగానూ, శ్రీ రామాయణాన్ని ఆదికావ్యంగానూ చెప్పుకొంటాం.అందువల్ల ఆచంద్రార్కం 'యావత్ చంద్రశ్చ సూర్యశ్చ యావత్ తిష్ఠతి మేదిని' వాల్మీకిమహర్షి శపథం చేశాడట. ఎంతకాలమైతే సూర్యుడు, చంద్రుడు వెలుగుతూ ఉంటారో, ఎంతకాలమైతే భూమి తిరుగుతూ ఉంటుందో అంతకాలం రామాయణం శాశ్వతమై మానవ జాతిని తరింపజేస్తుంది. ఇది వాల్మీకి మహర్షి ప్రతిజ్ఞ. అందుచేత ఈ రామాయణం అనేటటువంటి అమృతమైన రసాన్ని ఎవరు ఎన్నివిధములా మథించి చెప్పినా దాని యొక్క సారాన్ని ఎవరు ఎన్ని విధములా ఆస్వాదించినా తృప్తి తీరనటువంటి అమృత తత్త్వంగల అమృతమైన కావ్యం. అందుచేత ఈ శ్రీమద్రామాయణంయొక్క ప్రాశస్త్యాన్ని అందులోని వైజ్ఞానిక విశేషములను ఎంత చెప్పినా చెప్పవచ్చు. న్యాయంగా రామాయణం ఒక మహోదధి వంటిది. శ్రీమద్రామాయణాన్ని విశ్లేషించాలంటే ఈ నవరాత్రులు చాలదు. అందులోని ఒక్కొక్క అంశాన్ని పరిచయం చేయడానికే ఈ తొమ్మిదిరోజులు సరిపోతుంది. ఇటువంటి ఈ మహాసముద్రాన్ని అగస్త్యులవారు ఔపోసన పట్టినట్లుగా దీని సారాన్ని ఒక్కసారే మీకు అందించాలంటే చాలా దుర్లభమైన విషయం. ఎందువల్ల దుర్లభం అంటే చెప్పడం కష్టమని కాదు. చెప్పవచ్చు. వ్యాసులవారు బ్రహ్మసూత్రాలు మొత్తం 55 సూత్రాలను సంగ్రహించి చెప్పారు. కానీ అది మళ్ళీవారికే అర్థమౌతుంది. దాన్ని అర్థం చేసుకోవడానికి కూడా అంత

మేధాశక్తి కావాలి. అందులోనూ ఈనాటి వాతావరణంలో పరిపూర్ణమైన ఏకాగ్రతతోనూ, భక్తితోనూ, శ్రద్ధతోనూ మనసులో అవగతం చేసికొంటేగానీ ఈ రామాయణం వంటి మహా విషయాలు అర్థం చేసుకోవడం కష్టం. అలాంటిది ఈ నడిబజారులాంటి మన జీవితం అంటే ఈనాడు మనజీవితం ఎట్లా ఉంది అంటే నడిబజారులాగా. అనేక రకాల disturbances, అనేక రకాల వికల్పనలు. ధ్యానానికి కూర్చుంటే ఎన్ని రకాల వికల్పనలు వస్తాయో, ఎన్నిరకాల అనవసరపు విషయాలు వస్తాయో!! అట్లాగే నడి బజారులోఉండే ఈ సభలో, ఈ కార్యక్రమంలో కూడా అత్యంత భక్తితో, ఏకాగ్రతతో, శ్రద్ధతో వింటేగానీ ఈ సంగ్రహంలో కూడా కొంత భాగం అర్థం చేసుకోవడం కష్టం. ఈ రామకథ అపూర్వమైనటు వంటిది. ఏమిటి ఈ అపూర్వం అంటే ఈ అపూర్వం అనే మాటకు ఒక విచిత్రమైన అర్థము ఉంది. 'అ-పూర్వం' అంటే పూర్వం ఎప్పుడూ జరగనటువంటిది. అదేమిటయ్యా రామాయణం ఎప్పుడో చాలా కాలం క్రిందట త్రేతాయుగంలో జరిగింది కదా! పూర్వం ఎప్పుడూ జరగలేదు అంటారేమిటి ? అంటే దీనిలో రెండు అర్థాలు ఉన్నాయి. పూర్వం జరిగినటువంటి చారిత్రకమైనటువంటి, రామకథను తెలిపేటటువంటి చరిత్ర (ఇతిహాసం). అంటే పూర్వం జరగనటువంటి కథ. అంటే మామూలుగా ఎక్కడో అయోధ్యలో దశరథ మహారాజుకు కొడుకుగా పుట్టి తండ్రిమాటకోసం వనవాసానికి వెళ్ళి రావణసంహారంచేసి మరల పట్టాభిషేకం చేసికొన్న రాముడి కథే అయితే మనం ఇన్ని వేల సంవత్సరాల నుండి గుర్తుపెట్టుకోవలసిన అవసరం ఏమిటి ? ఎందరో మహారాజులు మన దేశాన్ని పరిపాలించారు. ఎన్నో కష్టాలు పడ్డారు. రాజ్యాలు పోగొట్టుకొన్నారు. మళ్ళీ పట్టాభిషేకం చేసుకొన్నారు. అయితే ఏమిటి అపూర్వం ? అంటే ఇంతవరకే అయితే రామాయణం 'పూర్వం' అని

చెప్పవచ్చు. 'అపూర్వం' అని చెప్పనక్కరలేదు. ఈ పూర్వం కాని విషయం ఏమిటంటే అంత క్రితం ఏకాలంలోనో ఎక్కడో జరిగిన రామకథే కాక అందులో ఏ కాలంలోనూ ఎక్కడా జరగని శాశ్వతమైన విషయాలు ఉన్నాయి. ఏమిటి అంటే దానికి రామాయణంలోని పూర్వాంగంలో చెప్పబడింది. పరమేశ్వరుడు అయినటువంటి పరబ్రహ్మ శ్రీరాముడిగా అవతరించినట్లుగానే వేదము సాక్షాత్తు వాల్మీకిమహర్షినుండి రామాయణంగా ఆవిర్భవించింది. 'ప్రాచేతసా దాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా'. రామాయణాత్మలో ప్రాచేతస ఋషి నుంచి ఈ సర్వవేదము ఉద్భవించింది అంటే అర్థము ఏమిటి ? రామాయణంలో బయటకు కనిపించనటువంటి ఆధ్యాత్మికమైన, శాస్త్రీయమైన నిగూఢ సత్యాలు అనేకం ఉన్నాయి. దీనిని మనం ఒక మంత్రాన్ని ఎలాగైతే అనుష్ఠానం చేస్తామో, ఒక గ్రంథాన్ని ఎలాగైతే పారాయణ చేస్తామో, భగవంతుడిని ఎలాగైతే అర్చన చేస్తామో ఆ విధంగా రామాయణం యొక్క శబ్దబ్రహ్మను ఉపాసన చేసినట్లైతే అందులోని అంతరార్థం, అతినిగూఢమైన, ఉపాస్యమైన విషయం మనకు అవగతం అవుతుంది. అంటే ఏమిటి ? ఈ ఉపాసించటం అంటే ఏమిటి ? విశేషంగా దానిని అవగతం చేసుకోవడం అంటే ఏమిటి ? అంటే మనం ప్రతిరోజు న్యూస్ పేపర్ చదువుతాం. చదివి ఓ 10 నిమిషాల తరువాత అవతల పారేస్తాం. ఆ విధంగా చదివితే రామాయణంలోని శాశ్వతమైన, విశేషమైన వస్తువును, సత్యాన్ని మనం గుర్తుపట్టలేము.

అయితే ఎట్లా చదవాలి ? ఇది మిగతా పుస్తకాలలాగే అక్షరాలతో ఉందే కదా! మిగతా పుస్తకాలలాగే కాగితాలమీద అచ్చు వేస్తారు కదా! ఇది చదివినందువల్ల విశేషం ఏమిటి ? రాముడుకూడా మామూలుగానే బయటికి

భౌతికంగా తల్లిదండ్రులకు జన్మించాడు. అందరిలాగానే మామూలుగానే కష్టపడ్డాడు. అందరిలాగే మానవుడిగా జీవించాడు. జీవించడమే కాదు, ఆయన రామాయణంలో ఏం చెప్పాడంటే 'ఆత్మానం మానుషం మన్యేరామం దశరథాత్మజం'. సీతాదేవి అగ్నిపరీక్ష సమయంలో దేవతలందరూ స్తోత్రం చేసినపుడు, దేవతలందరూ ప్రత్యక్షమై 'నీవు సాక్షాత్ నారాయణుడవు. పరబ్రహ్మ స్వరూపుడవు.' అని స్తోత్రం చేసినపుడు, అపుడు రాముడు ఏం చెప్పాడు ? 'నన్ను నేను మామూలు మానవునిగానే భావించుకొంటున్నాను. రాముడిగానూ, దశరథుని కొడుకుగానూ భావించుకొంటున్నాను' అని.

దీనికి కొందరు రామాయణంపై పరిశోధన (?) చేసినవారు, 'రామాయణ విషవృక్షం'లాంటి రచనలు చేసిన పరిశోధకులు లేనిపోని లోపాలను ఆపాదిస్తూ వారుకనుక్కొన్న విషయం ఏమిటంటే రాముడు దేవుడు కాదు. కేవలం మానవుడు. కేవలం మానవుడేఅయితే ఇంత ప్రచారం ఎందుకొచ్చిందయ్యా అంటే ఇపుడు మన రాజకీయ నాయకులకు ప్రచారం చేసినట్లుగా వాల్మీకిమహర్షి కొద్దోగొప్పో లబ్ధిపొంది ప్రచారంకోసం రామాయణం వ్రాశాడని. రాముడు ఒక రాజు, ఈయన రాజ్యాన్ని పరిపాలించాడు. క్రమంగా ఆయన ఒక దేవుడిక్రింద అయిపోయాడు. అంటే వీరి ఉద్దేశ్యం ఏమిటి ? తాలూకా నుండి, జిల్లానుండి, M.L.A. గా ఎన్నికై, C.M. ఎట్లా అవుతారో, అట్లాగే పూర్వం అవతారాలు కూడా స్థానిక స్థితి నుండి క్రమేణా దేవుడిగా ప్రమోషన్ అయ్యారని. ఇది కేవలం అవివేకం, అజ్ఞానం. అంటే కేవలం భజనవలన ఒక మనిషిని దేవుడిగా మార్చగలం అనుకొంటే ఇపుడు రాజకీయాలలో జరిగే భజనవల్ల వీళ్ళందరూ ఎప్పుడో భగవంతుళ్ళుగా మారిపోయి ఉండేవాళ్ళు. అట్లా అవకపోగా మనకు విసుగు వచ్చేస్తుంది.

**విన్నకొద్ది విసుగొచ్చేది లౌకికం. విన్నకొద్దీ సారంవచ్చేది ఆధ్యాత్మికం.** ఆధ్యాత్మికానికీ, లౌకికానికి ఒకటే తేడా. మనం ఒక మంత్రాన్ని తీసికొని అనేక వేల సార్లు జపిస్తాము. అలా చేసినకొద్దీ కొంత శక్తి వస్తుంది. ఏకాగ్రత వస్తుంది. ధ్యానం కుదురుతుంది. అట్లాగే పైకి మనుషులులాగా అవతార మూర్తులు కూడా ఒకానొక కాలంలో జన్మించి ఒకానొక దేశంలో జీవించిన శాశ్వతమైన విషయాలు వారి అంతర్గతమై, వ్యక్తిగతమై ఉంటాయి. అనగా ఏమిటి ? ఒక వ్యక్తిగా కొన్ని పనులు చేశాడు రాములవారు. అవి న్యాయంగా కథామాత్రంగా చదివితే అప్పటివరకే దాని ప్రాముఖ్యత కనబడుతుంది. కానీ అంతర్దృష్టితో చూస్తే శాశ్వతమైన మానవజాతిలో అతి ప్రాముఖ్యమైన సంఘటనలు, వాని చరిత్ర రామాయణంలో కనబడుతుంది. ఏమిటి ప్రాముఖ్యత అంటే నాలుగు విధాలుగా సంక్షిప్తంగా చెప్తాను.

ఒకటి విశ్వచరిత్ర. ఈ యావత్ మానవజాతి చరిత్రను సృష్టి ప్రారంభం నుండి ప్రళయం వరకూ జరిగిందంతా ఒకచోట వ్రాస్తే, వ్యాసమహర్షి భాగవత పురాణంలో, బ్రహ్మండ పురాణంలోనూ, భవిష్యపురాణంలోనూ యావత్ మానవ జాతి చరిత్ర వ్రాశారు. ఈ సృష్టి చరిత్రలో ఒక పుస్తకంలోనే అధ్యాయంలాగా మెట్లు మెట్లుగా ఎట్లా ఉంటాయో, ఇలా అవతారాలు మైలు రాళ్ళవంటివి. అంటే మొట్టమొదట ఈ సృష్ట్యారంభంలో నీళ్ళలో ప్రాణం జలచరాలుగా ఉద్భవించాయి. అంటే ప్రాణికోటి యొక్క పరిణామదశ మొట్టమొదట జలచరాలుగా ప్రారంభమైంది. ఈ మొదటి దశకు గుర్తుకు మత్స్యావతారం వచ్చింది. ఈనాడు సైన్సువారు కూడా తమ పరిశోధనల్లో జీవరాశి మొట్టమొదట జలంనుండి ప్రారంభమైనది, జీవరాశి చేపల రూపంలో ఉద్భవించాయి అని చెప్తున్నారు. అంటే మొదటి

అవతారం ఈ జీవకోటి పరిణామంలో మొదటిమెట్టు. ఈ మాట ఎందుకు చెప్తున్నానంటే అవతారం అనేది కేవలం ఒక వ్యక్తిగా కాక, మానవజాతి చరిత్రలోని మైలురాయి వంటి వాళ్ళు అంతర్గతమైన చరిత్రలో, బహిర్గతమైన వ్యక్తులు. అంటే జాతి చరిత్రకు వాళ్ళు సింబల్స్ (గుర్తులు) అన్నమాట. జీవరాసులన్నీ జలచరంనుంచి ఉద్భవించాయి అనేదానికి మత్స్యావతారం. తరువాత జలం అంతా ఇంకిపోవడంవల్ల భూమిమీద, నీటిలోనూ జీవించగల తాబేలు (కూర్మావతారం) రెండవది. ఆ తరువాత భూమి పైకి లేవడం, అడుగు నుండి పర్వతాలు పైకి రావడం, భూమిని త్రవ్వేటటువంటి జంతువు వరాహం. ఇది 'వరాహావతారం.' ఈ వరాహావతారం భూచరములు ఉద్ధరణకు మెట్టు. తరువాత మానవుడు ప్రాథమికదశ సూక్ష్మదశనుండి ఒక్కసారిగా మేథాశక్తికి ఎదిగిపోవడం (వామనావతారం) నాలుగోమెట్టు. తరువాత మానవజాతి పరిణామంలో రాజ్యాలు ఏర్పడి, ప్రభుత్వాలు ఏర్పడి, రాజులు, ప్రభువుల వచ్చి స్వార్థం ఏర్పడి ప్రజల క్షేమాన్ని విస్మరిస్తే వారిని నిర్మూలించి ప్రజలను సంక్షోభం నుండి కాపాడేది పరశురామావతారం. అంటే ప్రభువైనాసరే ధర్మాన్ని ధిక్కరిస్తే దాన్ని set right చేసే అవతారం పరశురామావతారం. దాని తరువాతి మెట్టు మానవత్వంలో ఇంకా పరిపూర్ణత ఉంది. కేవలం అధర్మాన్ని నశింపజేయడం, భూమిని ఉద్ధరించడం ఇదొక్కటేకాదు మానవత్వంలో పరిపూర్ణమైన మెట్టు పరశురామావతారం. దైవత్వంలో మొదటి మెట్టు రామావతారం. అందుచేత రామావతారంఅనేది ఈ జీవకోటి యొక్క పరిణామదశలో ఒక మైలు రాయి వంటిది. అంటే బయట జరిగే చరిత్రలో ఒక సంవత్సరం ఎట్లాంటిదో, అధ్యాయంలాగా, జపమాలలోని పూసల లాగా ఎటువంటి కనెక్షన్ ఉందో, అట్లా మానవజాతి చరిత్రలోనే పూర్ణ మానవత్వం ఆవిష్కారం అయ్యే దశ రామావతారం. ఈ

కారణం చేత రామాయణానికి, బయట జరిగే చరిత్ర ఉపయోగం ఒకటి, లోపల జరిగే ఆధ్యాత్మిక చరిత్ర ప్రాముఖ్యత ఒకటి. ఇది రెండు విధాల ప్రాముఖ్యత అంటే బయట జరిగే చరిత్రకు లోపల జరిగే జీవపరిణామానికి ఒక అవినాభావ సంబంధం ఉంది. ఎట్లాంటి కనెక్షన్అంటే మన మనస్సులో జరిగే ఆలోచనకు మనం చేసే పనులకు ఎట్లాంటి కనెక్షన్ ఉందో, మనం చేసే చర్యలకు మన మనస్సులో కలిగే సంకల్పాలకు ఎటువంటి కనెక్షన్ ఉందో, అంటే బయట ప్రపంచం అని, లోపల ప్రపంచం అనీ రెండు ఉన్నాయి. ఒకటి మానసిక ప్రపంచం ఆధ్యాత్మిక ప్రపంచం. రెండవది భౌతిక ప్రపంచం. ఈ రెండు బ్యాలెన్స్‌లో ఉంటేనే మన జీవితం అనేది నడుస్తుంది. ఇదేమిటి మానవ జీవితానికి రెండు బ్యాలెన్సెస్ అంటారు అంటే ఒక్క బాహ్యజీవితం సరిపోతుందా, సరిపోదా అంటే ఒక చిన్న ఉదాహరణ చాలు. రోడ్డుమీద నడుస్తున్న మనం మనస్సు ఎక్కడో పెట్టుకొని నడుస్తుంటే కళ్ళు తెరిచి ఉన్నాగానీ ఏ సైకిల్‌కో గుద్దుకొంటాం అంటే కేవలం కళ్ళు, ముక్కు, చెవులు పనిచేయడంకాదు. మనస్సుకూడా పనిచేయాలి. మనం ఎక్కడ ఉన్నామో, ఏం చేస్తున్నామో, ఎటు వెళ్తున్నామో ఈ లక్ష్యంకనుక లేకపోతే ఈ అంతర్ జీవితం, బాహ్యజీవితం రెండూ బ్యాలెన్స్‌గా ఉంటేనే సైకిల్‌మీద వెళ్ళినట్లుగా మానవజీవితం గడిచి పోతుంది. ఇపుడు ఈ అంతర్ జీవితం, ఆధ్యాత్మిక జీవితం కుంటు పడింది గనుక బయట ఉన్న సామాన్యుడి జీవితం సంక్షోభంలో పడింది. ఎప్పుడు కూడా మానవజాతి జీవితంలో సంక్షోభం ఎందుకు వస్తుంది ? ప్రళయాలు ఎందుకు వస్తాయి ? యుద్ధాలు ఎందుకు వస్తాయి ? అంటే బయటఉన్న ప్రపంచానికి, లోపల ఉన్న ఆధ్యాత్మిక ప్రపంచానికి material world కి spiritual world కి బ్యాలెన్స్ ఎప్పుడు తప్పుతుందో అపుడు అల్లకల్లోలం

ఏర్పడుతుంది. అటువంటి బ్యాలెన్స్ తప్పినపుడు ఈ అవతారం భగవత్‌శక్తి భూమి మీదకి ఆవిష్కారమై త్రాసును సమంగా పెట్టినట్లు ప్రపంచాన్ని బ్యాలెన్స్‌లో పెడ్తాడు. ఇది అవతారంయొక్క ఆధ్యాత్మికమైన significance. దీనిని అరవిందుడు శ్రీకృష్ణ సాక్షాత్కారం జరిగిన తరువాత వ్రాసిన ఉత్తరాలలో The Message of Avatara అనేదాంట్లో ఒక చక్కటి వాక్యంలో ఉధహరించాడు. ఏమిటి అవతారం అంటే మానవజాతి దైవత్వంలోకి ఎక్కేటటువంటి ఆరోహణ, దైవశక్తి మానవత్వంలోకి దిగేటటువంటి అవరోహణ. ఎక్కడో ఆకాశంలో, స్వర్గంలోఉండేటటువంటి ఆధ్యాత్మిక శక్తి, పొగమంచు, వడగండ్ల రూపంలో వచ్చినట్లు ఆధ్యాత్మిక ప్రపంచం నుండి మానసిక ప్రపంచంలోకి, మానసిక ప్రపంచం నుండి మానవ ప్రపంచంలోకి మెట్లుమెట్లుగా పొగమంచు కురిసినట్లుగా కురుస్తుంది. అట్లాగే మానవత్వంలో ఉండే ప్రాణశక్తి, ప్రయత్నం ద్వారా, సాధన ద్వారా, పరిణామం ద్వారా, దైవత్వాన్ని అందుకొంటుంది. ఈ క్రింది నుండి పైకి వెళ్ళే పరిణామానికి పైనుండి క్రిందకు వచ్చే అనుగ్రహానికి నిచ్చెన వంటిది ఈ అవతారం. అంటే నిచ్చెనను మనం రెండు విధాలుగా ఉపయోగిస్తాము. నిచ్చెన ద్వారా మనం మేడమీదకు వెళ్ళవచ్చు. మేడమీద నుండి క్రిందకు దిగవచ్చు. ఈ నిచ్చెనవంటివాడు అవతారమూర్తి. ఏమిటి ఎందువలన నిచ్చెనవంటివాడు అంటే భూలోకంలోని మానవజాతికి దైవశక్తి ఒక కరెంటు వంటి ఆధ్యాత్మిక శక్తి, దానినుండి క్రిందకి ప్రవహిస్తుంది. ఒక జలపాతంలో ఎలాగైతే హైవోల్టేజీ విద్యుత్ శక్తి పుడుతుందో అటువంటిది ఈ దైవశక్తి. అది క్రిందకు రావడానికి ఒక నిచ్చెన అవసరం. దానికి ఆధారం అవతారం యొక్క శరీరం. అయితే ఈ నిచ్చెన పైనుండి క్రిందకు రావడానికి మాత్రమే కాదు. క్రిందనుండి పైకి పోవడానికి కూడా పనికి వస్తుంది. అంటే ఈ అవతార మూర్తి శరీరం

ద్వారా అనేకమంది తరించి పైకి చేరడానికి పనికివస్తుంది. అందువల్ల మానవజాతి పైకి వెళ్ళి ఉద్ధరించబడటానికి దైవశక్తి అనుగ్రహంగా క్రిందకు వర్షించడానికి జరిగేప్రక్రియ. ఈ దృష్టితో శ్రీమద్రామాయణాన్ని చూచినట్లైతే అది కేవలం ఒక చారిత్ర సంఘటన మాత్రమే కాదు. మానవజాతిలోజరిగే దశల్లో 9వ అవతారం రామావతారం. అందువల్ల శ్రీరామనవమి తొమ్మిదవ రోజున చేయడానికి ఈ తొమ్మిది అనే సంఖ్యకు కూడా శాస్త్రీయమైన significance ఉంది. ఈ శ్రీరామనవమి ఎందువల్ల ప్రాముఖ్యమైనది. కాలచక్రంలో ఈ ప్రపంచంయొక్క సృష్టిదశలుగా నడుస్తుందని పురాణాలు చెప్తున్నాయి. ఈ కాలచక్రం మనకు ఎక్కడ కనబడుతుంది. ఆకాశంలో రాశిచక్రంగా కనబడుతుంది. చాలామంది ఈ రోజు వారఫలాలు చూచు కోవడానికి మాత్రమే పత్రికలలో ఈ రాశిచక్రం ఉపయోగిస్తారు. పూర్వకాలం ఋషులు ఏంచేశారంటే ఈ రాశిచక్రాన్ని బట్టి రానున్న భవిష్యత్తు, జరిగి పోయిన చరిత్ర మొదలగునవన్నీ వ్రాశారు. అలాంటి పన్నెండు రాసులలో తొమ్మిదవ రాశి ధనస్సు. ఈ తొమ్మిదవరాశియందు అవతారం దాల్చినవాడు శ్రీరాముడు. ఈ ధనస్సు ఆధారంగా ధర్మస్థాపన చేసినటువంటివాడు శ్రీరాముడు.ప్రతి అవతారానికి అంతర్గతంగా ఉండేది దైవశక్తి అయినప్పటికీ అది ఒక్కొక్కరాశి నుండి ఒక్కొక్క అవతారంగా బహిర్గత మౌతుంది. Hinduism in the Space Age అనే పుస్తకం వ్రాశాను. అందులో ఏ ఏ అవతారం ఏ ఏ రాసులలో వస్తుంది. అందులో రేపు రాబోయే అవతారం కల్కి భగవానుడు అవతారం. ఇది ఎప్పుడు వస్తుంది. ఎట్లా వస్తుంది. ఏ టైముకు వస్తుంది అనేది ఈ కాలచక్రం ద్వారా తెలుసుకోవచ్చు. ఈ రామావతారం తొమ్మిదవది. తొమ్మిదవ రాశి ధనస్సు. అందువల్ల ఆయన పట్టిందే ధనస్సు. విరిచింది ధనస్సు. పరశురాముడి దగ్గర తీసుకొన్నది

ధనస్సు. రావణుని సంహరించింది ఇంద్రుడు ఇచ్చిన ధనస్సుతో. మొత్తం ధనస్సుఆధారంగా ధర్మాన్ని స్థాపించాడు. మరి ధర్మానికి, ధనస్సుకు ఏం సంబంధం అంటే జ్యోతిష్యంలో తొమ్మిదవ రాశికి ధర్మస్థానం అనిపేరు. ఎవరి జాతకంలోనైనా లగ్నం నుండి తొమ్మిదవ స్థానం ధర్మస్థానం, తపస్సు స్థానం. అంటే తపస్సుకు, ధర్మానికి మూలమైన రాశి ధనస్సు. మానవ జాతిలో ఈ తపస్సు, ధర్మం అనే విషయాలు మొదటిసారిగా ప్రతిష్ఠించి దాని ప్రభావం చూపిన వాడు శ్రీరామచంద్రుడు. అందువల్ల రామావతారం యొక్క significance ఏమిటంటే ధనస్సుయొక్క significance, అట్లాగే సింహరాశియందు సర్వగ్రహాలు సమకూడినపుడు నృసింహావతారం వచ్చింది. వృషభం, రోహిణియందు గ్రహాలకూటమి ఏర్పడినపుడు గోలోకానికి మూర్తి అయిన కృష్ణావతారం వచ్చింది. ఇట్లా రాసుల యొక్క రూపాన్నిబట్టి వచ్చే అవతారాల స్వరూపాన్ని కూడా భాగవతంలో వర్ణించబడింది. మీనరాశిలో మత్స్యావతారం, కుంభరాశిలో కూర్మావతారం ఇట్లా ఒక్కొక్కరాశి యొక్క ఆకారం ఎట్లా ఉంటుందో అదే విధమైన అవతారం వచ్చి ధర్మాన్ని ప్రతిష్ఠి స్తాడు. అందువల్ల శ్రీరాముడియొక్క విశిష్టత ఏమిటయ్యా అంటే శ్రీరాముడు చరిత్ర అంతా నవమినాడే జరిగింది. శ్రీరామజననం జరిగింది నవమినాడు. వనవాసం పూర్తిచేసికొని అయోధ్యకు వచ్చింది నవమినాడు. చివరికి అవతార పరిసమాప్తి చేసిందికూడా నవమినాడు. శ్రీరామ పట్టాభిషేకం దశమి, ఏకాదశి కలిసినటువంటి పవిత్రమైన రోజు. శ్రీరామ పట్టాభిషేకానికి ప్రాముఖ్యత ఏమిటంటే ధర్మానికి పట్టాభిషేకం. ధనస్సు ధర్మస్థానం కాబట్టి ధర్మస్వరూపుడు అని శ్రీరామునికి పట్టాభిషేకం. మానవ జాతియొక్క చరిత్రలో ధర్మంయొక్క ప్రాముఖ్యతను ఒక్కసారిగా గుర్తించి, ధనం గొప్ప, బలంగొప్ప, రాజ్యంగొప్ప అనే విషయాన్ని మార్చుకొని ధర్మం గొప్పదని

గుర్తిస్తే 'రామో విగ్రహవాన్ ధర్మః' శ్రీరాముడు ఆకారం ధరించినటువంటి ధర్మము. ఆకారం ధరించిన ధర్మముఅంటే అర్థమేమిటి ? చాలామంది సినిమాలుచూసి రామాయణాన్ని అర్థం చేసికోక రాములవారి ఆకారమే ధర్మం అనుకొంటారు. కాదు. ఈ ధర్మం అనే పదానికి వేదాలలో విశేషమైన అర్థముంది. 'ధరతీతి ధర్మః' అంటే సర్వజీవరాసులను ధరింపజేసేటటు వంటిది ఏదైతే ఉందో అది ధర్మం. సర్వ జీవరాసులను ధరింపజేయడం అంటే అర్థమేమిటి? మన శరీరంలో ప్రాణం ఉన్నది. ఊపిరి పీలుస్తున్నాం. ఆలోచన చేస్తున్నాం. ఈ శరీరంతో అన్నిపనులు మనం చేస్తున్నాం. ఏమను కొంటున్నాం? అన్నీ మనమే చేస్తున్నాము అనుకొంటున్నాము. కానీ నిజంగా మనచేత ఈ పనులు చేయిస్తుంది లోపల ప్రాణం, మనస్సు, శ్వాస, అంతరాత్మ. ఇవిగనుక స్విచ్ ఆగిపోతే మన తెలివితేటలు,మన ప్రజ్ఞ అన్నీ పడుకొంటాయి. అందుచేత మనలో ప్రాణం, మనస్సు, శ్వాస వీటిని ధరింప జేసేటటువంటిది ఏదైతే ఉందో అది దైవశక్తి. (Divine Power) ధర్మం అంటే అది. 'ధరతీతిధర్మః' అదే ఈ సృష్టిని లోపలనుండి ఆత్మ స్వరూపంగా, ప్రాణ స్వరూపంగా, అందరిచేత జీవింప జేస్తుందో ఆ శక్తియే శ్రీరాముని రూపంలో ప్రపంచంలో ఉద్భవించి ఒకరూపం ధరించింది.

ఒక రూపం ధరించిందని చెప్పడంలో ఉద్దేశ్యం ఏమిటి ? అందరూ రూపం ధరించి జన్మించారు కదా! రోడ్డుమీద పోయే మామూలు వాడు, సినిమావాడు, పొలిటీషియన్ ఇప్పుడు అందరూ మామూలుగానే రూపం ధరించి జన్మించారుకదా! ప్రత్యేకంగా 'రామో విగ్రహవాన్ ధర్మః' అని ఎందుకు చెప్పారంటే దీన్లో ఒక అవతార రహస్యవిశేషం ఒకటి ఉంది. ఏమిటా రహస్యం? అంటే సామాన్యమానవుడి జన్మకి, భగవంతుడి

అవతారానికి ఉండే తేడా ఏమిటో చెప్తుంది. అందరూ ఏమనుకొంటారు ఈ రామాయణ విషవృక్షంఅనే పుస్తకం వ్రాసిన వాళ్ళలాగా. ఎవరో ఒక చారిత్రకమైన పనిచేస్తే ఆ వ్యక్తిని పొగిడి అవతారంగా తయారుచేశారని. ఇట్లా క్రిందనుండిపైకినెట్టితే పొయ్యేదికాదు అవతారం. హిందూ మతం ఏంచెప్తుంది అంటే జంతు జన్మ దగ్గర నుండి క్రమేణ ఆధ్యాత్మిక పురోభివృద్ధి చెందుతూ మానవజన్మ ఎత్తి ఇదికూడా జన్మజన్మకూ పురోభి వృద్ధిచెంది ఏవైనా కర్మలుంటే మళ్ళీ వెనుకకువెళ్ళి చివరికి భగవత్‌దశకు చేరుకొంటాడు. అందుకని ప్రతిజీవికూడా ఎత్తే జన్మ కర్మానుసారంగా ఉంటుంది. భూలోకంలో చేసికొన్న కర్మలు ఏవైతే ఉంటాయో దానికి దగ్గరగా జన్మ ఉంటుంది. ఎందుకయ్యా ప్రతివాడికి కర్మనుబట్టి జన్మ వస్తుందికదా ప్రత్యేకంగా ఎందుకు చెప్తున్నావ్ అంటే పూర్వ కర్మానుసారంగా వచ్చే జన్మ తప్పనిసరిగా వచ్చేటటువంటిది, మన వశంలో లేనటువంటిది. ఈ రోజు చాలామంది మనలో ఈ శరీరంగానీ, జన్మగానీ, ఈ వృత్తిగానీమనం వద్దు అనుకొనేటటు వంటివి వస్తుంటాయి. ఒకడు వికలాంగుడు ఉంటాడు, ఒకడు కురూపిగా ఉంటాడు, ఒకడు దరిద్రుడుగా ఉంటాడు, వీళ్ళందరూ కోరుకొంటే వచ్చేదా జన్మ. కాదు. అక్కర్లేదు అనుకొనేటటు వంటి ఆ జన్మ ఎందుకువస్తుంది. జీవులకు వచ్చే జన్మ కర్మవశమై ఉంటుంది. కానీ భగవత్ అవతారంగావచ్చే జన్మ కర్మవశమై రాదు. ఇది ముఖ్యమైన రహస్యం. ఎందువల్ల రాదు ? క్రింద నుండి ప్యూన్‌గా ప్రారంభమై కలెక్టర్‌గా ప్రమోషన్ పొందేటటు వంటివాడు జీవుడు. మానవుడిగా పుట్టి క్రమేణా సాధన ద్వారా భగవత్ దశకు చేరుకొంటాడు. కానీ భగవంతుడు కలెక్టర్‌గా వచ్చేవాడు ఎట్లా ఉంటాడు సరాసరి పైనుండి వచ్చేవాడు కాబట్టి భగవత్ శక్తి అంటే మానవుడు చివరకి చేరుకొనేది ఏదైతేఉందో దానితోనే పరిపూర్ణత్వంగా వచ్చేటువంటి అవతారం.

ఎట్లా వస్తుంది ? దీనికి ఏదైనా ఉదాహరణ ఉందా? భగవంతుడుగా ఒక రూపం ఉండదు, ఒక ఆకారం ఉండదు, విశ్వవ్యాప్తంగా ఉండేటటువంటి పవర్ కదా ! మానవ రూపంలో జన్మించినా భగవంతుడు అని ఎట్లాచెప్తావ్? అని ఈ రోజున చాలామంది చదువుకొన్న హిందువులకు అనుమానాలు వస్తున్నవి. ఎందుకని? క్రిస్టియన్స్, ముస్లింలు భగవంతుడికి ఆకారంలేదని చెప్తారు. ఇవన్నీ కూడా కలగాపులగం చేసికొని భావసాంకర్యం వల్ల మనకు కూడా భగవంతుడు ఆకారం ధరించి ఉంటాడా లేదా మనం ఊహించుకొనే టటువంటిదేనా అంటే దీనికి చక్కని ఉదాహరణ సైన్సులోఉన్నది. మనకు ఎండాకాలంలో నీరు అంతా ఆవిరై పైకి వెళ్తుంది, మేఘం రూపంలో. అవి చల్లబడగానే నీళ్ళలా కురుస్తున్నాయి. కానీ ఒక్కొక్కప్పుడు అకస్మాత్తుగా చల్లబడితే వడగండ్లు రూపంలో క్రిందపడతాయి. శ్రీరామకృష్ణ పరమహంసని అడిగారు 'అవతారం ఎట్లా వస్తుందయ్యా ? ఏ రూపంలో వస్తుంది ? దానిని ఎవరు నిర్ణయిస్తారు?' అని. దానికి ఆయన 'వేడిగాఉన్న వేసవి కాలంలో చల్లనిగాలి క్రింద నుంచి పైకి వెళ్తే ఈ గాలే పైన నీటిని వడగండ్ల క్రిందకు తీసుకువస్తుంది. అట్లాగే మహర్షులు ప్రార్థిస్తే ఆకారం లేని భగవంతుడు అకస్మాత్తుగా వడగండ్లరూపంలో ఆకారంతో క్రిందకు దిగుతాడట'. అని చెప్పారట. ఎంత చక్కని ఉదాహరణ నిచ్చాడంటే క్రిందనుండి చల్లనిగాలి పైకి వెళ్ళి ఎలా వడగండ్ల రూపంలో క్రిందకు తీసుకువస్తుందో అట్లాగే మహర్షులు ప్రార్థించి ఇక్కడ ప్రజలు బాధలు పడుతున్నారు. అధర్మం, సంక్షోభం చాలా గొడవగాఉంది క్రిందకు మీరు రావాలని మనిషి లాగా కాకుండా ప్రేమతోనే వాడిని (భగవంతుడిని) లాక్కొస్తారు. తల్లిదగ్గర పిల్లవాడు పాలుఎట్లా తాగుతాడు. అప్లికేషన్ పెడతాడా పెట్టడు. అడుగుతాడా, అడగడు, ప్రేమతో పీల్చుకొంటాడు. తల్లిదగ్గర ఎలా

ప్రేమతో పాలు పీలుస్తాడో అట్లాగే భగవంతుడిని భక్తులు ప్రేమతో క్రిందకు పిలుస్తారు. సైన్సు ఏంచెప్తుంది? తుఫాను వచ్చేముందు క్రింద వాయుగుండం ఏర్పడి పెద్ద వాక్యూమ్ ఏర్పడుతుంది. దీనివలన పైనుండి వర్షం క్రిందకు దిగుతుంది. అట్లాగే మహర్షులుచేసే తపస్సువల్ల ఒక ఆధ్యాత్మిక వాయుగుండం ఏర్పడుతుంది. దానివలన ఈ భగవత్‌శక్తి దానిలో నిబిడీకృతమై క్రిందకు దిగుతుంది. అపుడు ఈ నీటి ఆవిరి వడగండ్లు అయినట్లుగా నిరాకారమైన పరబ్రహ్మం ఆకారం రూపంలో క్రిందికి దిగుతాడు. దీనికీ, కర్మవశమై ప్రారబ్ధ కర్మతో జన్మించే వాడికి బోలెడంత తేడా ఉంటుంది.అది స్వయంకృతంగా తన ఇష్టంవచ్చినట్లు స్వచ్ఛందంగా వచ్చే జన్మ. దానికి పూర్వకర్మలు బంధించవు. దీనికిఉన్నదంతా పూర్వాపరాలే. అందువల్ల ఒకటి స్వతంత్రం, ఇంకోటి పరతంత్రం. జీవుల లక్షణం ఏమిటంటే పరతంత్రం. పరతంత్రం అనగా దరిద్రం, రోగం ఇటువంటి వాటితో చిక్కుబడి, వాటి నుంటి బయటపడాలని ఉన్నాగాని, బయటపడలేక పోతున్నాము. ఎంత గొప్పవాడు కూడా ఈ ప్రపంచంలో స్వతంత్రుడు కాడు. జీవిత పరిస్థితి అతని ఇష్టం వచ్చినట్లు నడవదు. కర్మకొద్దీ, జాతకంలోనో, అదృష్టమో, బ్రహ్మదేవుడు వ్రాసిన వ్రాతో దాని ప్రకారం వాడి జీవితం నడుస్తుంది. కానీ పైనుండి వచ్చే పరబ్రహ్మ స్వరూపమైన అవతారం స్వతంత్రం చేత తను ఏం చేయదలచుకొన్నాడో, భూమిపై ఎటువంటి పరిస్థితులు ఉన్నాయో, తాను ఏమిచేయాలో ముందు గానే ప్రోగ్రామ్ ఫిక్స్ చేసుకొన్నట్లుగా, ముందుగానే టికెట్ రిజర్వేషన్ చేయించుకొని ప్రయాణం చేసినట్లుగా వస్తాడు. ఇది కేవలం నాయొక్క [illegible] చమత్కృతిచేత చెప్తున్న విషయం కాదు. దీనికి ప్రమాణం భగవద్గీతలో ఉన్నది. 'అర్జునా! నీవు కూడా జన్మలు ఎత్తావు. నేను కూడా నీలా జన్మలు ఎత్తాను. నా

జన్మలన్నీ నాకు గుర్తున్నాయి. కానీ నీ జన్మలు మాత్రం నీకు గుర్తులేవు.' అంటే అర్థం ఏమిటి ? జీవుడి యొక్క జన్మలు అజ్ఞానంతో కూడుకొన్నవి కాబట్టి. మనం గతజన్మలో ఎవరో వచ్చే జన్మలో ఏమి అవుతామో మనకు తెలియదు. కానీ దైవశక్తి గల అవతారం అంటే పరిపూర్ణంగా జ్ఞానసంబంధ మైనవి కాబట్టి conscious birth, conscious death (ప్రజ్ఞాజననం, ప్రజ్ఞా మరణం) రెండూ ఉంటాయి. అంటే శరీరం ఎపుడు విడిచిపెట్టాలో తెలిసి విడిచి పెడ్తాడు. ఎప్పుడు శరీరం ధరించాలో అపుడు తిరిగి శరీరం ధరిస్తాడు. అటువంటి జన్మ దివ్యమైనటువంటి జన్మ. మామూలు జన్మ మానుషమైన జన్మ. ఇంకా క్రిందకు పోతే జీవరాసులు పశువుతో సంబంధమైనటువంటి జన్మ. వాటికి జ్ఞానం ఉండదు. ఆహారం దొరికితే తింటాయి. కష్టంవస్తే భయపడతాయి. సంతానం కంటాయి, సంసారం చేస్తాయి. దీనికి కొంచెం పైన జ్ఞానం, అజ్ఞానంతో మనుష్యుడు ఉన్నాడు. పూర్తి జ్ఞాన స్వరూపంగా ఉండేది భగవత్ తత్త్వం. అందువల్ల ఈ అవతారం అనేటటువంటిదిపూర్తి ప్రజ్ఞ కలిగినటు వంటిది. తాను ఎవరో ఎరుక తెలిసిన జన్మ ఈ దివ్యమైన జన్మ. ఊరకే అవతారం గొప్పదని దండంపెట్టటంకాదు. మూఢభక్తితో.అది కూడా మంచిదే. కానీ జ్ఞానభక్తి దానికన్నా మేలైనది. ఈ జన్మ ఎట్లా వస్తుందో తెలుసుకొని ప్రారబ్ధభూతుడై భగవత్ అవతారంతో ప్రపంచాన్ని అనుగ్రహిద్దామని జన్మిస్తాడు భగవంతుడు. భాగవతంలో దీనిగురించి చెప్పబడింది. మత్స్యావతారం వచ్చినపుడు ఈ మనువుస్తోత్రం చేశాడట. మత్స్యావతారం అంటే చేపరూపంలో కనబడు తున్నాడు. సముద్రంలో అనేక సొరచేపలు కనబడుతున్నాయి. ఏ చేపైనా మత్స్యావతారం కాదు. అన్నీ నీళ్ళలోనే ఉన్నాయి. ఈదుతూనే ఉన్నాయి. ఎట్లాఅయితే

అన్నిచేపలు మత్స్యావతారంకాదో అందరూ మానవ ఆకారంలో ఉన్నాకానీ అవతారానికి, మానవుడికి మత్స్యావతారానికి, చేపకీ వున్న తేడా ఉంది. అందుకని ఏమన్నాడు 'అనుగ్రహయా భూతానాం భక్తేరూపం జలోకశం' పరబ్రహ్మా అయిన ఓ నారాయణుడా ఈ సర్వభూతాలను అనుగ్ర హించటానికి నీవు జల, చరరూపం ఎత్తావా? అంటే ఏ జన్మ ఎత్త డానికైనా సిద్ధంగా ఉంటాడు భగవంతుడు. కానీ జన్మ ఎత్తాడు కదా అనితాను మత్స్యా వతారం ఎత్తాడు కదా అని తాను చేపను అనుకొంటాడా అనుకోడు. తన స్వస్వభావం మరిచిపోడు ఆయన. వేదాలు ఉద్ధరిస్తాడట, భూమిని త్రిప్పుతూ ఉంటాడట, ధర్మాన్ని ఉద్ధరిస్తాడట. కుమ్మరివాడు చక్రాన్ని త్రిప్పుతున్నట్లుగా ఈ దశాకృతులలో ప్రపంచాన్ని త్రిప్పుతుంటాడుట, తిరుగుతున్న కాలచక్రంలో తిరుగని ఇరుసుగా తాను మధ్యనఉంటాడు. చక్రం తిరుగుతున్నపుడు అన్నీ విషయాలు తిరుగు తుంటాయి. అందులో మనం చక్రంలోని వాళ్ళం అంటే చక్రంతో జన్మయెత్తి సూర్యోదయ, సూర్యాస్తమానాలతో తిరిగేది కాలం దీంతో ఉదయాస్తమానాలు అంటే పుట్టి చచ్చి పోయేవి. జీవరాశులు. అందువల్ల తిరిగేటటువంటి కాలచక్రంలో తిరుగని ఇరుసువంటి వాడు పరమాత్మ. అందువల్ల పరమాత్మ కాలాన్ని త్రిప్పుతాడు కానీ పరమాత్మ తిరగడు. అందుచేత ఈ అవతారానిది ప్రజ్ఞా పూరితమైన జన్మ. ఇది తెలియక చాలామంది ఏమంటారు? రాములువారు మామూలు రాజే. అవతారమూర్తి అని ఊరకే ప్రచారం చేశారు అని. ఇది విమర్శగా రామాయణం పరిశీలిస్తే దీని పరతత్వాన్ని తెలుసుకోవడానికి అనేక నిదర్శ నాలు ఉన్నవి. అందులో ముఖ్యమైన ఘట్టం, సీతా అగ్నిపరీక్ష ఘట్టం. అగ్ని సీతను తిరిగి ఇచ్చేటపుడు అందరూ దేవతలు స్తోత్రంచేస్తారు. 'నీవు సాక్షాత్ శ్రీమన్నారాయణుడివి. చక్రాయుధుడివి. అంటే కాలచక్రాన్ని త్రిప్పే టటువంటి వాడివి. పూర్వం

సృష్ట్యాదిలో వరాహమూర్తివై భూమిని ఉద్ధరిం చావని'.అందువల్ల దేవతలు వీళ్ళందరూ పైనుండి కష్టపడి క్రిందకు తెచ్చు కొన్నారు. అందువల్ల నాకేం తెలియదంటే ఎందుకు ఊరుకొంటారు దేవతలు. ఎవరైనా ఒకఅధికారి గ్రామానికివస్తే ఆ గ్రామంలోని వారికి అతడు అధికారి అని తెలియక పోవచ్చు. కానీ అతనితోపాటే వచ్చిన గూఢాచారులు, బంట్రోతులు వీళ్ళకెందుకు తెలియదు. అందువల్ల పైనుండి వచ్చిన దేవతలు గుర్తుపట్టి 'అయ్యా! నీవు అట్లా అంటే కాదు, నీవు చేయవలసింది చేయాలి. లేకపోతే మేమంతా మునిగిపోతాము'. అట్లా గుర్తు పడతారు దేవతలు. లీలామాత్రం అంటే చిన్నపిల్లవాడిలాగా పరమాత్మ పాంచభౌతికాత్మకమైన ఈ పదార్థమయ ప్రపంచంతో ఆడుకొంటాడట. అయిదు వస్తువులు కలిపి పిల్లలు గోళీలాట ఆడినట్లుగా ఈ ప్రపంచంతో భగవంతుడు ఆడుకుంటాడట. కుమ్మరివాడు వస్తువులు తయారు చేసినట్లుగా జీవరాసులు తయారు చేస్తాడట. మరల వాటిని destroy (అంతం) చేస్తుంటాడట. ఇదే భగవత్ చరిత్ర. ఇదే ఈ లోపల జరిగే చరిత్ర. (inner history) ఇంగ్లీషువాడు చెప్పింది బాహ్యచరిత్ర (outer history) ఈ బయట జరిగే బాహ్యచరిత్రలో ఎప్పుడూ జరిగే ఈ శాశ్వతమైన సత్యం గురించి చెప్పేదే పురాణము. అందువల్ల అ-పూర్వము. అంటే పూర్వం ఒక్కటే జరిగింది కాదు. నిత్యము జరిగేటటువంటిది. ఇవి రామాయణ పరతత్వంలో మూడవ అర్థము.

ఇంకొక నాలుగవ అర్థం కూడా ఆధ్యాత్మికమైన చరిత్ర ఉంది. ఈ విశ్వమునకు చరిత్రలో భగవంతుడి అవతార స్థానము అని చెప్పాను. ఎపుడో విశ్వం యొక్క చరిత్రలో త్రేతాయుగంలో ఎప్పుడో రామావతారం వచ్చింది. ఇపుడు నాకేమిటి ఉపయోగం అంటే సాధన చేసేటటువంటి సాధకుడు

అంతరాత్మలో కొన్ని దశలు (stages) ఉన్నవి.

సాధన ప్రారంభించినపుడు మనిషి పది దశలలో పరిపూర్ణ స్థితికి చేరుకొంటాడు. అంటే ఈ ప్రపంచం ఎట్లా అయితే పదిదశలలో పరిణామం చెందినదో అట్లే మానవుడుకూడా పదిదశలలో పరిపూర్ణ దశకి చేరుకొంటాడు. అందువల్ల అంతరాత్మలో కూడా ఆ (stage) స్థితికి వచ్చేసరికి అవతార దర్శనం అవుతుంది. అంటే ఏమిటి? ప్రపంచంలో ఎట్లా అవతారాలు వచ్చాయో, అట్లాగే లోపల జీవుడు కూడా గర్భస్థ జీవుడిగా ఈ దశలు అన్నీ అనుభవిస్తాడు. ఎట్లా అనుభవిస్తాడంటే గర్భోపనిషత్ అని ఒక ఉపనిషత్ ఉన్నది. అది ఏం చెప్తుందయ్యా అంటే గర్భంలో ఉన్న జీవి పరమాత్మ ఎట్లా అయితే సృష్టినుంచి దిగి అవతారాలు ధరించి దిగివచ్చాడో అట్లాగే జీవాత్మ కూడా పరమాత్మకు చిన్న శ్యాంపిల్ రూపం. ఎట్లాగ పెద్ద మర్రిచెట్టు, చిన్న మర్రికాయలో బీజభూతమై ఉన్నదో పైకి చూస్తే మర్రిచెట్టు పెద్ద పెద్దకొమ్మలుకలిగి చాలాపెద్దదిగాఉంటుంది. మైక్రోస్కోపులో చూస్తే యావత్తు చిన్న మర్రిగింజలో ఉంటుంది. అందువల్ల ఈ విశాలమైన యావత్ సృష్టి అంతా జీవుడియొక్క హృదయంలో ఉంటుంది. అంటే ప్రతివాడి హృదయంలో భగవంతుడున్నాడు కదా అని ఋషులు దేన్ని బట్టి చెప్పారయ్యా అంటే ఈ కనిపించే ఆకాశం, నదులు, పర్వతాలు, కొండలు, చెట్లు, నక్షత్రాలు యావత్ సృష్టి అంతా చిన్న మైక్రోస్కోపిక్ ఫామ్‌లో మానవుడి అంతరాత్మలో ఉన్నది. ఇది ఉన్నది అని చూపించడానికి చిన్నప్పుడు శ్రీకృష్ణుడు నోరు తెరచి సర్వవిశ్వాన్ని, బ్రహ్మాండాన్ని చూపించాడు. ఏమిటంటే సింపుల్‌గా, సూక్ష్మంగా ఉంటాడు. ప్రతి జీవుడు హృదయంలో భగవంతుడు ఉన్నాడని అది చెప్పడానికే అవతారం వస్తుంది. ఒక సత్యాన్ని నిజనిర్ధారణచేసి

(truth demonstrate) నిర్దిష్టంగా చూపడానికే అవతారం వస్తుంది. ఇది వీళ్ళు హోమ్ వర్క్‌లాగా పడుతూలేస్తూ ఆ స్థితికి రావాలి. అంటే చివరికి ఆస్థితికి వస్తానో లేదో భగవంతుడు ఉన్నాడో లేడో అనుకొంటే ఇదిగో నేను ఉన్నాను అని నోరు తెరచి విశ్వాన్ని చూపించాడట. అలాగ ఈ యావత్ విశ్వాన్ని ప్రతివాడు తన అంతరాత్మలో చూడొచ్చు. ఇలా చూసినందువలనే మహర్షులు, భవిష్యత్ వ్రాయగలిగారు. ఈ భవిష్యత్ ఎట్లా వ్రాశారు. మహర్షులకు బయట జరుగ బోయే సంఘటనలన్నీ లోపత అంతరాత్మలో యోగదృష్టిలో కనబడతాయి. ఎందుకు కనబడుతుంది ? అంటే బయట బ్రహ్మాండంలో మర్రి విత్తనం వంటివాడు మానవుడు. కాబట్టి జరుగబోయే చరిత్ర గతించిన అవతారాలు, రానున్న అవతారాలు ఆ చరిత్ర అంతా కూడా లోపల అంతరాత్మలో కనబడు తుంది. ఈ దృష్టితో మనం చూస్తే రామావతారాన్ని కూడా ఆత్మారాముడిగా మనం దర్శించవచ్చు. ఇది మనందరికి సాధనలో ప్రధానమైన అంశం. ఎందుకని మనం రామాయణాన్ని పారాయణగా అనుష్ఠానం చెయ్యాలి? అంటే ఈ రామాయణం గతించిపోయిన చరిత్ర. కానీ ఆత్మారాముడు మాత్రం శాశ్వతంగా ఎల్లప్పుడూ జరుగుతూ ఉండే చరిత్ర. ఇది అపూర్వం. ఏమిటి ఈ అపూర్వం అంటే శ్రీరాముడు సూర్యవంశంలో జన్మించాడు. ఈ సూర్యవంశంలో జన్మించడం అంటే ఏమిటి ? యోగసాధన చేసేటపుడు సాధకుడు మొదట ప్రాణాయామము ప్రక్రియద్వారా మనస్సును, ఇంద్రి యాలను బంధిస్తాడు. ప్రాణాయామము అనగా ఉచ్ఛ్వాస, నిశ్వాసలతో శ్వాసను కంట్రోలుచేసే ప్రక్రియ. దాంట్లో కుడి, ఎడమ ముక్కులకు సూర్య నాడీ, చంద్రనాడీ అనే పేర్లు ఉన్నాయి. శ్వాస గనుగ సూర్యనాడి గుండా జరిగితే శాశ్వతమైన బ్రహ్మ మార్గానికి వెళ్ళతాడు. చంద్రనాడితో చేస్తే మళ్ళీ

జన్మ ఎత్తేటటువంటి మార్గం కలుగుతుంది. భగవద్గీతలో ఈ కృష్ణ మార్గము, శుక్లమార్గము రెండూఉన్నాయి అన్నాడు. ఈ సూర్యవంశపు రాజులు, చంద్రవంశపు రాజులే శ్వాసలో సూర్యనాడి, చంద్రనాడి ద్వారా బయటజరిగే చరిత్రే లోపల జరుగుతుంది. సహస్రారం, షట్చక్రాలు కనబడతాయి. యోగంలో ఈ సహస్రారంలో ఉండే పరబ్రహ్మ స్థితి రామావతారానికి వెనకాల ఉండే నారాయణతత్త్వం. ఎట్లాగయ్యా అంటే సూర్యాంతర్వర్తి నారాయణుడు. ఇపుడు మామూలుగా పల్లెల్లో కూడా సూర్యుని చూసి సూర్యనారాయణమూర్తి అంటారు. వాడికి చదువు లేకపోయినా సూర్యుడు అనట్లేదు. సూర్య నారాయణుడు అంటున్నాడు. అంటే శరీరంలో ఉంది ఆ చదువు. పెద్ద వాళ్ళు చెప్పి చెప్పి అది పామరుడైన వాడి రక్తంలో ఉంటుంది. అంటే పైకి కనబడే సూర్యుడిలో వెనకాల ఉండేవాడు నారాయణ మూర్తి. పైకి కనబడే మానవుని శరీరంలో లోపల కనబడే వాడు నారాయణుడు. పూర్వం ఋషులు ఏం చెప్పారయ్యా అంటే పైకికనబడే నరుడిలో అంతర్గతమై ఉన్న నారాయణుడినిచూసి మానవసేవలో మాధవునిచూసి తరించ మన్నారు. అందువల్ల సూర్యుడి యొక్క నారాయణాంశ లోపల ఉన్నటు వంటి పరతత్వం ఏదైతే ఉందో అది అంతరాత్మలో మనం దర్శించాలి. ఇది గాయత్రీమంత్రంలో మనకు స్పష్టంగా కనబడుతుంది. అదే రామాయణం యొక్క అంతరార్థం. 24 అక్షరములుగల గాయత్రీ మంత్రం 24 వేల శ్లోకాలు గల రామాయణంలో నిక్షిప్తంచేసి చెప్పాడు. ఆ తర్వాత 7 వ్యాహృతులు అంటే షట్చక్రాలు ఆరు కాండలలో అంటే ఏడవది ఉత్తరకాండ అంటే ఇది చివరిది. మోక్షం. ఇక తిరిగి వచ్చేదిలేదు. అందువల్ల ఆరు కాండలలో ఉండేటటువంటిది. లోపల ఆరు చక్రాలలో ఇచ్చాడు. ఇచ్చి ఈ దశలు అంటే శరీరంలో ఉండే జీవుడు కోరికలతోటి అహంకారం తోటి

అసురత్వంలో ఉంటాడు. జన్మతః మనుష్యుడు. అసురత్వం, పశుత్వం, అహంకారం కోరికల తోటి నిండి ఉంటాడు. అందువల్ల ఈ శరీరం అంతా కూడా లంకా సామ్రాజ్యం. ఎందువల్ల లంకా సామ్రాజ్యం అంటే ఈ సంసారం అనే సాగరం చుట్టూ ఉంటుంది లంకకు. కాసేపు ధ్యానం చెయ్యవయ్యా అంటే 'ఎక్కడ కుదురుతుందండీ సంసారం' కాసేపు జపం చెయ్యవయ్యా అంటే 'అబ్బ ఛస్తున్నానండీ ఈ సంసారంతో' అంటాడు. అంటే మోక్షం రాకుండా ఇక్కడ వీడిని గానుగెద్దులాగా తిప్పేది సంసారం. అంటే బయటకు పోనీయకుండా వీడిని త్రిప్పేది సంసారం. ఈ సంసార చక్రం చుట్టూ ఉండి ఎటూ పోవడానికి వీలుకాక చిక్కి ఉండేవాడు జీవుడు. ఈ జీవుడుఎలా ఉన్నాడు? 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలతోటి కోరికలు అనుభవిస్తూ ఉంటాడు. అందుకని వీడు రావణాసురుడు. దశకంఠుడు. ఈ 10 తలకాయల రావణాసురుడు ప్రతివాడి శరీరాన్ని పాలిస్తూ ఉంటాడు. వీడి లోపల అంతరాత్మ మోక్షం పొందవలసిన ఆత్మ ఉందే, అది ప్రకృతి స్వరూపియైన సీత. అశోకవనంలో అరణ్యంలో కూర్చున్నట్లుగా చెప్పారు. దిక్కుతెలియని జీవితమే అశోకవనము.తన భర్త ఎక్కడ ఉన్నాడో తెలియదు. రక్షిస్తాడని నమ్మకం మాత్రం ఉంది. అలాగే ప్రతి మానవుడు కూడా ఏదో ఒక రోజు భగవంతుని అనుగ్రహం దొరుకుతుందనే ఆశతో బ్రతుకుతూ ఉంటాడు. ఎపుడు దొరుకుతుందో తెలియదు. ఎలా దొరుకుతుందో తెలియదు. ఈ సంసారందాటి బయటికి రాడువాడు. ఇది అంతర్గతమైన రామాయణం. ఇక్కడ ఆంజనేయుడినిపెడితే రామాయణం సుఖాంతం. ఎందువల్ల? ఈయన పవనతనుజుడు. అంటే ఉచ్ఛ్వాస, నిశ్శ్వాస స్వరూపమైన ప్రాణాయామ స్వరూపుడు, ఈ ఆంజనేయుడు. అంటే ఈ శ్వాస అనే ప్రాణాయామంద్వారా అంతరాత్మ అయిన జీవుడిని పరమాత్మ అయిన

దేవుడి తోటి సమాధిస్థితిని ఇచ్చి కలిపేది ఒక్కటే ప్రాణాయామం. ఎట్లా చెప్పగలవు అంటే 'మనోజవం మారుతతుల్య వేగం...' సాధనకు మొదట మూల కారణం ఏమిటి ? సాధనలో మొదట మనసు అన్ని విధాలా పరిగెడుతుంది. ఈ పరిగెత్తే మనసును ఏకస్థంచేస్తేనే సాధన కుదురుతుంది. ఎట్లా పట్టుకోవచ్చు అంటే శ్వాసతోనే. శ్వాసను బంధించి 'మారుత తుల్యవేగం' అంటే శ్వాసతోనే 'తుల్యం' మనో వేగాన్ని బంధించాలంటే శ్వాసతోనే బంధించాలి. మరి ఈ శ్వాసను ఎట్లా జయించాలి. 'జితేంద్రియం' ఇంద్రియాలను జయించినట్లైతే ఇదిసాధ్యపడుతుంది. మరి ఇంద్రియాలనుజయిస్తే, శ్వాసనుబంధిస్తే ఏమి జరుగుతుంది? మనసుకుపైన ఉండే బుద్ధిని జయించగలుగుతాడు. మనసుకు పైన ఉంటుంది బుద్ధి. అందువల్ల 'బుద్ధిమతాం వరిష్ఠం' వాడు బుద్ధిమంతుల్లో వరిష్ఠుడవుతాడు. వీడు ఎప్పుడు ఇంద్రియాలను జయించి, శ్వాసను బంధించి, బుద్ధిని జయించి బుద్ధిమతుల్లో వరిష్ఠుడు అవుతాడో వాడు 'శ్రీరామదూతం' పరమాత్ముడైన ఆత్మయొక్కదూత అవుతాడు. అది రామాయణంలోని రామరాజ్యం. పది తలలతో సుఖాన్ని అనుభవించేది రావణరాజ్యం. మరి ఈ రావణరాజ్యంలో ఉండే జీవుడికి రామరాజ్యస్థితి కలగాలంటే ఏమి చేయాలి? ఈ శ్వాస అనే ఆంజనేయుడు వచ్చి లంకా దహనం చెయ్యాలట. మొట్టమొదట ఈ బయట ఉండే మెటీరియలిజమ్, కోరికలు, అహంకారం, చెడుకర్మ అంతా తగలెయ్యాలి వాడు. అప్పుడుకానీ వేడిపుట్టదు ఈ రావణాసురుడికి. అందువల్ల ఈ శ్వాసతో ఏంచేస్తాడు? సూర్యనాడి ఈ కుడిముక్కుతో ప్రాణాయామం చేస్తే వేడి పుడుతుంది శరీరంలో. ఈ వేడితో జితేంద్రియం, బుద్ధిమతాం వరిష్ఠంక్రింద మూలాధారం నుండి పైదాకా వ్యాపిస్తాడట. ఈ శ్వాస చివరినుండిపైకి పెరిగి తోకలాగ,

ఆంజనేయస్వామికి తోక ఎంతైనా పెరుగుతుంది. అంటే అర్థం ఏమిటి ? ఏ కోతికీ తోక అట్లా పెరగదు. ఈ లోపల బుద్ధి అనే కోతి ఉన్నదే ఈ కోతికి శ్వాసయే తోక. మనం ఎంత సాధనచేస్తే శ్వాస అంత పొడుగు పెరుగుతుంది. ఎంత ఆయాసపడితే శ్వాస అంత పొట్టిది అవుతుంది. అందువల్ల అణు స్వరూపంగా అవుతాడట. ఒక చిన్న అణుక్షణంలో ఒక శ్వాసను పీల్చవచ్చు. పెద్ద బ్రహ్మాండమైన స్వరూపం అవుతాడట. ఆంజనేయుడు. ప్రాణం యొక్క స్వరూపం అది కుండలినీ శక్తి. తోకయందు ఎపుడూ అగ్ని ఉంటుందట. అందువల్ల ఆంజనేయ స్వామి తోకకి నిప్పు అంటిస్తే అపుడు లంకా దహనం అయిందట. అపుడు పోయి ఈ శ్వాస భ్రూమధ్యంలో రావణాసురుడి ఎదురు గుండా కూర్చున్నాడు ఈ తోక వేసుకొని. అపుడు రాముడి సందేశం వినిపిస్తా డట. ఈ లౌకికమైన కోరికలు, స్వార్థం, ఈ జీవితం అన్నీ విడచి పెడతావా లేకపోతే పూర్తిగా చంపమంటావా అంటాడట. ఈ విధంగా తక్కిన కథను మీరే పూరించుకోవచ్చు. అపుడు రామ పట్టాభిషేకం. అంటే సహస్రారం అనే చోట జీవుడికి పట్టాభిషేకం జరుగుతుంది. క్రింద నుండి పైదాకాఉండే పవనాత్మజుడుఉన్నాడు. సోదరులు ఇంద్రియాలు ఉన్నారు. ఆత్మ స్వరూపిణి అయిన సీతామాత ఉన్నది. అయోధ్య అంటే యోధుల చేత బయటనుండి జయించడానికి వీలుపడని నగరం. మామూలు నగరం అయితే జయించ వచ్చు. ఈ ఆత్మ అనే నగరం మామూలుగా మిలటరీ వాళ్ళను తీసికెళితే జయించేది కాదు. కేవలం సాధనతో మాత్రమే జయించే పట్టణం అయోధ్య పట్టణం. ఈవిధంగా లోపల అయోధ్య పట్టణానికి, లంకా పట్టణానికి సేతువు బంధించి, సేతువుపై ఎవరైతే వెడతారో వారికి పరమాత్మ సాక్షాత్కారం జరుగుతుంది. కలిగిన తర్వాత మరలా సేతువు మీద రాలేదు రాముడు. విమానంలో వచ్చాడు. అంతే ఆత్మసాక్షాత్కారం జరిగిన తర్వాత మళ్ళీ

ఇంత కష్టపడక్కర్లేదు. క్రింద బహిర్ముఖమై యావత్ ప్రపంచానికి సర్వ మంగళకరమైన రామ పట్టాభిషేకం చేశాడట. ఇది రామాయణంలో ఉండే శాశ్వతసత్యం. ఎప్పుడో జరిగిన పూర్వమైన రామాయణాన్ని అపూర్వమైన అధ్యాత్మ రామాయణంగా వాల్మీకి బంధించాడు. అందువల్ల తాత్కాలికమైన చరిత్రలో శాశ్వతచరిత్రను మనకుఅందించాడు. ఇదే శాస్త్రమునకు శాస్త్రమైన బ్రహ్మవిద్య. ఇది సర్వ శాస్త్రాలయందు ఉత్తమమైన శాస్త్రము. ఇది రామాయణంలో మనకు అందించాడు. ఇది ప్రతి జీవుడు సాధనలో కనుగొనే రహస్యం. జీవుడు భగవంతుడిని తెలిసికొనే ముందు భగవంతుడు కనపడడు ముందు, ఉన్నానని అభయమిస్తాడట. అది 'ఓం'అనే ప్రణవం ఉచ్చరించడం వల్ల, దీనిలోని పూర్ణానుస్వరం వల్లనే ఇది పరబ్రహ్మ స్వరూపం. అది రాముడు పంపించే అంగుళీయకమట. అంటే దీనివలనే నీవు రక్షింప బడతావు అని అభయమిచ్చాడట. దీని తర్వాత లంకా దహనం, రావణ సంహారం, రామపట్టాభిషేకం ఇవన్నీకూడా లోపల జరిగేటటువంటి అంత ర్నాటకం. ఈ అంతర్నాటకానికి సరిగా బయట జరిగే చరిత్ర కనుక బయట చరిత్ర, లోపలి చరిత్ర (inner history) ఇందాక చెప్పానే, ఎందుకు చెప్పానో ఇప్పుడు మీకు అర్థం అయ్యి ఉంటుంది. ఈ రామాయణానికి ఇంత గాథ ఉంది. దీన్ని ఈనాడు శాస్త్రాల దృష్టితో, సైన్సు దృష్టితో రష్యావారు బహుళమైన పరిశోధన చేశారు. 'జైట్సొల్' అనే రచయిత పుష్పకవిమానాలపై తనుచేసిన పరిశోధనతో 'Temples & Space Ships' అనే గ్రంథాన్ని ప్రచురించాడు. విమానాలు అనేవి కేవలం కవులు కల్పించిన ఊహలు కాదని, అధునాతమైన శాస్త్రవిజ్ఞానంతో చేయబడినవి అని నిరూపించాడు. ఇంకా వీరి పరిశోధనా వివరాలు 'సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు'

అన్న గ్రంథంలో ఇచ్చాను. ఇపుడు రాకెట్‌లో రాకేష్ శర్మ పైకి వెళతాడంటే నమ్ముతున్నాం. కానీ శ్రీరాముడు విమానంలో వచ్చాడంటే నమ్మటం లేదు. ఇది బ్రిటీష్‌వాడు నేర్పిన తప్పుడు చదువుల ఫలితం.

కాబట్టి ప్రతివాడూ ఈ రామాయణాన్ని శ్రద్ధతో, భక్తితో అనుష్ఠానం చేసి అందులో సారాన్ని గ్రహించాలి. ఎన్నెన్నో అద్భుతమైన విషయాలు, శ్రీరాములవారి జాతకం, రావణాసురుడి లంక గురించి ఎన్నో సైంటిఫిక్ విషయాలు ఇవన్నీగూడ 'శ్రీరామ చరితామృతం' అనే నా గ్రంథంలో వివరించడం జరిగింది. నేను ముందేచెప్పాను. ఇది మహాసముద్రం వంటిది. కాబట్టి ముఖ్యమైన అంశాలపై పరిచయం చేశాను.

ఇప్పటికే కాలాతీతం అయింది కనుక మీరందరూ వారం వారం 'సత్సంగం'లో పాల్గొని, భగవంతుడి ఆశీస్సులుపొందాలని మంగళాశాసనములు చేస్తున్నాను.

అందరికీ మంగళాశీస్సులు.

హరిః ఓం తత్సత్

గురుదేవులు శ్రీరామనవమి ఉత్సవాల సందర్భముగా తెనాలిలో చేసిన అనుగ్రహభాషణం.

గురుసేవగా ఈ ఉపన్యాసమును వ్రాసి పంపినవారు
నెల్లూరు జిల్లా, పొంగూరు శాఖ యోగమిత్రురాలు కుమారి శైలజ.



5

# అంతర్యాగము!

ప్రియమైన యోగమిత్రులకు మంగళాశాసనములు. ఈ రోజు ఈ ఉత్తరాయణ పుణ్యకాలం శ్రీమన్నారాయణ యజ్ఞం సందర్భంగా ముఖ్యమైన పర్వకాలం. రేపు పూర్ణాహుతి. పూర్ణాహుతి అనగా ఈ నాలుగు రోజులుమనం చేసే సాధన అంతా భగవంతునికి సమర్పించే "అంతర్యాగం".

చాలామంది చదువుకున్న పండితులు కూడా అంటే వేదము, సంస్కృతము, కావ్యాలు నేర్చుకుని పురాణాల మీద, భగవద్గీత మీద ఉపన్యాసాలిచ్చే వాళ్ళుకూడా ఈ అంతర్యాగం అనేది ఊహ అనుకుంటారు. అంటే మనస్సులో ఊహించుకొని చేసేది అనుకోవడం చాలామంది చేసే పొరపాటు. బయట ఎట్లా అయితే పుష్పం సమర్పయామి అని పువ్వులు సమర్పిస్తామో, ఆసనం సమర్పయామి అని ఆసనం సమర్పిస్తామో, అలాగే అర్ఘ్యం, పాద్యం, వస్త్రం ఎట్లా సమర్పిస్తామో అట్లాగే అవి లేనప్పుడు గానీ, చేయడానికి వీలుకాని పరిస్థితులలో కానీ మనస్సులో ఊహించుకొని

ఈ పూజ చేయవచ్చు అని భావన. అంతకు మించి బయటవస్తువులు లోపల ఎందుకు ఊహించు·కోవాలో తెలియదు. దీనిని కనుక అంగీకరిస్తే దాని తరువాత మెట్టుకు వెళుతుంది. ఏమిటి తరువాత మెట్టు అంటే బయట వస్తువులు ఉన్నప్పటికీ కొంచెం బద్ధకంగా ఉంటే అంతర్యాగం చేయవచ్చు అని. అందువల్ల పూర్వశాస్త్ర ప్రమాణంతో అంతర్యాగం అనేది ఒక ఊహాజనితం కాదనేది తెలియచెప్పటం ఒక ముఖ్యమైనఆదేశం. పూర్వమే సమయాచారం అని శ్రీవిద్య ఉపాసనలో మరియు ఎరిగివున్న గ్రంథాలలో ఉంది. నిన్న ఎవరో ఒకావిడ చెప్పింది, లలితా సహస్రనామం చేస్తూవుంటుందని, "అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా". లలితా సహస్రనామం చెయ్యవద్దంటారే గురువుగారు, మరి ఆయన నోటికి వచ్చుగదా అని. నీకు పడదు కాబట్టి నిన్ను చేయవద్దన్నాను. ఉల్లిని ఎవరు తినాలంటే "ఎవరు ఉల్లిని జీర్ణించుకోగలరో వారినే తినమని" బాబా చెప్తారు. అంటే **సాధకుడు మొదట్లో భక్తికి వెళ్ళాలి. శక్తికి వెళ్ళరాదు. భక్తిలేని శక్తి క్రింద పడదోస్తుంది.** అది అహంకారం క్రిందకి మారుతుంది. అనుగ్రహంపొంది, చాలామంది అపరి మితమైన ప్రేమను పొంది, అదృష్టాన్ని పొంది, అహంకారం నిర్మూలన కాకపోతే శరణాగతి రాకపోతే ఆ స్థితిని పోగొట్టుకొని పతనం అయ్యేవారిని చాలామందిని చూస్తుంటాం. అందువల్ల ఈశక్తియొక్క ప్రమాదం ఏంటంటే ఈ శక్తి తలమీదకి వస్తే పతనం చేస్తుంది. భారతంలో నహుషుడు అనే చక్రవర్తి మంచి ఉదాహరణ. నహుషుడు అనేవాడు మంచి పుణ్యాత్ముడు, ధార్మికుడు, శరీరంతో స్వర్గానికి వెళ్ళాడు. దేవేంద్ర పదవి ఉన్న ఇంద్రుడు కూడా ఇతడు నాకన్నా గొప్ప వాడు, ధర్మాత్ముడు, సత్యవ్రత పరాయణుడుఅని ఇంద్రపదవి నహుషుడుకి

ఇచ్చాడు. ఈ ఇంద్రపదవికి శరీరంతో వెళ్ళినటు వంటివాడు నహుషుడు. అటువంటి నహుషుడు ఇంద్రపదవికెక్కిన తరువాత తలకెక్కినటువంటి అహంకారంలోపల లేకపోయుంటే, భక్తితో భగవంతుడు ఇచ్చిన అనుగ్రహాన్ని వృద్ధి చేసికొని ఉండేవాడు. ఋతు చక్రవర్తి దానికి వ్యతిరేకమైన ఉదాహరణ. నహుషుడు ఇంద్రపదవికి వెళ్ళిన తరువాత, దేవతలు అందరూ నీ అంత గొప్పవాడు లేడన్నందున, 'నేను' చాలా గొప్పవాడినన్న అహంకారం కలిగింది కలగగానే మనంచాలా గొప్పవాళ్ళం కాబట్టి, గురువుగారు మనల్ని దగ్గరే ఉంచుకున్నారు కాబట్టి మనం జయవిజయులలాగా ద్వారపాలకులం అనుకుంటారు. ద్వారపాలకులు కాబట్టి జయవిజయులకు పట్టినగతే మనకు పడుతుందని గ్రహించకపోతే ప్రమాదం. భాగవతం అంతా ఉదాహరణలు ఇవే. మనలోనే, మన మధ్యనే, మన ఎదురుగుండానే జరిగేదే భాగవతం. అందువల్ల భక్తి, జ్ఞానం, వైరాగ్యం ఉండవలసిన స్వర్గంలో మనకే ఇంతటి పదవి ఇస్తే భగవంతుని దగ్గరకు పోయేవాళ్ళను కూడా ఆపగలమని అనుకొంటారు. **నిజమైన భక్తులను ఆపితే వాళ్ళు పడ్డ బాధ మన పుణ్యాన్ని భస్మంచేస్తుంది**. చేసింది అపుడు కనబడదు టైము కాచుకొని ఉంటుంది. "వ్యాఘ్రీవతిష్ఠతిజరా" అని పెద్దపులి మాదిరిగాకాలం కాచుకొనిఉంటుంది. లోపలకు పోయినవాడు ఎక్కడికి పోతాడు. అర్జెంటు ఏముంది, రాకపోతాడా అని వాకిట దగ్గర పెద్దపులికాచుక కూర్చున్నట్లుగా కాలం కాచుకొని కూర్చొని ఉంటుంది. 'కాలం, ముసలితనం పెద్దపులివలే కాచుక కూర్చుంటుంది'అని. ఒకసారి మాపెదనాన్నగారు వ్రాసారు. ఆయన వయస్సు 80, నా వయస్సు 25. మహా ఉద్దండపండితు డాయన. విశిష్టాద్వైత మహాసభలు పెట్టి ఉద్దండ పండితులతో చర్చలు జరిపేవారాయన. ఆయన తన వృద్ధాప్యంలో నాకు

లెటరు వ్రాస్తూ 'వ్యాఘ్రేవ తిష్ఠతి జరా'. 'నాయనా శ్రీనివాసా! (శ్రీనివాస పరబ్రహ్మం అని నన్ను ముద్దుగా పిలిచేవారు) ముసలి తనం పెద్దపులిలాగా, లోపలికి వెళ్ళినవాడు బయటకు రాకపోతాడా అన్నట్లుగా కాచుక కూర్చొని ఉంది. నాకు ఏదైనా మంత్రాన్ని చెప్పు జపించుకుంటాను' అంటూ వ్రాసారు. మా పెదనాయన గారు శ్రీ రమాకాంతాచార్యులువారు.

ఈవిధంగా పుణ్యం భస్మంకాగానే పాపంచెడుకర్మల ఫలితం పనిచేయడం ప్రారంభిస్తుంది. ఆవిధంగానే నహుషుడు పుణ్యాహంకారం చేత తను ఇంద్రుడు కాబట్టి ఇంద్రుడి భార్యకూడా తనను భర్తగా ఊహించాలని ఆలోచన కలిగింది. దాంతో ఇంద్రుడి భార్య శచీదేవికి కబురు పంపించాడు. తాను కొత్త ఛీఫ్ మినిష్టర్‌ను కాబట్టి పాత ఛీఫ్ మినిష్టర్ భార్య తనకు సేవ చేయాలంటేఎంత అర్థం ఉంటుందో అలాంటి కోరిక కోరాడు నహుషుడు. దాంతో ఆవిడ భయపడిపోయింది. కాని ధర్మశాస్త్రం ప్రకారం ఇంద్రుడి శాసనానికి దేవతలు తలవంచాలి. దానికి తిరుగులేదు. అపుడు శచీదేవి దేవగురువైన బృహస్పతిని శరణు వేడింది. అపుడు ఆయన దివ్యదృష్టితో చూచి వీడికికర్మ అంతా తలమీదికిఎక్కింది కానీ పూర్వపుణ్య బలం వల్ల వాడు ఇంకా ఉన్నాడు కానీ ఈలోగా నీ పుణ్యబలం కాపాడుకో. వీడి సంగతి తరువాత చూద్దాంఅంటూ ఒక ఉపాయం చెప్పాడు. అపుడు ఆమె నహుషుడికి కబురు పెట్టింది నీవు ఇంద్రుడివి, చాలా గొప్పవాడివి కానీ నీయంతటి వాడు రావాల్సిన రీతిగా మా దగ్గరకు వస్తే నిన్ను సేవించడానికి మాకు అభ్యంతరం లేదు, ఏ విధంగా అంటే సప్తమహర్షులు ఒక్కొక్కరు ఉద్దండులు, పెద్దపులిలాంటి వాళ్ళు.ఒక్క పెద్దపులి చాలు మనల్ని మింగటానికి అటువంటిది ఈ వెధవని ఏడుగురు మోసుకురావాలట.

అందులో దుర్వాసుడు, అగస్త్యుడు, వామదేవుడు ఒక్కొక్కరూ భయంకరమైన తపస్శక్తిగలవాళ్ళు, శొంఠికాయలాంటి వాళ్ళు. ఎందుకంటే శొంఠికొమ్ము పైకి ఎండినట్లు కనబడుతుంది. కానీ నోట్లో వేసికొంటే మంటపుడుతుంది. ఈమునులుందరూ తపస్సు చేసి చేసి శొంఠి కొమ్ములాగా తయారయ్యారని చిన్నప్పుడు చెప్పేవాడిని నేను. ఎన్నాళ్ళయినా శొంఠి కొమ్ము కుళ్ళిపోదు అలాగే వీళ్ళు కూడా కల్పాంతస్థాయిలై ఉంటారు. ఇంద్రాది దేవతలందరూ మామూలు కూరగాయలు లాంటివాళ్ళు కొయ్యడానికి వండుకుతింటానికి పనికివస్తారు. తరువాత కుళ్ళిపోతాయి. అందుచేత తపస్సువల్ల లోపల పచ్చిని పోగొట్టుకోవాలి. ఈ పచ్చి అనగా నేను గొప్ప వాడిని, అందరూ నన్ను గౌరవించాలి అనుకోవడమే. అలా అనుకోవడానికి ప్రధానదోషం ఏమిటంటే ముందు తను అనుకోవడమే, నిజంగా మనం గొప్పవాళ్ళమా అని పరిశీలించుకోక పోవడం మూలాన పరిశీలించుకొంటే కాదు అని వ్యతిరేకమైన ఆధారాలు వెంటనే దొరు కుతాయి, మనకు ఇష్టం లేకపోయినాసరే. నహుషుడు సప్తమహర్షులను పిలిచి ఇంక ఆలస్యం దేనికి వెంటనే పల్లకి సిద్ధంచెయ్యమన్నాడు. దానికి మిగతా మహర్షులు వ్యతిరేకించారు. మూర్ఖుడా మహర్షులు పల్లకీ మోయడం ఏమిటని, దానికి అగస్త్యుడు కొంచెం నిదానించండి. ఇది మనకు పనికి వస్తుంది. అంటే ఇది వీడిని సమాధి చేయడానికి పనికి వస్తుంది' అని చెప్పాడు. **ఎవడైతే మహాత్ముడో తగ్గి ఎదుటివాడికి అవకాశం ఇచ్చాడంటే వాడ్ని మింగుతాడని అర్థం. పులి దూకేటప్పుడు ముందు వంగుతుంది, వంగిందంటే కాసేపటికి దూకి ఎదుటివాడిని మింగు తుందని అర్థం. అట్లాగే పొట్టేలు వెనక్కివెళ్ళిందంటే పరిగెత్తుకొచ్చి ఢీ కొడుతుందని**

**అర్థం. అట్లాగే మహాత్ముడు వెంటనే దెబ్బకొట్టకపోతే ఎదుటివాడు నాశనం అవుతాడని అర్థం తుఫాను ముందర ప్రశాంతతలాగా మహాత్ముడికి కోపంవస్తే అది శాంతంగా కనబడు తుంది.** అట్లాగే అగస్త్యుడు మీరుండండి ఈపని మనకు చాలా ఉపయోగ పడుతుంది. మామూలుగా అయితే వీడిపుణ్యం ఒక మన్వంతర కాలం వీడు ఇంద్రుడిగా ఉండడానికి సరిపోతుంది. అప్పటిదాకా వీడెన్ని తప్పుడు పనులుచేసినా మనం మాట్లాడడానికి లేదు. అలాంటిది వీడిపుణ్యం అంతా ఒక రోజులో భస్మంఅయ్యే అవకాశం మనకొచ్చింది. వీడిపీడ వదిలించు కోవచ్చు అన్నాడు. వెంటనే పల్లకీ మోసుకువస్తున్నారు. ఇది అంతఃపురం లోంచి శచీదేవి చూసింది. ఆమె చూస్తూవుండగానే వీడి ముఖంలోంచి తేజస్సు మహర్షుల శరీరాల్లోకి వెళ్ళి మసిబొగ్గులా మారిపోయాడు. మహర్షులందరిలో అగస్త్యుడు పొట్టివాడు. నెమ్మదిగా నడుస్తున్నాడు. తొందర తొందరని అరుస్తున్నాడు నహుషుడు. ఏమిటి ఇంత నిదానంగా వెళ్ళడం అంటే ఈయన పొట్టివాడు నిదానముగా నడుస్తున్నాడుఅనగానే వాడికి అదృష్టం, అహకారం, ఐశ్వర్యం అన్నీ చెడుకర్మగామారి నెత్తికెక్కినటు వంటివాడు నహుషుడు, కాలితో అగస్త్యుడి నెత్తినతన్నాడు, 'సర్పసర్ప' అంటూ అంటే 'నడువునడువు' అంటూ తక్షణమే వాడికిఉన్నటువంటి పుణ్యమంతా భస్మమైంది. వెంటనే పల్లకీ క్రిందకు దించేశారు. ఎందుకు పల్లకీ కిందకు దించారు అనగానే అయిపోయింది నీ ఇంద్రపదవి ఇకదిగు ఇన్నాళ్ళ నుంచీఉన్న నీ పుణ్యము అంతా అగస్త్యుడిని కాలితో తన్నగానే పూర్తయి పోయింది కనుక నీ ఇంద్ర పదవి పోయింది. సర్ప, సర్ప అన్నావు కాబట్టి సర్పమైపడుండు అని శాపమిచ్చాడు. దానికి వెంటనే వాడు భయపడి

పోయాడు అదృష్టం ఉన్నప్పుడు తెలియదుగానీ, అది అయిపోయిన తరువాత భయమేస్తుంది. ఇపుడు ఏడుస్తాడు నన్ను ఎవరన్నా రక్షిస్తారా అని. ఎవరు రక్షిస్తారు వీడిని అందరికీ ఒళ్ళుమండి ఉంది వీడి మీద అందుకని నహుషుడు పెద్ద సర్పమై క్రిందపడ్డాడు. కొన్ని యోజనాల పొడవుండే కొండచిలువై కిందబడ్డాడు. పడిపోతున్నప్పుడు తెలిసింది వీడికి. ఇంద్రుడు ఏమిటి ఎవరైనా సరే ఉండవలసిన స్థితిలో ఉంటే బావుండేది. పైకి పోవడమెందుకు, క్రిందపడడమెందుకు. ఫలితంగా మానవ జన్మకూడా కాకుండా అతి తామసమైన శరీరం కదలలేని, బుద్ధికూడా పనిచేయని తమోగుణ ప్రధానమైన జంతుజన్మ లభించింది. కానీ తను నహుషుడు అన్న జ్ఞానం కలిగింది. అగస్త్యుడు అనుగ్రహించాడు. ఎందుకంటే తాను నిజంగా కొండచిలువననే భావనతో దారినపోయేవాళ్ళకి హానిచేసి ఇంకా ఎక్కువ పాపం సంపాయించుకుంటాడని, అట్లాకాకుండా తనునహుషుడిని, తను ఎలాఉన్నాను, ఎలా తయారయ్యాను అనే భావన కలిగించడానికి అగస్త్యుడు అనుగ్రహించాడు. నీ మనస్సులో కొన్ని ధర్మ సందేహాలున్నాయి అవి ధర్మరాజు వచ్చి నివృత్తి చేసేవరకు పాముగా పడివుండమన్నాడు. ఆ తరువాత కథలో భీముడు వేటాడుతూ అడవిలోకి రాగానేవాడిని చుట్టివేస్తాడు నహుషుడు. భీముడు ఆశ్చర్యపోతాడు. తననేమిటి!? ఒక పాము ఇంతబలంగా చుట్టెయ్యడమేమిటని. భీముడు ఎంతకు రాకపోయే సరికి ఆందోళన పడుతుంటాడు ధర్మరాజు. ఇంతలో ధౌమ్యుడు ఆలోచించి ఆకాశంలో గ్రహస్థితినిచూసి ఏవో చెడు శకునాలు కనబడుతున్నాయి. అంటే శకునాలను బట్టి ఆకాశంలో గ్రహస్థితిని చూసి రామాయణ, మహాభారతాలలో చాలా చోట్ల జరగబోయే భవిష్యత్తును ఊహించియున్నారు. కాసేపటికి అక్కడికి

చేరుకున్న ధర్మరాజు ఆశ్చర్యపోతాడు పదివేల ఏనుగుల బలంగల భీముడు ఒక సర్పం చేతిలో కట్టుబడి ఉండడం చూసి. రక్షించమని అడగటానికి భీముడు సిగ్గుపడతాడు. ఎందుకంటే అప్పటిదాకా పాండవులకు ఏకష్టం వచ్చినా తనే కాపాడుతున్నానన్న అహం ఉండేది. అపుడు ధర్మజ్ఞానంగల ధర్మరాజు ఆలోచించి ఆ సర్పాన్ని చూచి 'ఓ మహాత్మా ! మీరు చాలా గొప్పవారై ఉంటారు. ఎందుకంటే ఎంతో బలవంతుడైన భీముడ్ని ఎలుక లాగా చుట్టివేశారు కాబట్టి మీరు చాలా గొప్పవారై ఉండి ఏదో దుర్నిమిత్తం కారణంగా ఇలా అయ్యారు' అనగానే వెంటనే నహుషుడికి పశ్చాత్తాపం ప్రారంభమైంది. అపుడు నహుషుడు తన గాథను ధర్మరాజుకు వివరించడం నహుషుడు అడిగిన ధర్మ సందేహాలకు ధర్మరాజు సమాధానం ఇవ్వడం. తద్వారా నహుషుడికి శాపవిమోచనం కలిగి సర్పత్వం పోవడం ఇదంతా తర్వాత కథ. తర్వాత నహుషుడు ధర్మరాజుతో నీవలన శాపవిమో చనం కలిగింది. కనుక నీకొక మాట చెపుతానువిను. **'ఎంతపదవి వచ్చినా, అధికారం వచ్చినా, పుణ్యం వచ్చి ఎంత స్థాయికి ఎదిగినా బ్రాహ్మణుల పట్ల సాధు సత్పురుషుల పట్ల, స్త్రీలపట్ల, ఋషులపట్ల, దేవతల పట్ల, పూచిక పుల్లలాగా వినయ విధేయతలు కలిగివుండు. అదే నీకు బలం** అన్నాడు. అంటే నహుషుడికి బాగా అర్థమైందన్న మాట ఇక మళ్ళీ వాళ్ళ జోలికి వెళ్ళడు. ఇదే విషయం జయవిజయుల విషయంలో నిజమైంది.ఈ రెండు ఉదాహరణలు ఎందుకంటే **అదృష్టం కలిగి వున్నప్పుడు అణు మాత్రంగానైనా అహం లేకుంటే కష్టములు కలిగినా అవి మనకు అదృష్టాలే అవుతాయి.** ఇది రాముడి యొక్క చరిత్రలో పట్టాభిషేకం పొందాల్సిన రాముడు వనవాసంవెళ్ళడం తరువాత సీతాపహరణం తరువాత

తండ్రి మరణించడము, ఈయనకు సహాయం చేయబోయి జటాయువు మరణించడం ఈ విధంగా ఎన్ని కష్టాలు కలిగినా చివరకు పట్టాభిషేకం చేసికొని పట్టాభిరాముడై చక్రవర్తి అయినాడు. అంటే **లోపల అహంకారం లేనివాడికే బయటగ్రహస్థితి వలనగాని, కాలంవలనగాని, కర్మ వలనగాని, చెడుకలిగినా, వాటిని జీర్ణించుకొని మంచిగా మార్చుకో గల్గుతాడు. అట్లాగే లోపల అహంకారం వుంటే ఎంత మంచి కలిగినా, అదృష్టం కలిగినా, తింటే విషమై అదే వాడికి దురదృష్టంగా మారి వాడిని పతనం చేస్తుంది.** ఈ జయవిజయులు, నహుషుడు ఇలాంటి కథలవల్ల భగవంతుని యందు భక్తిగలిగి, వినయ విధేయతలు కలిగి, భగవంతుని వలన కలిగిన అనుగ్రహానికి కృతజ్ఞతాభావంతో సేవచేసేవారికి పరమార్థం అరచేతిలో ఉంటుంది. అందువల్ల పైకి కనబడే పుణ్యం చాలా తేలిక. పదిమందికి అన్నదానం చేస్తే మహారాజై పుడతాడు. దేవాలయం కట్టిస్తే చక్రవర్తిఅయి పుడతాడు. కాని పుణ్యంవలన వచ్చే సంపదతో అహం తలకెక్కితే ఇది ఇంతకన్నా పెద్దపాపంగా దారితీస్తుంది. అందుచేత పుణ్యం చేత అపకారం జరగకుండా ఉండాలంటే ఏం చేయాలి?తపస్సుచేత ఆత్మ పరిశుద్ధి చేయాలి. ఇదే భాగవత రహస్యం. అనేక కథలుమనం భాగవతంలో చదువుతాం,కాని వాటి వెనుక మూలసూత్రాన్ని గ్రహించం. పుణ్యాత్ములైన వాళ్ళు కష్టబడటం పాపాత్ములైనవారు సుఖపడడం మహత్తరమైన అదృష్టం గలవాళ్ళు పతనం కావడం దురదృష్టంగల వాళ్ళు పైకిరావడం ఇలా ఎన్నో కథలు భాగవతంలో మనకు కనిపిస్తాయి. ఇలా కథల్లో పడి కొట్టుకు పోకుండా అన్ని కథల్లోని కామన్ పాయింట్ తీసుకుంటే **లోపల వ్యక్తిత్వం పరిశుద్ధి కానిదే కేవలం భౌతికమైన అదృష్టం ఉపయోగపడదు.**ఆ అదృష్టంచేత

కలిగే అహంకారం వలన ఆ అదృష్టాన్ని దురదృష్టంగా మార్చుకునే పరిస్థితులు మనకు కని పిస్తాయి. అందువల్ల పుణ్యపాపములేవీ మనకు ఉపయోగపడవు. ఒకామె అడిగింది చాలాపుణ్యం చేస్తే మోక్షం రాదా అని పుణ్యం చేస్తే డబ్బు వస్తుంది. అధికారం వస్తుంది. అంతేకానీ మోక్షం రాదు. మరి మోక్షంఎట్లా వస్తుంది. ఇది ముఖ్యమైనసూత్రము. ఎందువలనంటే "క్షీణేపుణ్యే మర్త్య లోకంవిశంతి" పుణ్యంవలన ఇంద్రాదిపదవులు వస్తున్నాయి. డబ్బుఖర్చు అయినట్లుపుణ్యం ఖర్చుకాగానే మళ్ళీ భూలోకానికి వచ్చి పడుతున్నాడు. నిన్న చెప్పినట్లుగా భారతదేశం కర్మభూమి. ఇక్కడ తపస్సు చేస్తే కర్మక్షయం చేసికోవచ్చు. పుణ్యంచేసినవాడు ఆ పుణ్యాన్నిడబ్బులాగా ఖర్చు పెట్టుకొంటూ కావలసినవి అనుభవిస్తూ పాపాన్ని సంపాదించుకోవచ్చు. అందువలన ఈ సుకృత, దుష్కృతాలు విడిచిపెట్టాలి. ఇది యోగం వల్లనో, తపస్సువల్లనో, ఆత్మ పరిశుద్ధివల్లనో, శరణాగతి వల్లనో సాధ్యపడుతుంది.ఈ లోపల పరిశుద్ధి ఎట్లా వస్తుంది అంటే అంతర్యాగం వల్ల వస్తుంది. అంతర్యాగం కోసం ఇదంతా చెప్పవలసి వచ్చింది. అంతర్యాగం యొక్క ప్రాముఖ్యం ఏమిటి? అంటే లోపల అంతః శుద్ధి కలిగించే ప్రక్రియ అంతర్యాగం. బహిర్యాగం ఒక్కటే చేయడంవల్ల పుణ్యంమాత్రం పెరిగి అన్నిసుఖాలు అనుభవిస్తూ అహంకారం పోగొట్టుకోక పోతే పతనమవుతారు. అందువల్ల ఋషులు ఏం చెప్పారు అంటే అంతర్యాగం, బహిర్యాగం రెండూ చేసిన వాళ్ళు అదృష్టవంతులు. అపుడు ఈ పుణ్యం వల్ల చక్కటి జన్మ, మంచి రూపం, చక్కటి తల్లిదండ్రులు, సుఖమైన జీవితం కలుగుతాయి. వీటివల్ల విర్ర వీగకుండా పూర్వ తపస్సువల్ల జ్ఞానం, వివేకం, వైరాగ్యం, భగవత్భక్తికలిగి

లోక హితార్థమై పనిచేసేవాళ్ళుగా జన్మిస్తారు. పుణ్యం చేసినవారికి సాధనలో మోక్షం రాకపోతే ఏం జరుగు తుంది?అనిఅడిగితే అర్జునుడు, అందుకు కృష్ణుడు 'ఒక జన్మలో మోక్షం రాకపోయినప్పటికీ యోగుల కుటుంబంలో జన్మిస్తాడు. మంచి జ్ఞానులు, మంచి భక్తులు అయినవాళ్ళ వంశంలో జన్మిస్తాడు. నిజమైన భక్తి, జ్ఞానం, వైరాగ్యంగల తల్లిదండ్రులకు జన్మిస్తాడు. అందువల్లవాడు కూర్చుంటే శరీరంలో కామక్రోధాలేవీ ఏడిపించకుండా పరిశుద్ధమైన మనస్సు కలుగుతుంది.'

'శుద్ధే అంతః కరణేతస్య' వ్యాసుల వారు చెప్పింది ఏమిటంటే బయట జన్మ ఎంత నికృష్ట జన్మ అయినా భయపడనక్కర్లేదు. జంతుజన్మ అయినా, పిశాచజన్మ అయినా, రాక్షసుడైనా, ఏదైనా బయటజన్మ గురించి భయపడనక్కర్లేదు. ఎందుకంటే బయట ఉండేటటువంటి అదృష్ట, దురదృష్టాలు యోగిని ఏమీ చేయలేవు. లోపల అంతర్యాగం అంతఃశుద్ధిని కలిగిస్తుంది. అంతఃశుద్ధిలేని బహిర్యాగం కేవలం పుణ్యాన్ని ఇస్తుంది. ఈ **పుణ్యం, పాపం రెండూ నాశనమయితేనే యోగికి మోక్షం లభిస్తుంది.** కేవలం పుణ్యం, పాపం నాశనం చేసి లోపల అంతః పరిశుద్ధి కాకపోతే జ్ఞానం ఎట్లా వస్తుంది. జ్ఞానం రాకపోతే వైరాగ్యం ఎట్లా కలుగుతుంది. వైరాగ్యం లేకపోతే వివేకం ఎట్లా కలుగుతుంది. వివేకం అంటే ఏది నిజమైనది. ఏది అసత్యమైనది తెలుసుకొనేటువంటి జ్ఞానం. ప్రపంచంలో అనేకం చూస్తాం మన గొప్ప గొప్ప పదవులు, గొప్పవాళ్ళతో సాంగత్యం, డబ్బు, అధికారం ఇవన్నీ అశాశ్వతమైనవి అనే భావంకలిగివుండటంవివేకం. శంకర భగవత్పాదులు ఏమన్నారంటే వివేకం అంటే కేవలం తెలివి తేటలు కాదు. పదిరూపాయలు తీసుకొని, ఇరవైరూపాయలు మోసం చేసి ముప్పై

రూపాయలు సంపాదించే వెధవ తెలివితేటలు కాదు. నిత్యానిత్య వివేకం అంటే వాస్తవంగా నిలిచేదిఏది? పోయేది ఏది? పోయే దాని గురించి శ్రమపడటం, మిగిలేదానిగురించి ఉపేక్షించడం తెలివితక్కువ. ఈ శరీరంగానీ, ఈ బంధువులుగానీ, ఈ స్నేహితులుగానీ, నీ చుట్టూచేరి నీ మెప్పుకోసం చప్పట్లు కొట్టే వెధవలు కానీ, శాశ్వతంకాదు. నీవు పతన మయ్యాకా వాళ్ళే సంతోషిస్తారు ఇవి అనిత్యం అంటే తాత్కాలికం అన్నమాట. ఇవన్నీ, సమ స్పర్శ భోగములుగా కొట్టిపడేశాడు శ్రీకృష్ణుడు. స్పర్శవల్ల మనకేదో బావుందని పిస్తుంది. చలికాలం వేడి నీళ్ళు పోసుకుంటే కొంచెం హాయిగా ఉంటుంది. అదే వేసవికాలం అయితే వీపు మంట పుడుతుంది. అంటే అప్పుడు సుఖంగా ఉన్నది. కాసేపటికి దుఃఖంగా మారుతుంది. ఇప్పుడు దుఃఖంగాఉన్నది కాసేపటికిసుఖంగా మారుతుంది. బుద్ధుడిని అడిగారట సుఖం అంటే ఏమిటి? దుఃఖం అంటే ఏమిటి ? వాస్తవానికి సుఖ, దుఃఖాలనేవి లేనేలేవు. మనం ఏ స్థితిలో ఉంటామో దానినుంచి మార్పేమనకు సుఖంగా అనిపిస్తుంది. ఇది మనస్సు మనకు చెప్పేమాయ. నిజానికి సుఖము, దుఃఖము లేవు. ఎట్లా చెపుతావు సుఖదుః ఖాలు లేవని అంటే ఆయన చెప్పాడు. నిద్రిస్తున్న వాడిని చూడండి హాయిగా పడుకుని ఉంటాడు. కుడివైపు తిరిగి పడుకోనుంటాడు. అపుడు హాయిగా అనిపిస్తుంది. కొద్దిసేపటికి అది నెప్పిపుట్టగా, ఎడమవైపుకు తిరుగుతాడు. మళ్ళీ కొద్ది సేపటికి కుడివైపు తిరుగుతాడు. ఇపుడైనా హాయిగా ఉంటాడా అనుకుంటే మళ్ళీ బోర్లా తిరిగి పడుకుంటాడు. అంటే ఏ స్థితి మనకులేదో అది సుఖం అనుకుంటాం. అందువల్ల కుడివైపు తిరిగిన వాడికి ఎడమవైపు సుఖము. ఎడమ వైపు తిరిగిన వాడికి కుడివైపు సుఖము. అందువల్ల

మార్పే సుఖం అంటాడు బుద్ధుడు. ఇప్పుడు ఈ ఉపన్యాసం వింటున్నప్పుడు ఈ విధంగా కూర్చున్న మీరు ఇదే బాధ అనిపించి అటువైపు తిరగడం, ఇటువైపు తిరగడం చేస్తారు. అంటే శరీరంలో చైతన్యం, చలనం, మార్పు ఏడిపిస్తుందన్న మాట. అంటే వాడిని భ్రష్టు పట్టించేవి బీజభూతాలై మన శరీరంలో, మనస్సులో సంస్కారంగా ఉంటాయి. అవి ఒక స్థితిలో మనల్ని స్థిమితంగా ఉండనీయవు. అందువల్ల యోగికి మొట్టమొదట కావాల్సింది ఆసనసిద్ధి అంటే ఏ పొజిషన్‌లో కూర్చున్నా ఎంతసేపైనా విగ్రహంలాగా కూర్చోగలగాలి. అంటే శరీరము స్పర్శవల్ల కలిగే అసౌకర్యంగాని, సుఖంగాని, రెండింటికి అతీతంగా ఉండాలి. అందువల్ల ఈ సుఖములన్నియూ స్పర్శ సంబంధ మైనవి. శరీరానికి సెంటు గానీ, అత్తరుగానీ పూసుకున్నప్పుడు చల్లగా హాయిగా ఉంటుంది. అలాగే హాట్‌వాటర్‌లో స్నానం చేసినప్పుడు హాయిగా ఉంటుంది. అలాగే తల్లి ఒడిలో వెచ్చగా ఉంటుంది. ఈ సుఖములన్నియూ స్పర్శ సంబంధమైనవిగా శ్రీకృష్ణుడు వర్ణించాడు. ఇవన్నీ శరీరంవరకే ఉంటాయిగానీ ఆత్మను చేరలేవు. నిజమైన సుఖము దేనికి చెప్పబడింది అంటే "సుఖమాత్యాంతిగమ్యం తత్త్వ బుద్ధి గ్రాహ్యా మతీంద్రియం" అత్యంతమైన సుఖం చేలా లోతుగా ముళ్ళుగుచ్చుకున్నట్లుగా హృదయంలోకి అందులోంచి మనస్సులోకి, బుద్ధిలోకి సరాసరి అంతరాత్మలోకి వెళ్ళి హృదయాన్ని మర్చిపోయేటంత సుఖాన్ని కలిగించేది. అది ఆత్మ సుఖం ఒకటే మిగతా స్పర్శవల్ల ఏర్పడే సుఖాలన్నీ, దుఃఖాన్ని కలిగిస్తాయి. ఈ స్పర్శసుఖాలకు ఏమిటయ్యా తప్పు ? ఏం సుఖం అనుభవించకూడదా అంటే చక్కగా పూలదండ వేశారు. చాలాసుఖంగా ఉంది. కాసేపటికి చెమటపోసి దురద పుట్టి, చీమలు పట్టి, చెవుల్లోకి దూరి నానా ఇబ్బంది

పెడతాయి. అంటే క్షణకాలం క్రితం ఏదిబావుందో అదేఇప్పుడు కొండ చిలువలా కనబడు తుంది. అందువల్ల ఈ సుఖాలన్నీ అంటక కౌపీనము ధరించినవాడే అదృష్టవంతుడు అంటారు భగవత్పాదులు.

'కౌపీనవంతః ఖలుభాగ్యవంతః' అంటే ఏ గొడవ లేకుండా గోచీ పెట్టుకొని కూర్చునేవాడే అదృష్టవంతుడు. అంటే వీరికి ఏ గొడవ ఉండదు. ఏ వస్తువుతో సంబంధం ఉండదు. ఉండేది ఉంటుంది, పోయేది పోతుంది. చొక్కా ఉంటే ఎవరన్నా తీసుకపోతారేమో, ప్యాంటు వేసుకుంటే ఎవరన్నా లాక్కు పోతారేమో అనే బాధ లేకుండా గోచీ పెట్టుకు కూర్చుంటే ఏ బాధ ఉండదు. అలాంటి స్థితిలో ఉండేవాడు శుకమహర్షి. కేవలం దిగంబర స్వరూపంలో ఉన్నా ఆయన భ్రూమధ్య దృష్టితో ఉండేవాడు. అంటే అపుడే పుట్టిన పిల్లవాడివలే ఉండేవాడు. వాడిని చూస్తే ఎటువంటి చెడు భావం కలగదు. అట్లాగే ఈ శుకబ్రహ్మ దిగంబరుడైనప్పటికి బ్రహ్మ స్వరూపుడై ఉండేవాడు. ఇది ఎంతవరకు ఉందంటే కొందరు స్త్రీలు (అప్సరసలు) స్నానం చేస్తున్నారు. ఈయన భ్రూమధ్య దృష్టిలో ఉండి వాళ్ళ మధ్యనుంచి నడచి వెళ్ళిపోతున్నాడు. వాళ్ళు ఆయనను చూశారు. మంచి నడి వయస్సులో ఉండేవాడు, చాలాఅందగాడు. బట్టలు లేకుండా దిగంబరంగా వెళుతున్నాడు. వారు తమమధ్య ఒక స్త్రీ దిగంబరంగా వెళుతున్నట్లుగా భావించారు. కానీ ఎటువంటి భావన కలుగలేదు. శుకుడు అలాగే బయటకు చూడకుండా తన లోపల చూసుకుంటూ సమాధిస్థితిలో వెళ్తున్నాడు. కొడుకుకోసం వెనుకనే వస్తున్న వ్యాసమహర్షిని చూడగానే స్త్రీలందరూ గబగబ గట్టుకు వెళ్ళి బట్టలుధరించి ప్రక్కకు వెళ్ళారు. అప్పుడు వ్యాసమహర్షి ఆశ్చర్యపోయి నేను ముసలివాడిని మూడువందల సంవత్సరాలు పైబడిన

వాడిని నన్ను చూచి మీరు సిగ్గుపడి బట్టలు కట్టుకుంటున్నారు కానీ, నా కొడుకు నడివయస్సు వాడు వాడిని చూసి మీరెందుకు సిగ్గుపడట్లేదు.ఏమిటీ విచిత్రం అని అడగ్గానే వారు ఆయనకు నమస్కారం పెట్టి "మమ్మల్ని క్షమించాలి. ఆయన కుర్రవాడైనప్పటికీ ఆయన ఇహలోక దృష్టిలో లేడు. అందువల్ల ఆయన్ని చూడగానే ఆయన ఒక పరబ్రహ్మ స్వరూపంగా తోచింది. ఆయనొక మనిషి అనిగానీ ఒక శరీరం అనిగానీ ఒక యువకుడు అనే భావన కలగలేదు. మీరు పెద్దవారు. పండితులు కానీ అంతటి స్థితి పసిపిల్లవాడికి ఉండే స్థితి మాకు తోచలేదు" అన్నారు. సామాన్యంగా స్త్రీ తనకు బట్టలు లేకుండా ఉంటే సిగ్గుపడుతుంది. లేదా ఇంకొకరికి లేకుండా ఉన్నా సిగ్గుపడుతుంది. కానీ తను స్నానం చేస్తూవున్నప్పుడు పసిపిల్లవాడు ఏడిస్తే వెంటనే వెళ్ళి ఎత్తుకుంటుంది. అపుడు వాడిని చూసి సిగ్గుపడదు. తనను చూసి సిగ్గు పడదు. అలాంటి స్థితిలో ఉన్నాడు శుకబ్రహ్మ. ఇది దేనివల్ల చెప్పబడింది అంటే అంతఃపరిశుద్ధి అంటే అలా నిలిచేటటువంటి కేవల భ్రూమధ్యస్థితి వంటి యోగస్థితి ఒకటి ఉన్నది. అంటే ఏపని చేస్తున్నా ఎవరితో మాట్లాడు తున్నా 'శృణ్వన్' అంటే వింటూ 'పశ్యన్' అంటే చూస్తూ 'ఉన్మిషన్ నిమిషన్ నపి' ఉన్మేషనిమిషేలు కనురెప్ప పాటులో చేస్తూ ఏ పనులు చేస్తున్నాకూడా బ్రహ్మయందు మనస్సు లగ్నంచేసే స్థితి గురించి చెప్పాడు. శ్రీకృష్ణుడు అది శుకుడికి తెలుసు. శ్రీకృష్ణునికి తెలుసు. అంతేకానీ మామూలు వాళ్ళు అందుకోలేరు. అంతఃపరిశుద్ధి అంటే మామూలుగా సంకీర్తన చేసి, విష్ణుసహస్ర నామం చేసి కాసేపు బాధలు మర్చిపోయిపడే సంతోషంకాకుండా అసలు ఇహలోక స్పర్శలేని హిమాలయాల వంటి మేఘాల స్థితిలో మనస్సు ఉండాలి. 'అద్వైతయే విచితు మానస రాజహంస'

రాజహంస లాంటి నా మనస్సు ఇవాళే బ్రహ్మానందు ప్రవేశించు గాక అనుకున్నాడట.రాజహంస 'బ్రహ్మణితేశ్చితాః మానస సరోవరంలోని ఋరదనీళ్ళు తాగదు. పవిత్రమైన గంగాజలం లాంటివి తాగుతుంది. ఈ పరమహంసస్థితిలో ఉన్నాడు శుకబ్రహ్మ. పరమహంసస్థితి అని ఎందుక న్నారంటే 'హంసశ్చ పరమ హంసశ్చ' అని యోగంలో రెండు స్థితులున్నాయి. హంస స్థితి, పరమహంస స్థితి. హంస స్థితి అంటే హంసకి నీళ్ళు, పాలు కలిపి పెడితే పాలనుమాత్రమే త్రాగి నీటిని విడగొడుతుంది. అలాగే యోగి హంసస్థితిలో ఉండేవాడు. ఈ ప్రపంచంలో చూసేవి, వినేవి వదిలేయాలి. నావి ప్రపంచంలో ఉండొచ్చు కానీ నీలో ఈ ప్రపంచం ఉండరాదు. నీవెప్పుడు భగవంతునియందే బ్రహ్మనిష్ఠుడై ఉండాలి.'తస్మాత్ బ్రహ్మ స్థితేశ్చితిః' బ్రహ్మమయునియందే ఉన్నాడట పరమాత్ముడు. ఎందువల్ల? ప్రపంచమంతా బ్రహ్మమయంఅని ప్రతివాడు వాగుతున్నాడు కానీ చివరికి భోజనం దగ్గరకి పోయేటప్పటికి ఉప్పు ఎక్కువైన కూర, తియ్యగా ఉండే పాయసం వడ్డిస్తే కూర ప్రక్కకు నెట్టి పాయసం తింటున్నాడు. కానీ 'తస్మాత్ బ్రహ్మణితేశ్చితాః' అంటూ రెండూ కలిపి తినట్లేదు. అంటే మనది ఆచరణాద్వైతం కాదు. కానీ వాళ్ళు అట్లా కాదు. 'నిర్దోషం హితమం బ్రహ్మ' అంటే బ్రహ్మ అనేది ఎట్లా చెప్పబడింది. సర్వ ప్రపంచంలోనూ ఎక్కడా దోషం అనేటటువంటిది ఎక్కడా ఎరుకనే లేనటువంటి స్థితి. అందువల్ల మంచి చెడులతో సంబంధంలేని ప్రపం చంలో వాళ్ళుఉండి వృషభావతార భాగవతం చదివితే అర్థం అవుతుంది. ఈ బ్యాక్‌గ్రౌండ్ లేకుండా అది చదివితే అసహ్యించుకొంటారు. అందులో వృషభుడనేవాడు పరమహంస స్థితిని పొంది ఉన్నాడు. విష్ణు అవతారంగా కృతయుగంలో. ఆయన

నిద్రావస్థలో రోజులతరబడి నిద్రపోతూ ఉండేవాడు. స్నానంఉండేది కాదు. ఈగలు ముసురుకొని ఉండేవి. సమాధిస్థితిలో ఉండేవాడు. మల మూత్ర విసర్జన చేసి అందులోనే పొర్లుతూ ఉండేవాడు. అందరూ 'ఛీ'అని ఛీదరించుకొంటే సుగంధ పరిమళాలు వెదజల్లేవి మల మూత్రములు. సిద్ధ స్థితిలో ఉన్నాడాయన. అట్లాగే సొరకాయల స్వామి అని ఒకాయన ఉన్నారు. తిరుపతి దగ్గర సమాధి ఉంది. నేను వెతుక్కుని వెళ్ళి మరీ చూసి వచ్చాను. చాలామంది తిరుపతి వెళ్తారు కానీ చూడరు. దాని చుట్టూ కిళ్ళీ కొట్టులు అన్నీ పెట్టేశారు. ఎందుకంటే ప్రతివారు వచ్చి దానిని పాడు చేయకుండా నాబోటి వాళ్ళ కోసం రక్షించిపెట్టారు. ఈ సొరకాయల స్వామి దిగంబర మహానుభావుడు. వంటిపై బట్టలు ఏమీ ఉండేవి కావు. ఒక కావడి వేసుకొని తిరిగేవాడు చిత్తూరుకి, కాణీపాకానికి మధ్యన. ఈ కావడికి సొరకాయ బుర్రలు ఖాళీవి తగిలించుకొని ఒక దాంట్లో ఏమో మూత్రం పోసుకొని, మరొక దాంట్లో మలవిసర్జన చేసికొని అవి మోసుకొని పోతుండేవాడు. ఇది తెలిసి ప్రజలు దూరాన్నుంచే తప్పించుకు పోయేవారు. ఆయనకి కావలసింది అదే. సమాధి స్థితిలో ఉండేవారికి ఈ వెధవలంతా చేరి పాదనమస్కారాలు చేస్తూ పబ్లిసిటీ ఇస్తారేమోనని ఆయన ఉపాయం ఆయనది. ఎవడో భక్తుడు ధైర్యంచేసి ఏమిటీ సొరకాయలస్వామీ ఏమిటి పట్టుకుపోతున్నావని వెటకారంగా అడిగాడు. ఇవి తిరుపతి స్వామివారి తీర్థం, ప్రసాదం చందనం అన్నారట స్వామి. ఛఛ వీడెవడో దుర్మార్గుడులాగా ఉన్నాడు. మల మూత్రాలు వేసుకొని స్వామివారి ప్రసాదం అంటున్నావు. కళ్ళుపోతాయ్ అన్నాడట. నీకే కళ్ళు పోతాయ్, కావాలంటే చూడుమని సొరకాయ బుర్రలు చూపారు స్వామి. వాడికి ఒళ్ళు మండి ఒక్కసారిగా

వాటినిలాగగనే అవి క్రిందపడి అందులోంచి సుగంధపరిమళాలు వెద జల్లుతూ స్వామివారి తీర్థం, ప్రసాదం వచ్చాయి. ఆశ్చర్యపోయి క్షమాపణ కోరాడు వాడు. ఈ విధంగా 20 సంవత్సరాలు అక్కడే  చిత్తూరు జిల్లాలో తిరిగేవాడు స్వామి. ఒక రోజు ఎవరో అడిగారట స్వామిని. ఏమయ్యా! నీవు తిరుపతి వేంకటేశ్వర స్వామిని చూశావా అని. నవ్వుతూ ఉండేవాడు. కానీ ఏమీ చెప్పలేదు. కానీ ఒకసారి మాత్రం బ్రహ్మోత్సవాల సందర్భంగా నేరుగా లోపలికి దిగంబరంగా సొరకాయ బుర్రలతో సహా లోపలికి వెళ్ళి పోయారు స్వామి. ఎవరూ అడ్డుపెట్టలేదు. సరాసరి గర్భగుడిలోకి వెళ్ళి మాయ మయ్యాడు. చాలా గట్టివాళ్ళు ఉన్నారు ఆంధ్రలో. కానీ వాళ్ళని పట్టుకోవటం చేతకావాలి. తర్వాత చాలా కష్టపడి వెతికితే ఆయన ఫోటో ఒకటి దొరికింది. తర్వాత ఆశ్చర్యపోయాను. ఎందుకంటే స్వామిలోకి వెళ్ళి లీనమైపోయా రీయన. కానీ, ఇక్కడేమో సొరకాయల స్వామి సమాధి అంటున్నారు. ఇక్కడ ఎలా వచ్చిందీ అని. తర్వాత పాతవారిని మూడు తరాల వారిని విచారించగా తొండవాడ అనే ఊరులో ఒక రెడ్డిగారున్నారు. ఆయనకు మహలక్ష్మిలాంటి సౌందర్యంగల కూతురుంది. నేను వాళ్ళని కలసి మాట్లాడితే వారు చెప్పారు. ఆమె తల్లిదండ్రులు చాలాకాలంనుండి సొరకాయల స్వామిని పూజిస్తు న్నారట. అందువల్లవారికి అష్టైశ్వర్యాలుకలిగి కోటీశ్వరులైఉన్నారు. నిజమే. సొరకాయల స్వామి కొండమీదకి వెళ్ళి లీనమై పోయినది నిజమే. ఆయన కోసం తపించే భక్తులు కొందరు గుడికి ఎదురుగా కూర్చుని ఆయన కోసం విలపించారు. మూడోసారి పిలవగానే 'ఓ' అంటూ లోపలినుండి బయటకు వచ్చారు. స్వామివారు పట్టుకొని ఆపేశారు. అందుకని ఉండిపోయాను అన్నారట. తర్వాత మామూలుగా సొరకాయబుర్రలు మోసికొంటూ తిరిగే

వారు. చాలా కాలం తర్వాత ఇక్కడ బాగాలేదు అంటూ ఒకచోటు చూపించి అక్కడ త్రవ్వమన్నారట. అందులో కూర్చుని మూయ మన్నారట. అంతే సమాధి చెందారు స్వామి. ఆ సమాధి చుట్టూ కిళ్ళీ కొట్లు కట్టేశారు. బస్సులు పొయ్యేచోట వచ్చేచోట ట్రాఫిక్ ఐలాండ్ ఉంటుందే అక్కడ. ఎవరికీ కనబడ కుండా. ఆ తర్వాత కిళ్ళీకొట్టువాడి దగ్గర ఫోటో ఉంటేవాడు నాకు ఇచ్చేశాడు. ఆ విధంగా సనకసనందనాదులు అంతటి పరిశుద్ధిలో ఉన్నారు. వీళ్ళకి మలమూత్రాలయందు కానీ, స్వామివారి తీర్థప్రసాదముల యందు కానీ సమదృష్టి కలిగినవారు. నిర్దోషం అంటే వీరికి దాంట్లో దోషంగానీ, మంచిగాని ఎక్కడా కనబడదు. 'సమం సర్వత్ర' అన్నింటిలోనూ సమదృష్టి కలిగి ఉండేవారు. ఎవరైతే ఈ సమదృష్టితో చూస్తారో వాళ్ళు బ్రహ్మస్థితిలో ఉండేవారు. ఈ అంతఃపరిశుద్ధి శుకబ్రహ్మ, మనకాలంలో సొరకాయల స్వామి, ఇంకొకస్వామి ఉన్నారు. ఆయన గురించి మళ్ళీ చెపుతాను. ఎందుకు చెపుతున్నాను అంటే ఈ అంతఃపరిశుద్ధి అనేది చిన్నవిషయం కాదు. మనస్సులోని ఆలోచనలను పోగొట్టు కోవడం అంతఃపరిశుద్ధా? అడిగాడు ఒకడు. మనస్సులోని ఆలోచనలు పోగొట్టుకోవడం కాదు. మనసే పోగొట్టు కోవాలి. యోగసూత్రాలలో మనోనాశనంఅనిఉంది అంటే మనసే నశించాలి. అపుడు ఇంద్రియాలకు పైన ఉంటుంది మనస్సు. మనస్సుకుపైన బుద్ధి ఉంటుంది. ఈ బుద్ధి అంటే ఏమిటో మనస్సు అంటే ఏమిటో వీటికి తేడా ఏమిటో తెలియదు. ఎందుకని, మన మనస్సుని మనం గమనించం. 'నిత్యజీవితంలో యోగసాధన' లో మొదట స్టెప్ ఇచ్చింది అదే. ఎందుకంటే మన మనస్సుని మనం గమనించు కోవాలని. ప్రతినిత్యం మన మనస్సులో పరిగెడుతున్న ఆలోచనలను నిత్యం గమనించడం మొదలుపెడితే, ఇది

అలవాటు చేస్తే, చెరువు గట్టు మీద నిలబడి స్పీడుగా వెళ్ళే ప్రవాహంవెంట చూస్తే ఏమవుతుంది ? కొద్దిసేపటికి త్రుళ్ళిదానిలో పడతాము. అలా ఆలోచనలను మనం గమనిస్తూ ఉంటే వాటినుండి దృష్టి మరలిపోయి మనస్సులో పడిపోతాం. అపుడు మనస్సుకన్నా లోతైన బుద్ధిని చేరు కుంటుంది. మాస్టర్ సి.వి.వి.గారు తన యోగంలో ఏంచెప్పారు అంటే ఇండిపెండెన్సీ అని. ఇండిపెండెన్సీ అంటే స్వాతంత్ర్యం కోసం బ్రిటీషు వారిని వెళ్ళ గొట్టటానికి జపం చేయిస్తున్నారేమో అనుకున్నా రంతా. అదేమీ కాదు. దాంతో బ్రిటీషువారికి సంబంధము లేదు. ఏమిటయ్యా ఈ ఇండిపెండెన్సీ అంటే అపుడు మాస్టరుగారు 'ఒరే! అర్థం చేసుకోండ్రా. ఈ యోగానికి మూలం శబ్దాలు.In-లోపలికి, Dip-మునిగి, and see -చూడు' అన్నారు. అంటే అంతర్ముఖంగా లోపలికి వెళ్ళి 'eye' తో కాకుండా 'I'తో చూడమన్నాడు. ఈ రెండుకళ్ళతో చూస్తే మంచీ, చెడూ రెండూ కనబడతాయి. అలాకాకుండా అంతర్ముఖ దృష్టితో చూడమన్నాడు. ఏకాంత శివయోగి అనే ఆయన తను వ్రాసిన గ్రంథాలలో 'ఓ శివా! ఈ రెండు కళ్ళతో చూస్తే ప్రపంచమంతా నీవే కనబడుతున్నావు. ఆ మూడో కంటితో చూస్తే నీలోనే ప్రపంచమంతా కనబడుతుంది' అని అంటాడు. అంటే మూడవ స్థితిలో ఉంటే అంటే ధ్యాన స్థితిలో కనుక చూస్తే అందరియందు ఒకే భావం కనబడుతుంది. 'సమం సర్వత్ర సముపశ్చిత మీశ్వరం' అన్నిటియందూ ఉన్నాడట ఈశ్వరుడు. ప్రహ్లాదునికి స్తంభంయందుకూడా కనిపించాడే ఆ 'సమం సర్వత్ర' అనేటటువంటి పరమేశ్వర స్థితి కలుగుతుంది. అది అంతఃపరిశుద్ధి అంటే ఈ భ్రూమధ్య దృష్టి కలగటానికి ఆలోచనలను గమనించుట ఒకపద్ధతి. ఆలోచనలను గమనిస్తే ఏమవుతుందంటే హాలులోకి

ఆ వైపునుంచివచ్చి ఈ వైపునుంచి నిష్క్రమించినట్లుగా పోతాయి ఆలోచనలు. అసలు ఈ ఆలోచనలు ఎక్కడనుంచి వచ్చాయో, ఎటు వెళ్తున్నాయో గమనించాలి. ఇది ఒక ఆశ్చర్యం. కొద్దిసేపటికి ఆ ఆలోచనలనే మర్చిపోతాం. ఇందాకటినుండి కొట్టుక చచ్చిన ఆలోచన ఎక్కడికి పోయింది. మరల ఇంకొకటొచ్చింది.అది ఎక్కడనుండి వచ్చింది? ఎక్కడకు పోతుంది? ఇది గమనించాలి. నన్ను ఒకడు అడిగాడు. ఈ ఆలోచనలు ఎక్కడినుండి వస్తున్నాయో మీరు కనిపెట్టారా అని. ఆ! కనిపెట్టాను. ఆకాశంలో మేఘాలు ఎక్కడనుండి వచ్చాయి. అవి ఎక్కడకు పోతాయి. ఏమీలేని నీలాకాశం. దట్టంగా మేఘాలు పట్టాయి. అట్లాగే ఆలోచనలు పుడతాయి. ఇవీ ఎక్కడ నుండి పుట్టాయో అక్కడికే పోతాయి. అంటే మనస్సునుండి ఆలోచనలు పుడతాయి. అంటే మనస్సు వేరు. ఆలోచనలు వేరు. Thoughts & Mind. అంటే టీ.వి. చూసేటప్పుడు మొదట స్క్రీన్ కనబడుతుంది. అదే నీలాకాశం. ఆకాశంపై ఏర్పడే దూదిపింజలవంటి మేఘాలు, వాటికి ఒక షేప్ ఉంటుంది. ఆకారం ఉంటుంది. లక్షణం ఉంటుంది. ఇవే ఆలోచనలు. ధ్యానస్థితిలో ఉండేవాడికి ఈ ఆలోచనలన్నీ పోయి నీలాకాశం కనబడు తుంది. కొంత సేపటికి ఈ నీల ఆకాశం కూడా పోయి ఈ ఆకాశం లోపలికి కనబడుతుంది. 'సయేషు అంతరాకాశక' అంటే ఈ ఆకాశం అంతరంగా లోపలికి కనబడుతుంది. అదే వివేక చూడామణిలో కూడా చెప్పబడింది. నిజంగా లోపల ఉండేదే బయటకు కనబడుతుంది. పరబ్రహ్మతత్వం ఎట్లాంటిది అంటే బయటవున్నట్లుగా కనబడుతుంది. కానీ, నిజానికది లోపలఉంది 'దర్పణ దృశ్యమాన నగరే నిజాంత స్థితం', అద్దం పెడితే ఏమవుతుంది. బయటనున్న వస్తువులు అన్నీ లోపలికి కనబడతాయి.

కొండమీదికెక్కి అద్దంపెట్టి చూస్తే విజయవాడ అంతా అద్దంలో కనబడు తుంది. అద్దంవైపు చూసి ఇదిగో విజయవాడ అని చెప్పేయవచ్చు. కానీ, నిజంగా అద్దంలో ఉందా విజయవాడ లేదు. దానికి వ్యతిరేక దిశలో ఉంది. అందువల్ల దర్పణ దృశ్యమాన నగరీ అంటే నిజంగా లోపల ఉన్నట్లు కనబడుతూ లోపల ఉండేది. కాబట్టి బయటకు వెళ్ళి ప్రపంచాన్ని జయించడం కన్నా లోపల జయించాలి. సినిమాహాల్లో స్క్రీన్ మీద బొమ్మ ఉంటుంది. చేత్తో పట్టుకొని లాగితే చిరిగి పోతుందా? పోదు. దానికి opposite direction లో ఉంటుంది projector. కాబట్టి మనస్సుకు వెనకాల పడే సినిమా ఇది. అది గుప్తమైనది. Dark Roomలో ఉండేది. గుప్తమైన చిత్రం. అంటే చిత్రగుప్తుడిలాగా అంటే లోపల ఉన్నటువంటిది ఎట్లాగా బయటకు కనబడుతుందో దాన్ని పట్టుకొనేవాడు యోగి అసలు దానికి మూలం ఎక్కడుందో ఆ తోక యొక్క శ్వాసను పట్టుకుంటాడు. 'యో అంతః సుఖ అంతరారామః' అపుడు ఆత్మయందే సుఖం కలుగుతుంది. ఇది బాహ్య సుఖం కాదు. 'తదా అంతర్జ్యోతి రేవతః' అపుడు ఆత్మయందు జ్యోతి కనబడుతుంది. వాడికి అపుడు శుకబ్రహ్మలాగా భ్రూమధ్య దృష్టి కలుగుతుంది. అంటే ఈ ప్రపంచమంతాకూడా భ్రూమధ్యంలో దూది గింజంత కనబడుతుంది. 'సుసూక్ష్మం నభస్తితః' ఆకాశమంతాసూది బెజ్జం అంత ఉంది అన్నాడు. 'త్రయేశు అంతరాకశకః' ఇది అంతరాకాశం అంటే. ఇంకాఉంది కానీ సాధనానుభవం లేకపోతే అర్థం కాదు. అనుభవంఉంటే మీరెక్కడో, నేనెక్కడో తెలియని స్థితికి వెళ్ళిపోతుంది. అంటే అంతఃస్థితి, బహిస్థితి ఏకమై పోతుంది. ఇది భగవద్గీతలో అధికశ్లోకాలలో కూడా ఉంది. దీనిని పరావరయోగమని చెప్పబడింది. బయటఉన్న వాటిని వెలిగిస్తుంది.

లోపల ఉన్నవాటిని వెలిగిస్తుంది. బయట ఉండేటటువంటి ప్రపంచజ్ఞానం కలుగుతుంది. బయట ఉన్నట్లు కనబడుతూ నిజంగా లోపల ఉండేటువంటి సమ్యక్‌జ్ఞానం కలుగుతుంది. అంటే అంతరదృష్టి, బహిర్‌దృష్టి ఏకకాలంలో ఉండేటటు వంటిది 'పరావరయోగం' అంటే బయటఉన్న ప్రపంచం అందరికీ కనబడుతుంది కదా! మరి అంతరప్రపంచం ఎందుకు కనిపించదు? అంటే సినిమాహాలులో బయట ఆడిటోరియం ఓపెన్‌చేసి ఉంటుంది. కానీ ప్రొజెక్టర్ రూమ్ లాక్ చేసి ఉంటుంది. ఈ తాళం తీస్తేగానీ డార్క్‌రూమ్ కనిపించదు. అట్లాగే నీ హృదయానికి తాళం వేసి ఉంది. అది తీస్తే కానీ అంతరాకాశం కనిపించదు. You are locked from inside. అంటే నీలోపల తాళం వేయబడి వుంది. ఒకసారి ఢిల్లీలో ఇదే జరిగింది. ఒక పిల్లవాడు తలుపులన్నీ వేసికొంటూ వెళ్ళి లోపలికివెళ్ళి గడియపెట్టుకున్నాడు. తియ్యమనిపెద్దగా ఏడుస్తున్నాడు. అపుడు నేను వీడు మన మాదిరే ఉన్నాడురా. మనంకూడా బయట అన్నిటి చేత చిక్కుబడిపోయి తాళంచెవి మన దగ్గరే ఉండి ఎవర్నో తియ్యమని ఏడిస్తే! తాళంచెవి మన దగ్గరే ఉంది. అది పారవేసుకొని ఏడుస్తున్నాం. మాకు నిజంగా చిన్నప్పుడు జరిగింది ఒకసారి. మా తల్లిగారు లేనప్పుడు మేమే వంట చేసుకునేవాళ్ళం. పార్కుకు వెళ్ళి ఆడుకొనేవాళ్ళం. ఇంకా నలుగురు పిల్లలం మేము అందరం పార్కుకు వెళ్ళి ఆడుకొని రాత్రి 9-30కు ఇంటికివచ్చాము. తీరా చూస్తే తాళం చెవి లేదు. ఏరా! తాళం చెవి ఎక్కడ ఉందీ అంటే, ప్రతివాడి మైండ్ (మనస్సు) ఏమిటంటే ఎవడి దగ్గర లేదో వాడు రెండో వాణ్ణి అడుగుతాడు. అందరూ కలిసి చిన్నవాడిని అడుగుతారు. నీ మూలంగా పోయిందని వీణ్ణి తిడతారు. అందరం కలిసి

పార్కుకు వెళ్ళి వెతుకుదాం అని. సరేనని అందరూ పార్కుకువెళ్ళి వెతుకుతూ రాత్రి 12 గంటలకు తిరిగి వచ్చారు.వారు వచ్చేటప్పటికి నేను రూములో లైట్లు వేసి వంట చేస్తూ ఉన్నాను. మా అన్నయ్య ఆశ్చర్యపోయి ఏరా! ఎట్లా తీశావురా తాళం? ఏమీలేదు. పరిగెత్తే హడావిడిలో తాళం వేసి తాళం చెవి అక్కడే పడవేసి పోయాడు. ఇది నిజంగా లైఫ్‌లో గుర్తు పెట్టుకోదగ్గ సంఘటన. తాళం ఎక్కడ ఉందో అక్కడే వెతకాలి. మనకు కావలసిన తాళంచెవి మనదగ్గరే పెట్టుకొని ఎవడికాళ్ళో పట్టుకుంటాం.

ఒకసారి రమణ మహర్షి తన కాళ్ళు తానే పిసుకుకొంటున్నాడు. ఒక భక్తుడు అదిచూసి. స్వామీ! మీ కాళ్ళు నేను పడతాను. నాకూ పుణ్యం వస్తుంది అని అంటే అపుడు స్వామి 'సరే! నా కాళ్ళు పడితే నీకు పుణ్యం వస్తుంది. మరి స్వామికి పుణ్యం వచ్చేదెట్లా ? అందుకని నాకాళ్ళు నేనే పిసుకు కుంటున్నాను' అన్నారట. అట్లాగ ఈ ప్రపంచానికి తాళం చెవిమన దగ్గరే ఉంది. ఈ హృదయగ్రంథి అంటే పీటముడి. ఇది విడిపోతే ప్రపంచం తాను అన్న రహస్యం తెలుస్తుంది. అది తెలియాలంటే హృదయగ్రంథిని ఛేదించాలి. లోపల ఉండే ముడిని విడగొట్టాలి. ఈ హృదయగ్రంథిని విడగొడితే సంశయమే ఉండదు. ఇదేమిటి, ఇదెలా వచ్చింది, అదెలా వచ్చింది అనే సంశయాలు ఉండవప్పుడు.

'విద్యతే హృదయగ్రంథి ఛిద్యతే సర్వ సంశయాః'. ఈ ప్రపంచంలో మానవుడి జీవితాన్ని ఎనలైజ్‌చేస్తే అన్నీ ప్రశ్నలే. పుట్టినపుడే చూస్తాడు పిల్లవాడు. ఆశ్చర్యంగా పెడతాడు ముఖం. తనంటే ఏమిటో, ఇతరులు అంటే ఏమిటో తెలియక అందరినీ కొరికి చూస్తాడు. Iternal wonderment అన్నమాట. అదే స్వార్థానికి బీజాంకురము. అపుడేగనుక ఈ హృదయ

గ్రంథి విప్పుకొంటే ఈ ప్రపంచమే తాను అన్న అభేదస్థితి కలుగుతుంది శుకబ్రహ్మలాగా. వామదేవుడి పుట్టుక గురించి ఉపనిషత్‌లలో చెప్పబడింది. పిల్లవాడు పుట్టగానే శీర్షోదయమవుతుంది. శీర్షం బయటకు రాగానే, బ్రహ్మ రంధ్రం బయటకు రాగానే ఆయనకి బ్రహ్మజ్ఞానంకలిగి మోక్షం వస్తుంది. అపుడే వైరాగ్యం కలిగింది. అపుడే ప్రాణాయామం చేసి కపాల భేదనంకోసం ప్రయత్నించాడట ఆయన ఇంకా పుట్టకముందే. అపుడు సర్వదేవతలూ వచ్చి ఆయనకి నమస్కరించి 'అయ్యా! మాదొక విన్నపము. ఏమంటే మీరు మా కోసం జన్మించాలి. ఎందుకంటే మీరు పుట్టకముందే బ్రహ్మజ్ఞానాన్ని సాధించారు. మీరు యథార్థం తెలిసికొని మాకు బోధిస్తే మేంతరిస్తాం' అన్నారట. అపుడు సరేనని ఆయన జన్మ నెత్తాడట. అంటే అంతటి తృణప్రాయం వాళ్ళకి ఈ శరీరం, ఈ జన్మ. ఇది అంతఃస్థితి. ఇది లోపల ఉండే హృదయగ్రంథిని భేదించడానికి పనికివచ్చే యోగం. అంటే ధ్యాన స్థితిలో కనబడే అంతః ప్రపంచం, మేల్కొన్నప్పుడు కనబడే బహిః ప్రపంచం రెండూ ఒకటే అనే భావం 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః'. ఎవరీ నారాయణుడు, ఏమిటీ ప్రత్యేకత అంటే లోపల వ్యాపించి ఉన్నాడట అంతర్యామిగా, బయట వ్యాపించి ఉన్నాడట బహిర్యామిగా. మనం బయట ప్రపంచంలో ఉన్నప్పుడు లోపల మరచి పోతాం. లోపల ఆలోచిస్తూ ఉంటే బయటి ప్రపంచాన్ని మరచిపోతాం. అట్లాకాకుండా ఈ రెండూ దృష్టి కలిగి ఉండేదే పరావరయోగం. 'తస్మిన్ దృష్టే పరావరే' ఈ పరావరయోగం అంటే ఇది.

మా ఇంటికి వచ్చిన ఒక పండితుడిని అడిగాను 'ఏంటయ్యా ? పరావరయోగం' అని. ఆయన చెప్పాడు. బయట లాంతరు పెడితే లోపల

నీడ పడుతుంది. లోపల లాంతరు పెడితే బయట నీడ పడుతుంది. ఈ రెండూ కాకుండా గడపమీద పెడితే వెలుగు రెండుచోట్లా పడుతుంది. అంటే భ్రూమధ్యదృష్టి కలిగితే అంతర్ జ్ఞానం కలిగి, బహిర్ జ్ఞానం కలిగి ఏకత్వభావన కలుగుతుంది. అదే 'ఉభయ విభూదిత్వం' అంటే. విశిష్టా ద్వైతంలో ఉభయవిభూతినాథుడని చెప్పిన కారణంఇదే. అంటే అంతర్ విభూతి, బహిర్ విభూతి వీటికి అధిపతి నారాయణుడే. ఆ స్థితి ఏ యోగికి కలుగుతుందో వాడు నారాయణ స్థితుడు. అది నాడీగ్రంథంలో రామకృష్ణ పరమహంస జాతకంలో ఇవ్వబడింది. అతడే పరమహంస స్థితిలోఉంటాడు. హంసశ్చ, పరమ హంసశ్చ అని నారాయణ స్థితిలో ఉంటాడు. ప్రపంచంలో ఎక్కడి కెళ్ళినా, పూజింపబడతాడు. గౌరవించబడతాడు. ఏ రూపంలో ఉన్నాసరే! ఫకీరులాగా ఉన్నా సరే! ఎందుకని అంటే అందరియందు వాడు భగవంతుణ్ణి చూస్తాడు. కనుక అందరూ వాడియందు భగవంతుడిని చూస్తారు. ఎవరికీ పేచీలేని వ్యవహారమిది. మిగతా వాళ్ళందరికీ బయటి ప్రపంచమే కనబడుతూ ఉంటుంది. అందుకని కొట్టుకు చస్తుంటారు. అందువల్ల అంతర్దృష్టి ఈ ప్రపంచంయొక్క రహస్యాన్ని ఛేదిస్తుంది. సుఖ దుఃఖాలు నశిస్తాయి. ప్రపంచమే లేకపోతే ఇక జన్మఎక్కడిది? పుట్టుక ఎక్కడిది? వినాశనం ఎక్కడిది? జన్మాదికములు ఎక్కడనుండి కలుగు తున్నాయి? 'జన్మాద్యస్య యతః', అంటే ఎక్కడనుండి జన్మాదికములు కలుగుతున్నాయో వ్యాసుల వారు బ్రహ్మసూత్రాలలో చెప్పారు. 'జన్మాద్య స్యయతః' జన్మాదులు ఎక్కడి నుండి కలుగుతున్నాయో, జన్మాదిఅంటే ఆది అంటే వృద్ధి, క్షయం,ఇవన్నీ నీకేనా, ప్రపంచానికా అంటే రెండూ ఒకటే. తనే ప్రపంచం కనుక నేనే అంతర్యామి అనే అంతర్దృష్టి, నేనే

ప్రపంచం అనే బహిర్దృష్టి కలుగుతుంది. 'జన్మాద్యస్య యతః' అని ప్రపంచ పరంగా అర్థం చెపితే ప్రపంచానికి ఏవిధంగా సృష్టి, స్థితి, లయలు కలుగు తున్నాయో, తనే ఈ ప్రపంచంకాబట్టి తనకు పుట్టుక, స్థితి, లయలు ఎట్లా కలుగుతున్నాయో రెండూఒకటే కనుక అపుడు జన్మ నశిస్తుంది. మృత్యువు నశిస్తుంది. ఏది తెలిసికొని మృత్యువునుకూడా దాటి పోతామో తెలిసికొనేటటు వంటి జీవుడి స్వరూపంగాఉండే పరమాత్మకి నమస్కారం అన్నాడు వ్యాసులవారు. ఇదీ ఈ అంతరదృష్టి, బహిర్‌దృష్టి. ఈ రెండూ కలిగితే నేను అనే భావం నశించి హృదయగ్రంథి భేదించబడి ఈ ప్రపంచం అనే జైలులో మనం ఉన్నామనే భావంపోయి మనలోనే ఈ ప్రపంచంఉందనే భావం కలుగుతుంది.

కాశీలో త్రైలింగస్వామి అనే ఒకాయన ఉండేవారు. మన తెలుగువారు. 320 సం. బ్రతికాడు. దిగంబరంగా ఉండేవాడు. అట్లాగే తిరుగుతూ ఉండేవాడు. ఒకసారి బ్రిటీషువారు ఏమిటి ఈ న్యూసెన్సు అనుకొని తీసికెళ్ళి లాకప్‌లో పెట్టారు. లాకప్‌లో పెట్టి తాళం వేసి వచ్చేసరికి ఈయన బయటరోడ్డుపై కనిపించాడు. అరె! ఏమిటిది అనుకొంటూ మరలా లాక్కెళ్ళి లాకప్‌లో వేసి గట్టిగా తాళం వేశారు. వేసి బయటికిరాగానే మరలా రోడ్డుపై కనిపించారాయన. ఆశ్చర్యపోయిన పోలీసులుమరలా ఈయనను తీసుకెళ్ళి జాగ్రత్తగా గడియవేసి, లాకప్‌లో ఉంచి బయటకు వచ్చేసరికి జైలుగోడలపై తిరుగుతూ కనిపించాడు. ఆశ్చర్యపోయిన వారు ఏమిటయ్యా ఇలా తిరుగు తున్నావు, నిన్ను లోపల పెట్టాం గదా. అవును పెట్టారు. మళ్ళీ బయటకి ఎలా వచ్చావు. అవును వచ్చాను అంటూ ఆయన హిందీలో చెప్పాడు. హవా హై ఫిర్ ఆతాహై జాతాహై'. గాలి ఉంది. కటకటాల్లోకి వస్తూ ఉంది,

పోతూ ఉంది. మేము అట్లా వస్తాం, పోతాం. అన్నారాయన. 'అసంగో వాయు వత్సరేత్' భాగవతంలో ఉంది. యోగి అయినవాడు గాలిలాగా బయటకు పోగలడు. లోపలికి రాగలడు. అట్లాగే జైలులోకి పోగలిగాడు. రాగలిగాడు. అపుడు వాడు దండంపెట్టి నా ఉద్యోగం పోతుందిస్వామీఅంటే సరే నీవాళ్ళు వచ్చినపుడు లోపల ఉంటాను. మరలా నా ఇష్టం అన్నా డాయన. ఇలాగ ఆయన బాహ్య స్మృతి లేకుండా ఉండేవాడు. ఈయన ఒకసారి బ్రిటీషువారి క్లబ్‌కెళ్ళాడు. పైగా అది ఆడవారి క్లబ్. అక్కడ బట్టలు లేకుండా వారిమధ్య తిరగసాగాడు. అక్కడివాళ్ళకి ఒళ్ళు మండి కొరడాదెబ్బలు కొట్టమన్నారు. వారు కొరడా దెబ్బలు రెండు కొట్టగానే కొంచెం నెమ్మదిగా కొట్టవయ్యా! ఆడకూతురికి దెబ్బతగులుతుంది అన్నాడు. ఇంతలో జమాను పరిగెత్తు కుంటూ వచ్చాడు. ఆపండి. కలెక్టర్‌గారి భార్యకు కొరడా ధెబ్బలు తగులు తున్నాయి అంటూ. వారు భయపడిపోయి ఈయనతో ఎందుకులే అని వదిలివేశారు. ఈ విధంగా త్రైలింగస్వామి భ్రూమధ్యదృష్టితో ఉండి అనేక మహిమలు చూపించాడు. ఒకసారి ఒక లక్నో నవాబుగారు తన పరివారంతో వేటకి వచ్చి గుడారము వేసి గానాబజానాతో వచ్చి అక్కడ ఉండి విందు చేసికొంటూ పాటలు పాడుకొంటున్నారు. పైగా అందరూ ముస్లిం యువతులు ఉన్నారు అక్కడ. అలాంటిచోట స్వామి ఈ వైపునుండి లోపలికి వెళ్ళి ఆ వైపునుండి బయటకు వచ్చాడు. వెంటనే నవాబుగారు హడావుడిపడి ఎట్లా వచ్చావు నువ్వు ? లోపలికి ఎవరు రానిచ్చారు ? అనగానే వాళ్ళు నాకు కనబడలేదు. నేను వాళ్ళకి కనబడలేదు. అని నేరుగా వెళ్ళిపో సాగాడు. ఈయన భ్రూమధ్యదృష్టిలో ఉన్నాడు. అందుకని వారు ఈయనకి కనిపించలేదు. ఈయనవారికి కనిపించలేదు. అట్లాకాదని నవాబుగారు కత్తిపుచ్చుకొని వెంటబడి పరిగెత్తసాగాడు. ఎంత పరిగెత్తినా ఆయనను

కలుసుకోలేకపోయాడు. అపుడు నిలబడి అల్లాను ప్రార్థించగా అపుడు స్వామి ఆగుతాడు. అపుడు వీడు స్వామినిచేరుకోగలుగుతాడు. వెంటనే కత్తితీసికొని స్వామి కుడిచేతిని నరికివేశాడు. కానీ స్వామి ఇదేమీ పట్టనట్లు అలా వెళ్ళి పోసాగాడు. మరలా ఈ నవాబు స్వామి ఎడమ చెయ్యి నరికివేశాడు. అయినా స్వామి ఇదేమీ పట్టనట్లు నడచి పోసాగాడు. అప్పుడు అర్థమైంది నవాబుకు ఈయన ఎవరో మహానుభావుడని. వెంటనే పరిగెత్తుకెళ్ళి స్వామీ తప్పయి పోయింది క్షమించమన్నాడు. ఏమిటి అని స్వామి అనగానే మీ చెయ్యి నరికి వేశాను అని చెయ్యి చూపగానే 'ఏది ఇట్లా ఇవ్వు' అని తీసికొని అంటించుకొని వెళ్ళిపోసాగాడు. అపుడు నవాబు ఆయన ఇంకొక చెయ్యి ఇవ్వగానే అట్లాగే అతికించుకొని వెళ్ళసాగాడు. అపుడు నవాబు ఆయన కాళ్ళపైబడి నన్ను రక్షించమని ప్రార్థించాడు. 'నేనా రక్షించాలా ! ఎందుకు?' అంటే ఈ ప్రపంచం నుండి నాకు విముక్తి ప్రసాదించి మోక్షాన్ని చేరుకొనే మార్గం చెప్పమని నవాబుప్రార్థించగా స్వామి – 'నీవు ఏపని చెయ్యాలను కొంటావో అది చెయ్యకు. ఏది చేయకూడదనుకుంటావో అది చెయ్యి'అని చెప్పారు. ఇది సాధన చేసి ఖండయోగాన్ని సాధించగలిగాడు లక్నోనవాబు. అంటే భ్రూమధ్య దృష్టితో ఇవన్నీ చెయ్యవచ్చు. అంటే అంతర్యాగంకోసం ఇవన్నీ చెప్పవచ్చు. అంటే అంతర్యాగం అనేది ఊహ కాదు. ఇది అంతర్దృష్టికి సంబంధించిన అంశం.

హరిః ఓం తత్ సత్

గురుదేవులు 1992 జనవరిలో శ్రీమన్నారాయణ యజ్ఞంలో చేసిన అనుగ్రహభాషణం. గురుసేవగా ఈ ఉపన్యాసము వ్రాసి పంపినవారు పొంగూరు శాఖ యోగమిత్రురాలు కుమారి యస్. శైలజ.



6

# సదస్సు - సదస్స్పతి !

హిందూమతంలో మనం ఆరాధించే దేవతలు, వీరి యొక్క పూర్వం అతి ప్రాచీనమైనటు వంటి పుట్టుక, వాటి యొక్క ప్రశంస ఎక్కడ ఉందంటే వేదాల్లోఉంది. తర్వాత పురాణాల్లో, ఆగమాల్లో వరుసగా వస్తాయి. ఈ వేదాల్లో ఉండేటటువంటి స్వరూపాలకి, ఆగమాల్లో వచ్చేవాటికి కొద్దికొద్దిగా భేదం కాలంవల్ల కాలాంతరం వల్ల ఆకారంలోగాని దాని మూర్తి భేదంలో కాని మార్పులుంటాయి. ఇది ప్రతిదేవతకు అలాగేఉంటుంది. సుబ్రహ్మణ్యేశ్వరుడికి కూడా అదేవిధంగా ఉంది.

సుబ్రహ్మణ్యేశ్వరుడు వేదంలో దేవతలయొక్క సభకి సభాపతి. ఇక్కడ సభాపతి అంటే స్పీకర్ ఎలాగో అలాగ అధ్యక్షుడు ఉన్నాడు. 'సదయే

నమః సదసస్పతయే నమః' అని మనం సదస్యంలో చెప్పుకుంటాం ఆశీర్వచనం చెప్పేటప్పుడు. ఈ సదసస్పతి ఎవరంటే సుబ్రహ్మణ్యుడు. దేవసభకి సభాపతి అని పేరు. దక్షిణదేశంలో ఇప్పటికీ సభాపతి అనే పేరు మనుషులకి కూడా ఉంటుంది. ఆ సభాపతి ఎవరంటే సుబ్రహ్మణ్యుడు. ఎందుకని సుబ్రహ్మణ్యునికి సభాపతి పేరు రావడానికి కారణం 'సుబ్రహ్మణ్యః -బ్రహ్మజ్ఞాన స్వరూపుడు. 'సు' అంటే శ్రేష్ఠుడు. వాళ్ళలో సర్వశ్రేష్ఠుడు, పరమ బ్రహ్మజ్ఞాని, బ్రహ్మణ్యుడును అయి ఉండటం చేత. బ్రహ్మణ్యుడైనవాడికి సుబ్రహ్మణ్యస్థితి ఎందుకివ్వాలంటే మనం యాజ్ఞికం చేసేటప్పుడు బ్రహ్మ గారిని అక్కడ కూర్చోపెట్టినపుడు ఏ యజ్ఞకార్యాలకైనా ముందు బ్రహ్మ గారుంటారు అధ్యక్షుడుగా, ఆ బ్రహ్మ ఏమీ చేయడు ఊరికే కూర్చోటంతప్ప. పూర్వం బ్రహ్మగా ఒక ఋషి ఉండేవాడు. ఈకూర్చున్న సదస్సుల్లోనే వాళ్ళకి పదవులు, ఇపుడు స్పీకరుగా కాంగ్రెసు పార్టీ ఉన్నా, ఏ పార్టీ ఉన్నా ఎవడో ఒకడు కొత్త స్పీకరు వస్తూఉంటాడు. అలా స్పీకరు అనే పదవి మారదు. మనుషులు మారుతూ ఉంటారు. అలాగే దేవసభలో కూడా అక్కడ ఈస్పీకరు పదవిమారుతూఉంటుంది. అలాగే ఈ ఋషులు ఏం చేశారంటే యజ్ఞాలు చేసినపుడు కూడా ఈ పైన దేవతలు ఎక్కడెక్కడ కూర్చొని వాళ్ళు ఆయా పదవులు నిర్వహిస్తున్నారో మనం డ్రామా వేసినపుడు రాముడు వేషంవేస్తే రాముడులాగే, రావణాసురుడు వేషం వేస్తే రావణాసురుడులాగే నటించినట్లుగా వీళ్ళేం చేస్తారంటే ఈ సదస్సులో కూడా వాళ్ళు వాళ్ళు చేసేటటు వంటి పనిని నిర్వర్తిస్తారు. ఏమిటి చేస్తారంటే యజ్ఞంలో ఈ ఋత్విక్కులు ఉండే దాంట్లో బ్రహ్మగా ఉండేటటువంటి వాడికి స్థానం ఏమిటో సదసస్పతి స్థానం అంతే. అతడు ఏమీ చేయడుగాని ఈ జరిగేటటువంటి యజ్ఞకలాపాలన్నిటినీ కూడా పర్యవేక్షణ చేస్తుంటాడు. అంటే ప్రతి ఋత్విక్కుకున్నటు

వంటి జ్ఞానంఉండి దానికంటే ఇంకా ఎక్కువ యోగానుభూతి కలిగినవాడు అయివుండటం వలన ఏమిటి విశేషం ఈ జరిగే మంత్రములు, దానియొక్క వర్ణన, ఇక్కడ ఉపయోగించే వస్తువులు, దాని వలన చేసే క్రియ, వీటియొక్క అర్థాన్ని మనస్సులో భావించి ధ్యానసమాధి స్థితిలో ఉంటాడాయన.అంటే ఏవైతే మంత్రములు చెప్పబడుతున్నవో వాటిని యథార్థంచేసే డ్యూటీ ఆయనది. ఓ యోగి ఏదైనా సంకల్పం చేస్తే తక్షణమే జరుగుతుంది. ఆ సంకల్ప బలం దానియందు యోగశక్తిని ధారణ చేసి అక్కడ కూర్చునేటటు వంటి వాడు బ్రహ్మ.

అందువలన ఉపద్రష్ట అంటే ద్రష్ట అంటే కళ్ళతో చూసేవాడు. ఉపద్రష్ట అంటే దానిని పైనుంచి (overseeing supervising) అంటారే అటువంటివాడు సదసస్పతి. అది బ్రహ్మజ్ఞుడైనవాడేకావాలి కాబట్టి దేవతలలో సుబ్రహ్మణ్యుడికి ఆ శక్తి, పదవి ఇవ్వబడింది. ఎందుకని అంటే శివుడు కేవలం జ్ఞాన స్వరూపుడు. శక్తి కేవలం జడతత్వం అయినటువంటిది. ఈ రెండిటి సమ్మేళనం కలిగినవాడు సుబ్రహ్మణ్యుడు. శివశక్త్యాత్మకుడు అందువలన తాంత్రికంగా యంత్రాలు వేసేటపుడు కూడా ఈ సుబ్రహ్మ ణ్యేశ్వర యంత్రానికి షట్కోణయంత్రంవేసి ఒకటేమో తలక్రిందులుగా ఉండే త్రిభుజం శక్తిస్వరూపం, ఒకటి నించున్నటువంటి త్రిభుజం శివ స్వరూపం. మూడుకన్నులది. నిలబడ్డటువంటి ముక్కోణం జలస్వరూపం. రాశిచక్రంలో ఈ అగ్నిరాశులు, జలరాశులు ఈ మూడును ఒకదానిమీద ఒకటి ఏర్పాటు అయేటప్పటికి శివశక్త్యాత్మకం సమ్మేళనం కలిగినపుడు సుబ్రహ్మణ్యుడౌతాడు. అందువలన ఈ సుబ్రహ్మణ్య స్వామి యంత్రానికి ఆరు కోణములు.

వైష్ణవాగమంలో సుదర్శనం ఏమిటో శైవాగమంలో సుబ్రహ్మణ్యుడికి అదేపని, వైష్ణవాగమంలో విష్వక్సేనుడికి ఏమి పనో శైవాగమంలో గణపతికి

అదేపని. పేరులు తేడా తప్ప వాళ్ళయొక్క పవర్స్, వాళ్ళ డ్యూటీస్ ఒకటే. ఇండియాలో పోలీసువాడు ఉంటాడు. అమెరికాలో పోలీసు వాడు ఉంటాడు. డ్రెస్, వేషము వేరుగా ఉండొచ్చుగాని చేసేపని ఒకటే. అలాగే వీళ్ళందరికి దేవతల సాంప్రదాయంలో ఈ సుబ్రహ్మణ్యుడు చేసేటటువంటి పని, ఇక్కడ మనకి సుదర్శనుడు చేసేపని ఒకటే. సుదర్శనుడు, సుబ్రహ్మణ్యుడు ఇద్దరూ షట్కోణమూర్తులే. ఇద్దరూ ఆయుధపురుషులే. ఒకడు సేనాని సుబ్రహ్మణ్యుడు. వాడు నేత్రహస్తుడు అంటే ఏమిటి ? యజ్ఞంలో ఇద్దరికీ ఒకటే function. సభలో కూడా వాళ్ళది ఒకటే. దండం ధరించి ఉంటారు. స్పీకరు కూడా ఇప్పటికీ పార్లమెంటులో, బ్రిటీషు పార్లమెంటు అయినా సరే, అమెరికన్ పార్లమెంటు అయినా సరే దండం ధరించి ఉంటారు. కానీ దానిని ఉపయోగించరు. అదిఉంది అని మనం చెపితే కానీ వాడికి తెలీదు. ఒక దండంవలే ఉండి చివర గదలాగా ఉంటుంది. అందుకనే గదాధరుడు అంటారు. దాన్నిధరించిఉండి ఎవరైనా గొడవ చేస్తే ఆర్డర్ చేస్తారే కోర్టులో ఆర్డర్ ఆర్డర్ అని అంటాడే అటువంటి దండధరుడు అన్నమాట.

అందువలన ఈ సుబ్రహ్మణ్యుడు శివశక్త్యాత్మకుడు, బ్రహ్మణ్యుడు. యజ్ఞంలో సభలో ఋషుల సదస్సులో అన్నిటినీ పర్యవేక్షణ చేసేటటువంటి, బ్రహ్మగా నుండేటటువంటివాడి పనెటువంటిదో ఈ దేవతలలో సుబ్రహ్మణ్యుడి యొక్క పని అటువంటిది.

అందుచేత వెయ్యిమంది ఉన్నటువంటి సభను వాళ్ళందరికీ ఏదైనా మనం నోటీసుగాని, Information గాని ఇవ్వాలంటే వెయ్యిమంది దగ్గరకు వెళ్ళి చెప్పడానికి వీలుకాదు. సభంతా గల్లంతైపోతుంది. ఆ స్పీకరుకి మనం చీటీ పంపిస్తే స్పీకరే ఎవర్ని ఎన్నుకోవాలో వారిని పిలిచి వాళ్ళు

పిలుస్తున్నారని బయటకు పొమ్మని చెప్తాడు. అందుకని దేవతలు మనం యజ్ఞం చేయదలుచుకొన్నప్పుడు ఏ దేవత గురించి యజ్ఞం చేయదలచు కున్నామో మనం ఆ దేవసభలో స్పీకరుకి పంపిస్తే ఇదుగో రేపు ఫలానా యజ్ఞం జరుగుతుంది. వెళ్ళి ఈ పనులు చూసుకోవాలి అని చెప్పేటటువంటి వాడు సదసస్పతి. అందుకని ముందు సదస్సులో 'సదసేనమః సదస స్పతయేనమః ...' అని ఆయనకు నోటీసు ఇచ్చి అక్కడనుండి ఆ దేవతలకు కమ్యూనికేట్ చేసి అగ్నికి చెప్పాలా, విష్ణువుకి చెప్పాలా, శివునికి చెప్పాలా, శక్తికి చెప్పాలా అక్కడుండే దేవతా త్రింశతి కోటి దేవతాగణములో ఎవరికి కావలసిన దానికి వెళ్ళాలి. అది ఈ బ్రహ్మ యొక్క డ్యూటీ. అధ్యక్ష స్థానం నుంచే వెళ్ళాలికానీ మనం వెళ్ళి అందరితో చేయటానికి వీలు లేదు. ఇప్పుడు హైకోర్టుకి ఏదైతే మనం నోటీసు ఇవ్వాలంటే జడ్జిలకు ఇవ్వటానికి లేదు. దానికి ఒక కమ్యూనికేషన్ ఉంటుంది. అందువలన ఈ సభలో ఏ దేవతలకైనా ఏ కమ్యూనికేషన్ అయినా ఇవ్వాలంటే ఈ సదసస్పతి ద్వారానే ఇవ్వాలి. అందువలన ఈ శక్తి సంబంధమైన దేవతలు, శివ సంబంధమైనవి, జ్ఞాన సంబంధమైనవి, ఈ రెండూ శివశక్త్యాత్మకమైనటువంటివి. ఈ రెండూ కలగి ఉన్నటువంటి వాడే బ్రహ్మణ్యుడు. తరువాత మనిషి శరీరంకూడా బ్రహ్మాండానికి ప్రతిరూపం. అందువలన మన శరీరంలోకూడా జ్ఞానేంద్రియాలు - శివ స్వరూపములు, కర్మేంద్రియాలు శక్తి స్వరూపములు. ఈ రెండిటి సంపుటి జరిగితేనే మన స్థూల, సూక్ష్మ శరీరాలుకలిసి మనుషులు బ్రతుక గలుగుతున్నారు. అందువలన శరీరంలో దేవతలందరూ ఒక్కొక్కరు ఒక్కొక్క అవయవంలో ఉన్నారు. మనకి ఈ శరీరమే దేవసభ. కళ్ళలో ఆదిత్యులు, ఇట్లా విరాట్‌స్వరూపంలో భగవంతుడు ఏమి చూపించాడో వాళ్ళందరూ తలో చోట ఉన్నారు. కానీ వాళ్ళందరూ యథాస్థానంలో పని చేయాలంటే

హృదయంలో బ్రహ్మగారు ఉంటేనే మిగతా వాళ్ళందరి పని నడుస్తుంది. కన్ను పనిచేయటం గాని, ముక్కు పనిచేయటంగాని, నాలుక పనిచేయ టంగాని, తత్సంబంధమైన శ్రోత్రేంద్రియం, జిహ్వేంద్రియం, నేత్రేంద్రియం, తత్సంబంధమైన దేవతలు, ఆదిత్యులు, వశువులు, రుద్రులు వీళ్ళందరూ శరీరగతమైన దేవతలు వీళ్ళు. పైన విరాట్‌పురుష శరీరంలో దేవతలు ఎలాంటి అవయవాలలో పనిచేస్తున్నారో ఇక్కడ మన శరీరంలో కూడా ఈ దేవతలు ఇలాంటి అవయవాలుగా పనిచేస్తారు. ఇక్కడ స్విచ్ బాక్స్, బయట నున్న స్విచ్‌బాక్స్ ఒకటే ఉంటుంది. కానీ సైజు వేరే ఉంటుంది. అందు వలన ఈ శరీరంలో ఉండే దేవతలందరికీ కమ్యూనికేషన్ ఏమిటి? ఈ సుబ్రహ్మణ్యుడు హృదయంలో ఉండేటటువంటి వాక్పతి. వాక్ అంటే ఏమిటి? దానికి ఒక అర్థం ఉన్నది, శక్తి ఉన్నది. ఒక్కమాట మనం ఉచ్చరిస్తే ఆ మాటకు ఒక అర్థం చెప్పవచ్చును. అది శివస్వరూపం, జ్ఞానస్వరూపం. అర్థం చెప్పటం అలాఉంచి ఒక్క మంత్రాన్ని పలికేటప్పటికి కొంత పవర్ వెంటనే వస్తుంది. 'శక్తివాగర్థా' వాక్ దాని అర్థములాగా శివశక్త్యా త్మకం. అలాగే లక్ష్మీ నారాయణాత్మకం ప్రకృతి పురుషాత్మకం రెండూనూ. వాక్కుకు రెండు తత్త్వాలున్నాయి. అందువలన మనం ఏ విషయాలు అయినా సరే ఒక్క మనిషితో ఏది చేయించాలన్నా సరే వాక్ రూపంలోనే. అతనితో మాట్లాడవచ్చు. అతన్ని ఆరాధించ వచ్చు. అతనితో కమ్యూనికేషన్ చేయాలంటే కూడా వాక్కే సర్వదేవతా స్వరూపం.

అందువలన యజ్ఞంలో కూడా ఎంతమంది దేవతలుండి ఎన్ని ద్రవ్యాలు పెట్టి ఎన్ని రకాల కుండాలు ఏర్పాటు చేసినా వీటి కమ్యూనికేషన్ వాక్‌ద్వారానే. శబ్దంద్వారా వాళ్ళనికదిలించాల్సిందే. అందుకని బ్రహ్మణ్యస్పతి బ్రాహ్మణం అంటే వాక్కు. అందువలన ఈ బ్రహ్మగా పెట్టేటటువంటి కూర్చ

ఈ బ్రాహ్మణస్పతి. వాడే సుబ్రహ్మణ్యుడు. ఆ 'సు' కలిపితే బ్రహ్మణ్యస్పతి. వాడు వాక్ రూపి. వాక్కులకు అధిపతి. ప్రారంభం చేసేటటువంటప్పుడు వాడు చేసేటటువంటి డ్యూటీ ఏమిటీ ఈ వాక్కు ద్వారా శక్తిని ప్రశ్నింపజేసి ఈ శక్తిద్వారా శరీరంలో ఉండే దేవతలందరినీ కదిలించి తద్వారా భూమి మీద, ఆకాశంలో, అంతరిక్షంలో ఉండే దేవతలు ఎవరి అంశలు మన శరీరంలో ఉన్నాయో వాళ్ళ హెడ్‌క్వార్టర్స్ బయట ఉంటాయి. వాళ్ళందరినీ కూడా కదిలించి ఎలర్ట్ చేస్తాం మనం. అంటే ఏమిటి ? ప్రైం మినిష్టర్ వస్తున్నాడంటే రోడ్డుమీద పోలీసులందరినీ ఎలర్ట్ చేస్తే అందరూ ఎటెన్షన్‌లో ఉంటారు. అలా ఈ దేవతలందరూ వాళ్ళు అప్రమత్తులై ఉంటారు. అందుకని వారిని కదిలించడానికి ఎవరిద్వారా కదిలించాలో సెంట్రల్ ట్రంక్ కాల్ చేయాలీ అంటే మనకు టెలిఫోన్ ఎక్స్‌ఛేంజ్ నుండే పోవాలి.

ఈ దేవసదస్సు అంటే ఏమిటి ? ఈ దేవతల యొక్క సమూహానికి కనెక్షన్ ఎక్కడనుండిఉందో ఆ కనెక్షన్ యజ్ఞానికి కావాలన్నా, యోగసాధనకు కావాలన్నా మన సాక్షాత్కారానికి కావాలన్నా అందరు దేవతలతోనూ మనం ఎట్లా కమ్యూనికేట్ చేయాలి? ఈ రహస్యం అంతా సుబ్రహ్మణ్యుడి తత్త్వాన్ని అర్థం చేసికొంటే మనకుతెలుస్తుంది. అంటే శరీరంలో మనది సుబ్రహ్మణ్యుడి జీవాత్మ. ఎందుకంటే ఈ జీవాత్మకు జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు రెండూ ఉన్నాయి. అట్లాగే శరీరంలో 6 చక్రాలు ఉన్నాయి. ఈ ఆరులో జ్ఞానమైనవి మూడు, కర్మమైనవి మూడు. జ్ఞానమైనవి భ్రూమధ్యంలో ఆజ్ఞాచక్రము, కంఠం వద్ద విశుద్ధి చక్రము, హృదయం దగ్గరుండేది అనాహత చక్రము. ఇది 1) ఆకాశతత్త్వము 2) వాయుతత్త్వము 3) అగ్నితత్త్వము. ఈ మూడు పైవి. క్రిందివన్నీను మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరకం ఇవన్నీ కర్మేంద్రియాలు. ఆహారం జీర్ణమవటం, మలమూత్రవిసర్జనం,

సృష్టిక్రమము ఈ సంబంధించిన వాళ్ళంతా ఈక్రింద శక్త్యాత్మకమైన చక్రాలు మూడు, పైన శివాత్మకమైన చక్రాలు మూడు, ఈ మూడూ కలిపితేనే ఆరు ఏర్పడి మనలోపల షట్కోణములు శరీరంలో ఏర్పడుతాయి. అందుకని షట్కోణయంత్రము తీసుకున్నపుడు ఏ కోణంలో ఏ బీజాక్షరము ఎక్కడ ఏ చక్రంలో న్యాసం చేసుకోవాలో ఈ లింకు పోయింది. పోవడంమూలానా ఈ ఆగమం బయట బాహ్యాకార్యమై మిగిలింది. కానీ ఈ అంతఃకార్యం లింకు పోయింది. అందువలన కుండం తీసుకొచ్చి దానిలో అగ్ని పుట్టించా లంటాడు. కుండం తెస్తాడు. కానీ దాంట్లో అగ్ని పుట్టదు. బీజాక్షరములు చెప్తాడు కానీ దానికి సంబంధించిన ప్రతిక్రియా రాదు. పూర్వం అస్త్రాలు వేసేటపుడు అవి ఉచ్చరించగానే పైన అగ్ని అనగానే అగ్ని రావాలి.జలం అనగానే జలం రావాలి. వాయువు అనగానే వాయువు రావాలి. ఆ పలికేటటు వంటి కనెక్షన్ ఎందుకు పోయిందంటే ఇదుగో ఈ లోపల అనుసంధానం తీసేశారు. బ్రహ్మాస్త్రం వేసేటప్పటికి అశ్వత్థామ ఇక తరువాత కలియుగంలో దీనివలన చాలా గొడవవుతుందని ఈ బీజాక్షరాలకు, వాటిని పలికే స్విచ్‌లకు కనెక్షన్‌వైరు తీసేశారు. లేకపోతే వీరు దీనివలన యజ్ఞాలు చేయకపోగా సంహారం చేస్తారు.

దీనికి ఋజువు ఏమిటి ? ప్రమాణం ఏమిటి ? నీవు చెప్తే సరిపోతుందా కనెక్షన్ తీసేశారంటే. అర్జునుడికి అంతకు ముందుదాకా పనిచేసిన అస్త్రాలు అకస్మాత్తుగా కృష్ణనిర్యాణం కాగానే అవే మంత్రాలు అదే అర్జునుడు వల్లిస్తే ఏ ఒక్కటీ వెళ్ళలేదు. అది కలియుగాదిలోనే చేశారు. మళ్ళీ కలియుగాంతం వరకు ఆ అస్త్రాలు తొక్కిపెట్టిఉంచారు. స్టే ఆర్డరులో ఉన్నాయి అవన్నీ. ఇది నశించి పోలేదు. కానీ, అవి పనిచేయవు. అంతే!

అందువలన ఈ ఆగమంలో చెప్పబడినటువంటి కుండము నుంచి అగ్ని తీసుకొచ్చి నాభిస్థానంలోకితీసి దాన్నుంచి హృదయంలోకి తెచ్చి దాని నుంచి మళ్ళీ కుండంలోకి పెట్టి దీన్ని 'సహస్రారే స్థాలే నిక్షిప్యే' అంటాడు. అట్లాగే శ్రీమన్నారాయణ విధానం కూడా. శ్రీమన్నారాయణ సంహిత అని ఇటువంటి కల్పమే ఉంది. దానిలో కూడా ఈ అష్టాక్షరీ మంత్రమును ఈ హృదయంలోకి తీసుకొచ్చి దాంట్లో నిక్షేపించి మూలాధారం నుంచి అగ్నిని కుండలినిని లేవగొట్టి దీన్ని తీసుకొచ్చి స్వాధిష్ఠానమునకు తెచ్చి ఈ విశుద్ధి చక్రమునందున్న వాయువుతోటి దాన్ని ప్రజ్వలింపజేసి దాన్ని మళ్ళీ తీసికొని వచ్చి దీంట్లో నిక్షిప్తం చేయమంటాడు. ఎలా చేస్తారు వాళ్ళు. ఎందువలనంటే ఈ కనెక్షన్స్ తీసేశారు. ఈ అగ్నికి అగ్ని, వాయువుకి వాయువు అలా పంచభూతాల్లో బయట ఉండే ప్రతి వస్తువుకీ శరీరంలో ఉండేటటువంటి ఈ దేవతలకును కనెక్షన్స్ ఈ బీజాక్షరాలు. ఇపుడు ఈ బీజాక్షరాలు ఉన్నాయి. కానీ అవిపలికితే పంచభూతాలు పనిచేయట్లేదు.

రాకెట్ ఇపుడు వేస్తున్నారు. అంతరిక్షంలోకి పోతోంది. నిప్పులు గక్కుతూ అక్కడ లాండ్ అవుతుంది. కానీ, అందులో వైర్ ఎవరైనా కనెక్షన్ తీసేస్తే ఆ రాకెట్ఉంటుంది. కానీ పోదు. అది అక్కడే ఉంటుంది. మ్యూజియమ్‌లో పెట్టుకోవాలి. ఆ రాకెట్‌ని మన దేవాలయంలాగా. కొన్నాళ్ళకు ఏమనుకుంటారు ప్రజలు - ఆ రోజుల్లో మూఢవిశ్వాసంతో నమ్మేవాళ్ళు ఈ రాకెట్‌లన్నీ ఎగురుతాయనుకుని నమ్మేవాళ్ళు. ఎగురు తున్నట్లు ఊహించుకునే వాళ్ళు, నిజంగా అది ఎగరదు అని. ఎలక్ట్రిక్ లైన్స్‌కి వైర్లుంటాయి, స్విచెస్ ఉంటాయి, కరెంటు లేదు కాబట్టి ఈ వైర్స్ అక్కడ పెట్టుకుని వాళ్ళు ఆడుకొనే వాళ్ళు (దేవతార్చనలాగా).' నిజంగాదాని ఫలితాలురావు అనుకుంటారు. కరెంటు అంటే తెలియని వారు ఏమనుకొం

టారంటే ఆ విద్యుత్తనేది కంటికి కనబడేదికాదు. ఆ కనెక్షన్ తీసేస్తే ఈ మొత్తం ఎలక్ట్రిక్‌పవర్‌హౌస్ ఎందుకుకట్టాడోకూడా బ్రహ్మదేవుడికి అర్థంకాదు.

అటువంటిది ఈ కనెక్షన్ పోగొట్టి మనకి ఈ దేవతలు డైరెక్ట్‌గా ఎటాక్షన్‌లోకి వస్తారు. ఈ బ్యాక్‌గ్రౌండ్‌తో వెనకాల ఇపుడు ఇచ్చినదంతా జనరల్‌నాలెడ్జి. ఇది లేకుండా మీరు శాస్త్రంచదివితే ఏమీ ప్రయోజనం లేదు. అందువలన శాస్త్రం చెప్పుకొస్తారే తప్ప అది ఎందుకు పనిచేయదంటే తెలీదంటారు. అది తెలియాలంటే ఈ బ్యాక్‌గ్రౌండ్ ఉండాలి. అపుడు ఈ యజ్ఞకర్మ ఏమిటి ? ఈ కల్పం ఏమిటి ? ఈ కలశస్థాపన ఏమిటి ? ఈ కుండం ఏమిటి ? ఈ అగ్ని ఎందుకు ? ఈ దర్భలెందుకు ? ఈ కూర్చ ఎందుకు? ఈ సంప్రోక్షణ ఎందుకు ? అవబృథం ఎందుకు ? ఈ మొత్తం అన్నిటికీ కూడా బయట జరిగే సృష్టిక్రమానికి ఇమిటేషన్ (అనుకరణ). బయట బ్రహ్మాండంలో బ్రహ్మకల్పాదియందు బ్రహ్మ ఎట్లా సృష్టించాడో మొట్టమొదట బ్రహ్మాండానికి గోళం సృష్టించాడు అది కలశం ఈ బ్రహ్మాండ గోళం. సర్వదేవతలూ దాంట్లోనే ఉన్నారు. అంతా త్రిమూర్త్యాత్మకం అందుకని 'కలశస్యముఖే విష్ణుః కంఠే ...' అందులో మొట్టమొదట సాగరం పెట్టాడట. అందులోనే మళ్ళీ వేదాలు ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అందులోనే పెట్టాడట. కలశ జలంలోనే ఉన్నాయట. జలములో ఎందుకు ఉండాలి అంటే సృష్టి ఆరంభంలో శ్రీమన్నారాయణ తత్త్వం జలతత్త్వంలో ఉంది. కాబట్టి సర్వదేవతలు వాళ్ళు మూర్తిని కట్టకముందు ఆ జలస్థితి లోనే ఉన్నారు వాళ్ళు. ఆ స్థితిలోంచి సృష్టి వచ్చిందని చెప్పేటటువంటి దాని ఇమిటేషన్‌గా (అనుకరణ) కలశస్థాపన, కలశంలో జలము, దాంట్లో సర్వ దేవతలనూ ఆవాహన చేసి తిప్పుతాడు గిరగిరా. అంటే పంచదార నీళ్ళలో వేస్తే ఉంటుంది కానీ కరిగి ఉంటుంది అట్లా ఈ దేవతలందరూ

కరిగి ఉంటారన్నమాట. జలస్థితిలో దాంట్లోంచి వాళ్ళని బయటకు తీసేటటు వంటి టెక్నిక్ యోగం పోయింది. మామిడాకులతో నీళ్ళు చల్లుతారు కానీ ఆ దేవతలు బయటకు రారు. అందుకని వాడిపేరు చెప్పి వీడిపేరు చెప్పి అవి సంప్రోక్షణ చేసుకోవాల్సిందే కానీ ఈ మంత్రజలం మీద పడితే భస్మం అయిపోతారని మంత్రం చెప్పుతుంది. ఇపుడేం భస్మంకాదది. అంటే దాని వెనకాలఉన్నటువంటి ఆ పవర్‌ను ఆ దేవతలని జలస్థితిలోంచి తీసి ప్రత్యక్ష స్థితిలోకి ప్రయోగించగలిగితే అస్త్ర విద్యలు సిద్ధి అవుతాయి. అపుడు బ్రహ్మ శీర్షం, బ్రహ్మదండం, బ్రహ్మాంబుజం లేకపోతే ఆ పుస్తకాల్లో అవి రాసి పెట్టి ఉంటాయి. బ్రహ్మశీర్షం కాదు నా శీర్షం ఇది పనిచేయదు అనుకుంటాడు. మంత్రం ఉంటుంది కాని పలుకదు అది. అంటే దేవతలందరూ తూష్ణీ భూతులై రిటైర్ అయిపోయినట్లు కూర్చుని ఉంటారు. అధికార తాసిల్దారుగా ఉన్నపుడున్న పవర్ రిటైర్డ్ తాసిల్దారుకెందుకు ఉంటుంది. అట్లా దేవతలకు కూడా రిటైర్‌మెంట్ ఉంది అది దేనినిబట్టి తెలుస్తుందంటే మళ్ళీ ప్రమాణం కావాలి ప్రతిదానికి అందుకని పూర్వం ఇంద్రుడుగాఉండి ఇంద్రపదవిని నిర్వహించి ఆ పూర్వపుణ్యాన్ని అంతటిని కూడా క్షయం అయిన తరువాత 'క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి' అన్నారు అంటే వాళ్ళయిదుగురును ఇంద్రులై పుట్టారు. పూర్వం ఇంద్రులు వాళ్ళే పాండవులు. మహాభారతంలో వ్యాసమహర్షిని ద్రౌపది పెళ్ళెప్పుడు అని ద్రౌపది తండ్రి అడుగుతాడు. ఎక్కడైనా ఉంటుందా ఈ న్యాయం. అయిదుగురుకి ఒక అమ్మాయి నివ్వడం అని. కాదు దీనికంతా కథ ఉందయ్యా. ఈ పాండవు లందరు అయిదుగురు ఇంద్రులు పూర్వం. పంచేంద్రోపాఖ్యానంలో ఉంది అవన్నీ. కథచెపితే వింటాడు. కాని పాంచాలుడు "ఏమో మీరు చెప్తున్న కథ నాకేమీ అర్థం కావట్లేదు." అపుడు వ్యాసులవారు మంత్రజలాన్ని వాడిమీద సంప్రోక్షించి

కళ్ళు తుడవగానే దివ్యజ్ఞానంకలిగి ఈ ఐదుగురు పాండవులును పూర్వ శరీరులై ఇంద్రునిలా కనబడతారు. కాబట్టి ఇంద్రుడుగాఉన్నా వాళ్ళు రిటైర్ అయిపోయాక పాండవులు అయ్యారని అర్థం. అంతేకదా గతంలో ఇంద్రులు వాళ్ళంతా. కాబట్టి ఎవరియొక్క పుణ్యం క్షీణం అయితే వాళ్ళు మళ్ళీ కిందికి వస్తారు. త్రిశంకుడు కూడా అంతే. ఇంద్రపదవి దాకాపోయి కిందకు వచ్చిన వాళ్ళు అన్నమాట. త్రిశంకుడికి కిందవాళ్ళు ప్రమోషన్ ఇస్తుంటే పైవాళ్ళు డిమోషన్ ఇస్తుంటే మధ్యన ఉన్నాడువాడు త్రిశంకుడు.అంటే దానికి కూడా వేరే జ్యోతిషపరమైన అర్థంవుంది, వూరికే చమత్కారంగా చెపుతున్నాను.

భూమి ఉత్తరదక్షిణ ధృవాలు తలక్రిందులయాయి. పూర్వం బ్రహ్మకల్పంలో ఈ తలక్రిందులైనపుడు సరిగ్గా ఉండేటువంటి త్రిశంకుడు తలక్రిందులైనాడు. ఇపుడు అవి మళ్ళీ తలకిందులౌతాయి. అపుడు సరిగ్గా వస్తారు. అపుడు ఏం జరుగుతుందంటే పాతాళంలో ఉండేటటువంటి బలి పైకి వస్తాడు. అభిజిత్‌లో సూర్యుడున్నట్టు నట్టనడిమికి పైకి వస్తాడు.అపుడు ఇపుడున్న ఇంద్రుడికి పదవీచ్యుతి కలుగుతుంది. అపుడు అడుగునున్న బలి పైకి వస్తాడు. అందుకని 'సావర్ణి మనోవేళన్...' సావర్ణి మన్వంతరం వచ్చినపుడు నీవు ఇంద్రుడవు అగుదువని వామనమూర్తి చెప్పాడు. అపుడు ఈ ధృవుడుకూడా పోతాడు మళ్ళీ ఇంకో ధృవుడు వస్తాడు. అందువలన ధృవోపాఖ్యానం కూడా అపుడు ధృవుడికి చెప్పాడన్నమాట. నువు కోరినటువంటి ధృవపదము ఇస్తాను కాని 24000 సం. తర్వాత నువు ధృవుడవుతావు అని. వీళ్ళువరం ఇస్తే వాళ్ళు 24000 సం. ఎందుకు ఆగాలి అంటే అర్థం 24000 సం.లకు మహావిషువత్ ఒక రౌండు తిరుగుతుందన్నమాట. పైనున్న ధృవుడు అట్టడుగుకి, అడుగునున్నవాడు పైకి వస్తాడు. పైనున్న వాడు ధృవపదము, అడుగునున్నవాడు బలిపదము. సౌత్ పోల్ బలిపదము,

నార్త్‌పోల్ ధృవపదము. అంటే ఇది శీర్షోదయకాలంలో గర్భస్థుడైన పిల్ల బాలకుడికి శిరస్సుకిందకు ఉండి పుట్టేంత వరకు ఎలా ఉంటాడో తిరిగి మళ్ళీ కిందకు రాగానే రివర్స్ అయి తిన్నగా ఉంటాడు. ఈ గర్భస్థపిండస్థితే త్రిశంకుడు. అది వాడు తిరిగి జన్మ ఎత్తినపుడు మామూలుగా వస్తుంది. ఇవి జ్యోతిష పరమైనవి, ఖగోళ పరమైనవి, గర్భస్థ పరమైనవి. అన్నిటికీ ఒకటే శాస్త్రం. త్రిశంకుడు నక్షత్రం ఉంది పైన ఆకాశంలో కనబడుతుంది. వెస్టరన్స్‌కు కూడా తల్లకిందులుగా అయినటువంటి లూసిఫర్ స్టార్ అని ఉంది వాళ్ళకు. దేవుడికి ఒక పెద్దకొడుకుపై దేవతా గణాలకి అధిపతిగా వచ్చేటపుడు అహంకారం వస్తుంది. ఆ వచ్చినపుడు పైన ఒక తన్ను తన్నాడట భగవంతుడు తన్నినపుడు వాడు తల్లకిందులై కింద పడ్డాడట. పడితే కిందంతా నరకంలో వాడి శిష్యులంతా ఉండి వాడిని సపోర్ట్ చేసి పైకెత్తారట.అందువలనవాడు పైకిపోకుండా కిందకురాకుండా తలక్రిందుగా వేళ్ళాడుతుంటాడు లూసిఫర్ అనేవాడు. పేరు ఏదైతేనేం? కథ సేమ్. అంటే ఆకాశంలో ఆ స్టార్ తలకిందులుగా ఉంటుంది. ఆ తర్వాత ఉత్తరాన ఏ నక్షత్రాలు ఉన్నాయో దాదాపు అలాంటివే దక్షిణాన ఉన్నాయి. నార్తరన్ ఫిష్, సదరన్ ఫిష్ అని ఉంది. స్పీసిస్ ఆస్ట్రాలసిస్ అని అంటే మీనరాశి. దక్షిణంలో దక్షిణార్థ గోళం ఆస్ట్రాలియా అంటే. స్పీసిస్ ఆస్ట్రాలియా అంటే దక్షిణ చేప. ఈ ఉత్తరంలో ఉండేటటువంటిది స్పీసిస్ - రేవతి నక్షత్రం. జెటో ఫిష్.

అలాగే మన పురాణంలో కూడా రెండూను మహా మత్స్య చరిత్ర, మత్స్యావతారం దేనికది రెండూ వేరే వేరే. ఒకటి సోమకాసురుడిని వధించి వేదాలను ఉద్ధరించడానికి వచ్చింది మత్స్యావతార చరిత్ర. రెండోది వైవస్వతమనువుకి మనువునిచేసి చేపల పడవమీద సప్తర్షులని కట్టి

తీసికెళ్ళినటు వంటిది మహామత్స్య చరిత్ర. వీడు దక్షిణ చేప. వాడు ఉత్తర చేప. ఈ రెండు కథలు చదువుతారు కాని ఎవడూ ప్రశ్నించడు. ఏమయ్యా మత్స్యావతారం అంటావు. ఒకసారి పడవలో ఋషులని లాక్కొని వెళ్ళా డంటావు. ఒకసారి సోమకాసురుడిని వధించి వేదాలను తెచ్చాడంటావు. ఇంతకీ మత్స్యావతారం ఇది చేశాడా ? అది చేశాడా? అని. ఒకటి మన్వంతర అవతారం. ఒకటి యుగాంత అవతారం. ఇంకొకటి కల్పాదియందు వచ్చేది శాశ్వతఅవతారం. అంటే మీనరాశియొక్క చివర రేవతి నక్షత్రం యుగతార యందు సర్వగ్రహాలు సంయోగం అవుతాయి.'చతుర్యుగాంతే సర్వేషాం గ్రహాణాంమీనాం తే స్థితాః అని రంగనాథ వ్యాఖ్య. భాగవతం గత ప్రళయం అయ్యేటపుడు 12 రాసులలో ఆఖరి రాశి అయినటువంటి మీనంలో ఆఖరి డిగ్రీలో అన్ని గ్రహాలు చేరి జీరో పాయింటు వద్ద మళ్ళీ సృష్టి ఆరంభం అయ్యేటపుడు మేషరాశిలో మొట్టమొదట అశ్వనీ నక్షత్రములో చైత్రమాసంలో ఆదివారంలో ప్రథమఘడియలలో మళ్ళీ సృష్టి ప్రారంభమవుతుంది. అందు వలన ఆఖరి కల్పంలో ఎక్కడ ఆగిపోయిందో సృష్టి ఇపుడు ప్రథమ కల్పంలో మళ్ళీ అక్కడ నుంచే ప్రారంభం అవుతుంది. అంటే ఏమిటి ఇదివరకుది ప్రళయకల్పం. ఇది సృష్టికల్పం. ప్రతి కల్పంలోనూ సృష్టి ఉండదు. ఆల్టర్ నేట్‌గా సృష్టి ఉంటుంది. రాత్రి తర్వాత రాత్రి రాదు. రాత్రి తర్వాత పగలు వచ్చి మళ్ళీ రాత్రి వస్తుంది. అందుకని ఈ రాత్రింబగళ్ళు జరిగేటటువంటిది ఎట్లా ఉంటుందో ఈ పగళ్ళు రాత్రిళ్ళు సృష్టి కల్పం ప్రళయ కల్పం రెండు రెండు వస్తాయి. అందులో ఒకటేమో ప్రళయ కల్ప చరిత్ర. సోమకాసురుడి చరిత్ర ప్రళయకల్పంలోది. అపుడు భూమిమీద కాని దేవతలు కానీ ఎవరూ ఉండరు. బ్రహ్మ కూడా నిద్రావస్థలో ఉంటాడు. మనం నిద్రపోయినపుడు మనం చదువుకున్నవి విన్నవి మరపు వచ్చినట్లుగా బ్రహ్మకు కూడా మరుపు

(విస్మృతి). వేదములు పోవడమంటే పుస్తకాలు, బైండు బుక్కులు కావవి బ్రహ్మజ్ఞానం. అపుడు విశ్వవ్యాప్తంగా ఉండేటటు వంటి జ్ఞానంకూడా మరుగునపడి మొత్తం విశ్వవ్యాప్తమైన అజ్ఞానం వస్తుంది. దాన్ని మళ్ళీ మనం నిద్రపోయిన తరువాత మనం ఒళ్ళు మరచి పోయి నిద్రపోతున్నాం మనని ఎవరు మేలు కొలుపుతున్నారు. మనస్సులో ప్రజ్ఞ దానంతటదే తెల్లవారుఝామున మేలుకొంటే తప్ప ఏ డాక్టరు లేపలేడు మనని. అట్లా తనంతటతనను తెల్లవారు బ్రహ్మముహూర్తం అపుడు లేపే ప్రజ్ఞ అంతర్యామిగాఉండే బ్రహ్మని మేలుకొలిపేందుకోసం ఈ మత్స్యావతారం. అది కల్పాదియందు జరిగే మత్స్యావతారం. అది మత్స్యపురాణం యొక్క చరిత్ర. మిగతా అవతారం ప్రతి పురాణాల్లో దశావతారాల్లో మత్స్యావతారం వచ్చేదివేరే ఉంది. మత్స్యపురాణం మొదట్లోవచ్చిన వాడికీ వీడికీ తేడా ఏమిటంటే కల్పాదియందువచ్చేది మహామత్స్యమువుందేవాడు సర్వశాస్త్రాలను భోదిస్తాడు.ఆ మహామత్స్యం చెప్పినటువంటి రాజుల కథ, మత్స్యపురాణంలో ఉంది. కలియుగంలో రాజుల పేర్లన్నీ ఇచ్చారు. ఈ మహామత్స్యం అంటే ఊరికే మత్స్యావతారం ఎత్తి నీళ్ళలో దిగి వేదాలను ఉద్ధరించి వాడుపోతే వీడు కొంతకాలం ఇవన్నీ ఉపదేశించాడు వాడు. అందుకని 'నమః కారణ నమఃఛాయ ప్రళయాబ్ధి చరాయ చ' మనువు స్తోత్రం చేశాడు. ఇది సంహారం అయిన తర్వాత నువు కారణమత్స్యానివి 'భగవన్ ఇహ లోకోయం మోహితస్థో మాయ'నీయొక్క మాయచేత జీవలోకం అంతాకూడా తలక్రిందులైపోతుంది. ఈ బ్రహ్మనేనూ ఒక జీవుడిని, నేను మాత్రం ఒక లెక్కేమిటి అన్నాడు. అంటే అవన్నీ భూమి మీదకు వచ్చే రామకృష్ణాది అవతారాల్లాటివి కావవి అక్కడ ఎక్కడో ప్రళయంలో ఇవి ప్రళయాది అవతారాలు. అందుకని ఉభయ మత్స్యావతారం అనగానే అన్నీ ఒకటే అనుకొంటాము. అదంతా

తప్పు. దానికోసం ఇంత బ్యాక్‌గ్రౌండ్ చెప్పాను. ప్రళయాంతంలో వచ్చేవి అలాగే మన్వంతరంలో వచ్చే అవతారాలు కూడా వేరే ఉన్నాయి. మన్వంతర అవతారం గజేంద్రమోక్షం చేసినటువంటి విష్ణుమూర్తి యుగాల్లో దశా వతారాలలో వాడు కాదు. తామసమన్వంతరంలో జరిగినకథ ఇది. అంతేగాక గజేంద్రమోక్షం భూమి మీద జరుగలేదు. ఈ భూమికి పైన త్రిలోకాలున్నాయి. ఈ త్రిలోకాల్లో వరుణలోకంలో జరిగిందది. 'తస్య ద్రోణ్యాం వరుణస్య మహాత్మనః' - మహాత్ముడైన వరుణుడి యొక్క సదస్సులో ఈ త్రికూటమనే పర్వతం కింద 'క్రౌంచనాయస్సౌగళ ధౌతమయములై ముడి శృంగంబులు మెలసియుండి' బంగారము, వెండి, ఇనుము ఈ మూడు కలసి శృంగంబులు అంటే మనకి త్రికూటస్థానంలో ఉండేటటు వంటి ఇడ, పింగళ, సుషుమ్న నాడులు ఇక్కడ మూడూ కలుస్తాయి. అది త్రికూట పర్వతము. అందు లోంచి జీవుడు వెళ్ళి బద్ధుడౌతాడు. సంసార చక్రంలో వాడు గజేంద్రుడు. ఈ మకరంలో చిక్కుతాడు. మకరానికి సంసారం ఏమిటంటే మకరం మన్మథ స్థానం. మకరకేతనుడంటాము. మనం మన్మథుడ్ని అంటే కామం అనేటటువంటి చక్రంలో చిక్కుతాడు వాడు చిక్కి దాంట్లో జన్మ, మృత్యువు అనేదాంట్లో పడతాడు వాడు. అది మకరం అనేటువంటిది. జీవుడు గర్భస్థుడు అవటం సంసారచక్రంలో ఇరుక్కోవడం అది ఆ త్రికూట స్థానంలో జరుగు తుంది. అది లోపల అంతర్గతమైన భాగవతం.

అప్పుడు విష్ణువు ఈ అవతారాల్లో ఉండే విష్ణువు కాదు. 'హరి' అనే పేరుతో ఉండేవాడు. 'హరిమేఘునకు పుట్టి హరిణియందు' హరి మేఘుడు అనే వాడికి హరిణి అనే ఆమెకి హరిగా అవతారమెత్తాడు. అది ఆ మన్వంతరంఉన్నంతకాలం ఆ భగవంతుడికి హరి అనియే పేరు. అందువలన మన్వంతర అవతారాల్లో వచ్చేవి ఇవన్నీ. మహామత్స్యము,

ఈ గజేంద్రమోక్షముతో అవతారం, తరువాత ధన్వంతరి అవతారం.

ఈ ధన్వంతరిఅవతారాలు కూడా రెండు ఉన్నాయి. ఒకడు దేవతలు పాల సముద్రం చిలికేటపుడు అందులోంచి అమృత కలశోద్భవుడై పుట్టాడు. ఇంకొకడు మన ఆయుర్వేదం తయారుచేసినవాడు కాశీ రాజై పుట్టాడు. అలా మహామత్స్యం వేరే, మత్స్యావతారం వేరే వలె చిన ధన్వంతరీ, పెద్ద ధన్వంతరీ వీళ్ళు వేరే వేరే. వాసుదేవుడి కొడుకుగా కృష్ణుడు పుట్టినట్లుగా కాశీరాజుకూడా మానవఅవతారం అంటే మానవుడి శరీరఉపాధిలో పుట్టాడు. ఇదికూడా వాడి రెండో అవతారం. భూమ్మీద కూడా ఇంతకుముందు సాక్షాత్తు ధన్వంతరిగా పుట్టిన అవతారం ఉంది దివోదాస్ పేరు లేకుండగా. అది కల్పాదియందు పుట్టే అవతారం. వాడేం చేసాడంటే అసలు అమృతమనేటటు వంటిది మొత్తం దేవలోకంలోనే సృష్టించాడు. దానికోసమే దేవాసురులు కొట్టుకు చచ్చారు. దేనికోసం కొట్టుకు చచ్చారో ఆ అమృతం తేదలచాడు వాడు. ఆ అమృతాన్ని గరుడుడు తీసుకొస్తు కిందకి, నాగలోకందాకా పట్టు కెళ్ళాడు. ఈ అమృతానికీ బోలెడంత కథ ఉంది. ఈ అమృతం ఉన్నచోటే విషం ఉంటుంది. ఎప్పుడూ అంతే. సముద్రం చిలికినపుడు హాలాహలం వస్తుంది. లేక గరుత్మంతుడు తెచ్చినపుడు పాములంటాయి. కిందన ఆ అమృతంకోసం. వినత ఉన్నచోటే కద్రువ ఉంటుంది. వాళ్ళకి శాపంవస్తుంది దాంట్లో. వీటన్నిటికీ లింకు గరుత్మంతుని ఉద్భవం. వినత యొక్క దాస్యం, గరుత్మంతుడు పుట్టటం, పాములును, పక్షులును అన్నదమ్ములవటం అంటే ఈ లోపల కిందకు వెళ్ళేటటు వంటివి తామస రూపం అయినటు వంటివి జీవులు సర్పములు. పైకి ఎగిరేవి శ్వాసతో అన్నీ గరుడ పక్షులు. అవి ఒకటి శుక్లగతి, ఒకటి కృష్ణగతి. శరీరంలో ఇడా, పింగళ నాడులున్నాయి. అవి శుక్ల, కృష్ణగతులు. ఒకటి వినత, ఒకటి కద్రువ. అందుకని గుర్రం

తెల్లగా ఉందంటే ఇంకొకటి గుర్రం నల్లగా ఉందంటుంది. ఈ నల్ల చేయడం కోసంపాములు పట్టుకొంటాయి. పాములంటే క్రిందఉండేవి. ఇవన్నీ నాగములు. వాటికి అమృతత్వంఇస్తే ఏమవుతుందంటే ఈ సెక్స్ perinent అయిపోయి బ్రహ్మజ్ఞానం నశిస్తుంది. అందుకని పాములకి అమృతం రాకుండా చూడ్డం కోసం ఈ గరుత్మంతుడు పైన శ్వాసరూపంలో కిందకుదిగి వచ్చాడు. గరుత్మంతుడు మామూలుగా ఎగిరే పక్షి కాదు. వాడు శ్వాస. 'గరుడో వాయువాహనః' అంటే శ్వాసే గరుత్మంతుడు. అంతర్గతుడైన వాడు సుపర్ణుడు. ఎందువలననంటే ఈ శ్వాస దేనితో ఏర్పడింది? ప్రాణంతో ఏర్పడింది. ఈ ప్రాణం దేనితో ఏర్పడింది. వైబ్రేషన్‌తో. అంటే మనం ఒక అక్షరాన్ని ఉచ్చరించినపుడు లోపల స్పందన కలుగుతుందే అది ఛందస్సు. ఈ ఛందస్సుతో ఏర్పడ్డవాడు గరుత్మంతుడు.

'ఛందోమయేన గరుడేన సౌహ్యామానః యస్సుపర్ణో యజుకనామ చ్ఛందోగాత్రః త్రివృశ్చరాః' అంటే ఛందస్సు శరీరమూను, ప్రణవం శిరస్సు కలిగినటువంటివాడు గరుత్మంతుడు. సుపర్ణుడు వాడి పేరు. వేదములో సుపర్ణుడు, పురాణములో గరుత్మంతుడు. ఈ గరుత్మంతుడు ఛందోమయమైన వాడు. ఛందస్సులు అనగా మనం వూరికే ఉచ్చరించే ఛందస్సులు కాదు. ఒక దాన్నికప్పి ఉండేటటువంటిది ఆచ్ఛాదన చేసేవే ఛందస్సు. పక్షికి పైన ఆచ్ఛాదన ఇచ్చేది కాబట్టి ఈకలు కూడా ఛందస్సులే. అందువలన దీనికి ఛందస్సులనగా మనం అనుకునే గాయత్రియే అనుకోనక్కరలేదు. ఈకలు కూడా ఛందస్సులే. చేపకి పొలుసులు ఎట్లాంటివో అట్లాగే ప్రాణంలో కూడా వైబ్రేషన్స్ ఛందస్సులు. ఈ అంతరంగంలో లోపల జీవుడనే పక్షి ఉన్నాడేవాడు గరుత్మంతుడు. వాడు భగవంతుడికి వాహకుడు. అంటే పరమాత్మకు జీవాత్మవాహకుడన్నమాట. అంటే వాహకుడేకాని వీడు

పరమాత్మకాడు. అందుకని శుద్ధాద్వైతము కాదన్నమాట. అక్కడనే విశిష్టా ద్వైతానికి వేదంలో స్థానం ఉంది.

'ద్వాసుపర్ణౌ సయుజా సఖాయౌ' - రెండున్నాయి సుపర్ణులు. 'ఏకం స్వా పిప్పలం స్వాద్వత్తి' అంటే ఒకటి పిప్పలము తిని సుఖదుఃఖములు అనుభవించి ఆనందిస్తుంది. ఇంకొకటి దీని సంతోషాన్నిచూసి అది ఆనందిస్తుంది. వాడు పరమాత్ముడు. ఒకడు క్షరపురుషుడు. ఇంకొకడు పురుషోత్తముడు. 'యస్మాత్ చరమతీతో హమ్ అక్షరాదపి పురుషోత్తమ హాతోస్మి లోకే వేదే చ' అని వేదంలో చెప్పబడింది. ఇది పురుషోత్తముడు. 'ప్రథితః పురుషోత్తమః'. ఈ పురుషోత్తముడంటే పిప్పలములు తినే ఈ రెండు సుపర్ణములలో చూస్తూ ఆనందించేవాడు. తిని ఆనందించేవాడు ఏంటంటే వాడు కర్ధువమల్లే కిందకు వెళ్లి శాఖల్లో చిక్కుకుంటాడు. 'ఛందాంస్తే యస్పపర్ణాని' అన్నాడే కోరికలే అవన్నీఅందులో ఉంటాయని, ప్రవాళములు అంటే కోరికలు తిని అనుభవించే వాడు దీంట్లో చిక్కుకుంటాడు సంగములో. అసంగత్వము అంటే రెండో పక్షి. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే గరుత్మంతుడు అనేవాడు జీవాత్మకు సంకేతము. లోపల జీవుడు భగవంతుని యొక్క వాహనము. వాహకుడు వాడు. ఎందుకని వాహకుడు అంటే శరీరం వదలిపెట్టి మనం వెళ్ళేప్పుడు జీవుడ్ని తీసుకెళ్ళడానికి ఏదోవిధానం ఉండాలి. దానంతట అది పోదు. ఇక్కడ నుంచి అక్కడకు జీవుడిని తీసికెళ్ళే టటువంటి వాడు గరుడుడు. జీవుడు పరమాత్మ స్వరూపంలోనే ఉంటాడు. కానీ జీవత్వం వాడికిపోదు ఇంకా అక్కడ అక్కడ వాడి కర్మలన్నీ వ్రాసి పెట్టుకొని తీసికెళ్ళి వాడిని ఎక్కడ చేర్చాలో అంతవరకే ఎయిర్‌లైన్స్ కంపెనీ వలె అంతవరకే గరుడుడు.

పైన సుపర్ణుడు జ్ఞానమయుడువాడు. అన్నీ తెలిసినవాడు ఇంకా పైకివెళితే వాడు పరబ్రహ్మహంస స్వరూపుడు అవుతాడు వాడు. పరమహంస అని అందుకని ఈ మూడులెవల్స్‌లోని ఆ సుపర్ణుడికి మూడు లోకాలు న్నాయి. కాబట్టి ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఈ సుబ్రహ్మణ్యుడికి లింక్ పెట్టకపోతే ఏమవుతుందంటే ఈ కథంతా పోతుంది. ఎందుకంటే ఏకముఖం చేసి చెప్పాలి శాస్త్రాన్ని ముందు విస్తారం చేశాను. తర్వాత సంగ్రహం చేశాను. తర్వాత సమాప్తం చెప్తున్నాను. అందువలన పైన దేవసభలో ఉండేటటువంటి దేవతల సదస్సుకి అధిపతి. ఎందుకధిపతి అంటే బ్రహ్మజ్ఞాన స్వరూపుడు కాబట్టి. బ్రహ్మజ్ఞాన స్వరూపుడికి సభాపతిత్వం ఎందుకంటే బ్రహ్మ అనేటువంటివాడు యజ్ఞానికి అధిష్ఠానదైవం కాబట్టి. ఏమీచేయకుండా అన్నిటినీ సమాధిస్థితిలో ఏకభావం చేస్తాడు కాబట్టి. ఎందుకని జీవుడుగా కూడా లోపల బ్రహ్మస్థితి ఇంద్రియాలలో చేస్తున్న పనులన్నింటినీ చూస్తూ ఇంద్రియాలలో వచ్చే సుఖదుఃఖాలు అనుభవిస్తూ దాంట్లో ఏమీ చేయకుండా దాంట్లో అన్నీఅయి ఉంటాడు కాబట్టి ఈ బ్రహ్మస్థానం సభాపతిత్వంకాబట్టి ఈ సుబ్రహ్మణ్యుడిది అదే స్థానం.

ఈ జీవుడిగా ఉన్నటువంటి సుబ్రహ్మణ్యుడికి మూడు కర్మేంద్రియాలు, మూడు జ్ఞానేంద్రియాలు అంటే మూడు చక్రములు అధో చక్రములు, మూడు చక్రములు ఊర్ధ్వ చక్రములు, ఇవి ఆరు కలసి షట్కోణ యంత్రమైంది. ఈ షట్కోణయంత్రము కాలచక్రంలో ఉండే ఆరుఋతువులు. ఆరు ఋతువులలో కూడా మూడు ఋతువులు ఉత్తరాయణం, మూడు ఋతువులు దక్షిణాయణం అయ్యాయి. అందువలన ఈ సుదర్శన మంత్రములో కూడా మూడు శక్తిబీజములు, మూడు ప్రాణబీజములున్నాయి. ఆ వివరాలు తెలియవు ఎవ్వరికీ, తెలిస్తే ప్రయోగించ గలుగుతాడు. ఈ

మూడు ప్రాణబీజములు సహస్రారంతో లింకు, మూడు శక్తిబీజములు మూలాధారంతో లింకు ఉంది. అందువలన గరుత్మంతుడి బొమ్మ ఎప్పుడు వేసినా కాళ్ళలో పాములే వేస్తారు. అంటే సుదర్శనంఎప్పుడు ప్రయోగించినా క్రింద మూలాధారంలో కుండలినితో కనెక్షన్ ఉంటుంది. అందువలన కుండలినితో ఎప్పుడైతే టచ్ ఉందో అది విషమన్నమాట (సెక్స్). విష హరుడు గరుత్మంతుడే మరల వాడు అమృతాన్ని తెస్తాడు కాబట్టి అమృతం తెచ్చిన వాడు పాముని వదిలిపెట్టడు. ఎందుకని అంటే పాముండాల్సిందే వాడికి. పాములు ఆహారంగా బ్రతుకుతాడు.

అంటే శరీరంలో ఉండేటటువంటి సెక్స్ ఎనర్జీయొక్క ఆహారంతోనే జీవుడు బ్రతుకవలెను. దానిని ట్రాన్స్ఫామ్ చేసి అమృతంలోకి మార్చి బ్రతకాలి కానీ దానిని చంపకూడదు. అందుకని కాళీయుడిని శిక్షించి వదిలాడు కానీ చంపలేదు. ఈ కుండలినీ శక్తిని దాని యొక్క తమస్సు రూపాన్ని తీసేసి జ్ఞానమయస్వరూపం చేయాలి అపుడు ఆదిశేషుడు అవుతాడు. వాడూ పామే కానీ జ్ఞానమయుడైన సర్పం అవుతాడు. అపుడు అనంతశేష గరుడుడు. ఇరువురు నిత్యముక్తులలో పైన వాళ్ళు హైయర్ ఫామ్ని ధరించిఉంటారు వాళ్ళు. లేకపోతే తక్షక, కర్కోట, నాగరాజు అనేటటువంటి వాళ్ళు పాతాళంలో ఏడుస్తుంటారు. వాళ్ళ బుద్ధులు వేరే. కథల్లో కూడా వాళ్ళ బిహేవియర్ వేరుగా ఉంటుంది. వాడు ఆదిశేషుడు నిత్యముక్తుడు. వాడికింకేం గొడవేమీ లేదు. విషమెక్కడా లేదు వాడికి, నిర్విషమైన సర్పంవాడు. అందువలన ఈ కుండలినీ శక్తిని శరీరంలో కామక్రోధాదుల నుంచి ఫిల్టర్చేసి ప్రాణాయామంద్వారా దాన్ని పైకి తీసికెళ్ళి ఈ గరుత్మంతుడు శ్వాసద్వారా భస్మీకరణంచేసి, భస్మంచేస్తారు. ఆయుర్వే దంలో అలా దాని దోషాలు నివృత్తి చేసినట్లైతే అపుడు అమృతీకరణ చేస్తాడు

వాడు. సుపర్ణుడు పైకి తీసుకెళ్ళేవాడు. అమృతాన్ని తీసుకెళ్ళినవాడు అలా పోతేకాదు మళ్ళీ వాడు క్రిందకువచ్చి ఈ శరీరాన్ని పావనం చేయాలి. అందువలన వాడు మళ్ళీ కిందకు తీసుకువచ్చి తల్లి యొక్క దాస్యాన్ని వదిలిపెట్టాలి. ఈ దాస్యం ఏమిటంటే ఈ శరీరంలో అంతర్గతమైన జీవుడు కర్మబద్ధుడు (దాస్యం) వినత దాస్యం ఆ కర్మబంధాన్ని వదిలించి అపుడు వాడు పుట్టిన ప్రయోజనం. జీవుడు ఎందుకు పుడతాడు అంటే కర్మ బంధము నుంచి శరీరాన్ని (శరీరము అంటే తల్లి) ఉద్ధరించాలి. ఇదీగొడవ. దీనిలో ఈ సుబ్రహ్మణ్యుడు అనేటువంటివాడు పాము స్వరూపంలో అడుగున ఉండటానికి కారణం అది. అందువలన ఈ సుబ్రహ్మణ్యుడికి సర్పరూపం ఇవ్వడానికి కారణం అది. అంటే కిందకి మూలాధారంలో వచ్చినపుడు జ్యోతిషంలో ఈ షట్కోణాల్లో చెప్పే మూడేమో అగ్నికోణములు. మూడేమో జలకోణములు. జలములో కర్కాటక, వృశ్చిక, మీన ఈ మూడు జలరాశులు. వృశ్చికం అన్నిటికంటే అట్టడుగుది. ఎందుకంటే చంద్రుడు నీచ స్థానం. అదిసెక్స్ సెంటర్. వృశ్చికమే మనిషియొక్క సెక్స్‌కేంద్రం. అది విషస్థానం. అక్కడ ఉండేటటువంటి పాములు అందరూ తక్షక, కర్కోటక, నాగరాజు లంటారు. మీనంలో ఉండేటటువంటి వాడు ఆదిశేషుడు మోక్షస్థానంలో ఉంటాడు. కాని జ్ఞానమయ స్వరూపంలో ఉంటాడు. అందువలన ఈ మూడును జలమునకు సంబంధించినవి. జలాల్లోనే ఉంటాయి పాములు.

'నమో అస్తు సర్పేభ్యో యేతే చ పృథివీ మను యే అంతరిక్షే ...... సర్పేభ్యోనమః' ఈ సర్పములు నీళ్ళలో ఉంటాయి. సూర్యుడిలో ఉంటాయి. 'ఏషామప్పుసుదం కృతం' - నీటియందు నివసిస్తున్నాయి. వాటికి 'తే సూర్య స్సురశ్మి' సూర్యరశ్మిలో కూడా పాములున్నాయని చెప్తున్నాడు సూర్య రశ్మిలో పాములెట్లా ఉంటాయి? ఉండవు మండిపోతాయి. అయినా కాని

వేదం సూర్యరశ్మిలో పాములుంటాయని చెప్తోంది. అంటే లైట్ (జ్యోతి) వేవ్‌లెన్త్‌లా వెళ్తుంది సైన్సువాళ్ళు చెప్పిందాన్ని బట్టి. అది దివ్యచక్షువులతో చూస్తే కాంతిలోఉండేటటువంటి ఈ దివ్యసర్పములు. సర్ప అంటే కదలుట అని అర్థం. సరీసృప-సర్ప-సృప సర్ప ధాతువులు. అందువలన ఈ కాంతి కూడా వంకరటింకరగా కదులుతుంది. కాబట్టి అవి దివ్యమైన సర్పములు. ఛాయ (డార్క్‌నెస్) కూడా అట్లాగే సర్పంలా వెళ్తుంది కాబట్టి రాహువు వాడు. ఛాయలోఉండే సర్పంవాడు, తెలుపులో ఉండే సర్పం వీడు. అందుకని ఒక తెల్లపాము ఒక నల్లపాము రెండూ జంటగా చెట్లకింద వేస్తారు. ఎందుకంటే ఒకడు సంతానంకోసం పూజచేసే పాములు జంటసర్పాలవి. నాగులచవితి పుట్టలోపోయటంఏమంటే వల్మీకం శరీరం నవద్వారములు కలిగిన వల్మీకం పుట్టకాదు. శరీరమే అది. ఏమవుతుంది ఈ ప్రాణ స్వరూపం శ్వాసద్వారా పాలులోపలికి వెళ్ళి అది ఆహారమై ఆ ఆహారంకాస్తాధాతువై ఆ ధాతువే రేతస్సయి ఆ రేతస్సు సంతానమై వస్తుంది. కాబట్టి ఆ పాలు పాముదాకా పోవాలని మాట.

అందువలన కింద సుబ్రహ్మణ్యేశ్వరుడు ఈ ఆరు చోట్లను ఆరు సుబ్రహ్మణ్య క్షేత్రాలు. ఒకటి తిరుక్కోయిులూరు, ఒకటి తిరుచెందూరు, ఒకటి పళని ఇలా ఒక్కొక్కటి ఒక్కోమూర్తి ఏది ఎక్కడుందో ఈ బ్యాక్‌గ్రౌండు తెలిసినవాడు పట్టుకోగలుగుతాడు. ఒకడు కార్తికేయుడు. సేనాని అంటే ఆయుధాలు ధరించి విష్ణుమూర్తివలె ఉంటాడు. వాడు నెమలి వాహనం మీద ఉంటాడు. ఈ దండాయుధపాణి క్షౌరపుచ్చుకొని గుండు కొట్టించుకొని ఉంటాడు. ఇవి ఏమీ ఉండకుండా సన్యాసిగా ఉండేవాడు సుబ్రహ్మణ్యుడు. అట్లాగే వల్లీ దేవసేనలతో ఉంటాడు. ఇంకో ఆయన అంటే ఇడా, పింగళ నాడులు రెండింటిలోను పరిపూర్ణ జాగృతస్థితిలో ఉంటాడు. అది ఆరు

కృత్తికలలో ఉండేటటువంటి కృత్తికాసురుడు. ఆరు నక్షత్రాలలో ఉండేటటు వంటివి ఆరు చక్రాలు వెలిగినపుడు కనబడతాడు. కార్తీక పౌర్ణమినాడు ఉంటాడు వాడు. కార్తీక పౌర్ణమినాడు మాత్రమే సాక్షాత్కరించేవాడు శరవణ భవుడు. వాడు తారకాసురుడ్ని చంపుతాడు. ఎందుకంటే తారక అంటే నక్షత్రం తారకాసురుడులో అసురుడు అంటే రాక్షసుడు అని కాదు. 'అసు' అంటే ప్రాణం. 'అసురః' అంటే ప్రాణం ఇచ్చేటటువంటివాడు. అందుకని మనకివేదంలో అసురుడు అంటే రాక్షసుడని అర్థం లేదు. పురాణాల్లో వచ్చింది కాని ఆ అర్థం! ఇపుడు మనకి పార్శీదేశంలో కూడా వేదం ఉంది. అవే మంత్రం అవే పేర్లు అవే ఉన్నాయి. వాళ్ళదాంట్లో భగవంతుడిని అసురుడు అంటారు. భగవంతుడు అంటే వాళ్ళకి రాక్షసుడు వాళ్ళ గాడ్ పేరేమిటంటే 'అహూరా మజ్దా' అంటారు. అహూరా అంటే అసుర అనిమాట, 'మజ్డా' అంటే మహత్ అని అర్థం.

ఒకడు యునైటెడ్‌నేషన్స్‌లోని వేదసదస్సులో చెప్తున్నాడు. ఆహూరా మజ్డా అంటే ఈ పార్శీవాళ్ళకి దేవుడు, హిందువులకి రాక్షసుడు అని. హిందువులకి రాక్షసుడుకాడు, హిందువులకికూడా దేవుడే అని నేను అనేటప్పటికి మన పండితులు అంతా లేచారు. హిందువులకి అసురుడు దేవుడెలా అవుతాడు అని. 'మహద్యసురః' అనిఉందా లేదా అన్నాను. భగవంతుడికి 'తస్యనామ మహద్యసురః' అంటే 'అసు' అంటే ప్రాణము. అసురః అంటే ప్రాణాల్ని ఇచ్చేటటువంటివాడు.

అలాగే చతుర్భుజుడు విష్ణువు. దేవతలలో సుబ్రహ్మణ్యుడున్నట్లే వైష్ణవాగమంలో విష్ణువున్నాడు. ఈ విష్ణువు కూడా జీవస్వరూపుడే. అదే రూపం. రూపాంతరం వీళ్ళిచ్చారు. గణపతే విష్వక్సేనుడైనట్లు. చతు

ర్భుజములు ఎందుకు అని అడిగితే ఆ (యునైటెడ్‌నేషన్స్)సదస్సులో ఎవరు సమాధానం చెప్పలేదు. చతుర్భుజములంటే నాలుగు చేతులుంటా యని స్తంభాలలాగా అని అర్థం కాదు. చతుర్భుక్ ఆహారాన్ని 'పంచామృన్నం చతుర్భుజం' - ఆ చతుర్విధం అన్నాడే ఆ చతుర్భుక్ వాడు. ఈ జీవుడు నాలుగు విధాలుగా భుజిస్తాడు కాబట్టి వాడు చతుర్భుజుడు. 'చతుర్భుక్ చతుర్భుజః' అని భావించాలి. ఆ టైమ్‌కిముడిపెట్టే సమన్వయం కాదు అది. అందులోనే ఉన్నదది. ప్రకాశమానం కావాలి అది.

'నాహం ప్రకాశస్య సర్వస్య' అన్నాడే అందరికీ ప్రకాశం కాదది. 'యోగమాయో సమావృతః' మనలోనే మాయగా కప్పబడి ఉంటుంది. అది ద్వారాన్ని తీసినట్లు తీయాలన్నమాట. 'అపాన్పృణం' తెరుచుకుంటుందదే. బ్రహ్మజ్ఞానం ఎలా ఉంటుందంటే ఉపనిషత్‌లో చెప్పాడు. 'హిరణ్మయేన పాత్రేన సత్యస్యాపిహితం' అంటే హిరణ్మయమైన పాత్రలో మూత కప్పి ఉంటుందంట. 'సత్యస్యాపి హితం' అంటే సత్యం రక్షింపబడి ఉంటుందట. 'తత్తే పూషన్' పూషన్ అనే ఓ సూర్యుడా 'అపాన్పృణం' తెరతీసినట్లు తీయ మన్నాడట. 'సత్య ధర్మాయ సిద్ధయే' సత్యం ధర్మం మాకు జీవితంలో సిద్ధించాలంటే ఆ మూత తీసేయమన్నాడు. మాయావరణం గురించివాడు తెరతీయరాదా అన్నాడే. అందువలన ఇది భాసించాలంటే ఈ మాయా వరణం లోపల హృదయంలో ఉండేటటువంటి ఆరుద్ర పురుషుడికి సంబంధం. కాని మన విశిష్టాద్వైతమునకు సంబంధించిన ఈ ఆరుద్ర పురుషుడు గురించి వీళ్ళకి తెలియనే తెలియదు. వాళ్ళకి ఆరుద్ర పురుషుడి దయ కలిగితేనే ఇవన్నీ జరుగుతాయి. దానికి దయ కలగడానికి వేరే పద్ధతులున్నాయి. అది వేరే సబ్జెక్ట్ కనుక ఇపుడు ఎత్తుకోవట్లేదు.

కాబట్టి ఈ సుబ్రహ్మణ్యుడి యొక్క ఆరు స్థానాలను 'పడైవీడు' అంటే స్కందావారం. సేనలను తీసికొని తారకాసురుడిని జయించడానికి సుబ్రహ్మణ్యుడు వెళ్ళేడట. దేవతలయొక్క సేనలు అన్నీ తీసుకొని రాక్షసుల్ని అందర్నీ జయించడానికి సురపద్ముడనే వాడి మీదకి దండయాత్ర చేసేడట. అలా చేసినపుడు మధ్య మధ్య సేనలను ఆపుకుంటూ వెళ్ళాడట. ఆర్మీ ఎక్కడెక్కడ ఆగుతుందో స్టేషన్స్ అన్నమాట ఈ ఆరును. 'పడైవీడు' అంటే సేనలు ఆగినచోటు. అందువలన దక్షిణాదిలో ఏం చెప్తారంటే ఎక్కడైతే సుబ్రహ్మణ్యేశ్వర స్వామి సేనలు ఆపాడో దండుస్థావరాలివి. అలాగే శరీరంలో ప్రాణం ఎక్కడెక్కడ ఆగుతుందో రోజులో 24 గంటల్లో అవి పడైవీడు ఆరు స్థానాలూను. 'మనస్సషష్ఠాని ఇంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి' శరీరంలో ఉండే మనస్సు మిగతా అయిదు ఇంద్రియాలు కలిసి ఆరుగా పనిచేస్తే వీడు షణ్ముఖుడు సుబ్రహ్మణ్యుడు ఈ ఆరున్ను. 'శరీరం యదవాప్నోతి' ఇందాక చెప్పా శరీరంలో ఉండే జీవుడిని తీసుకెళ్తుందని 'యచ్చాప్యుత్క్రామతీశ్వరః' వాడిని ఉత్క్రమణం తన శరీరంలోంచి బయటకుపోయేప్పుడు తీసుకెళ్ళేది కూడా వాడే. 'వాయుః గంధాః' వాయువు వాసనని తీసుకెళ్ళినట్లుగా శరీరంలో ఈ జీవుడిని మోసుకెళ్తుందట ఈ వాహనం. ఈ సుబ్రహ్మణ్యుడియొక్క ఈ ఆరుచక్రాలు లోపలచేసే పనేమిటంటే ఇది. ఈ ఆరున్నూ సేనలు విడిచే టటువంటి స్థానాలన్నమాట. అంటే అక్కడక్కడఆగుతుంది ప్రాణం స్థానాల్లో.

ఆయుర్వేదంలోకూడా అష్టమర్మస్థానాలున్నవి అంటారు. ఈ అష్ట మర్మస్థానాల్లో ప్రథమమైనటువంటి సహస్రారం, అట్టడుగున మూలాధారం వదిలేస్తే మిగతా ఆరుఉంటాయి. అందువలన ఈఆరింట్లో ఎక్కడైనా దెబ్బతగిలినా ప్రాణానికి ప్రమాదం. అవి ప్రత్యేకమైన సెన్సిటివ్ పాయింట్స్. అక్కడనే ఈ అష్టాక్షరి న్యాసం కూడా చేయాలి ప్రాణస్థానాల్లోనే.

ఇది సుబ్రహ్మణ్యుడి కథ. మీకు కొంత అర్థం అయి ఉంటుంది. కొంత అర్థం కాదు. అర్థం కాకపోవడం ఎందుకంటే మనం అంత స్థితికి ఎదగలేక పోవడం, అందులో చెప్పేవిషయాలు చాలా మటుకు మనకు పరిచయం లేనటువంటివి. కాని ఎప్పుడూ పరిచయం లేకపోతే అలాగే ఉంటాం కాబట్టి కొంతన్నా పరిచయం చేసికోవాలి. అందుకని అర్థం అవుతుందా లేదా అని పట్టించుకోకుండా కొంతముందు వడ్డిస్తే తిన్నంత తింటాడు అన్నప్రాశన అన్నమాట. ముందుమొహం అదోరకంగా పెడతాడు అన్నప్రాశన అనగానే రేపు మళ్ళీ పెట్టమంటాడు.

అందువల్ల ఈ సుబ్రహ్మణ్యుడు సదసస్పతి ఎందుకయ్యాడు? సభాపతి, ఆరుముఖాలు ఎందుకు వచ్చాయి? పాము ఎందుకయ్యాడు? కృత్తికాసురుడు కృత్తికలు ఎందుకయ్యారు? కార్తికేయుడు ఎందుకయ్యాడు? సుబ్రహ్మణ్యుడు బ్రహ్మణ్యుడు ఎందుకయ్యాడు? బ్రహ్మజ్ఞానం తండ్రికి ఉపదేశించాడు కాబట్టి కుమారగురువు. కుమారుడుగా పుట్టి తండ్రికి గురువయ్యాడు. 'కుమారగురవే నమః' అంటే కుమారుడుగా పుట్టడం అంటే పైన పరబ్రహ్మ అంశయే జీవుడిగా శరీరంలో జన్మిస్తాడు. జన్మించేవాడే కుమారుడు. పుట్టి బ్రహ్మజ్ఞానంతో వీడు తానే అదియై వాడిక్కూడా జ్ఞానాన్ని ఉపదేశించగల్గుతాడు పురుషోత్తముడై.

అందుకని వాళ్ళ క్రిష్టియానిటీలో కూడా ఫాదర్, సన్, హోలీఘోస్ట్ అని ఫాదర్ అనేది మొట్టమొదట జగత్తంతా విశ్వవ్యాప్తమైన ఈ పరబ్రహ్మ తత్త్వము అందులోంచి జీవుడిగా దిగే సన్ అట. ఈ జీవుడు సర్వం తానే అని తెలిసిన తరువాత హోలీఘోస్ట్ అని ఈ ట్రినిటీ అంటారు. శుద్ధాద్వైతము కాదది అంటే భగవంతుడుకి మూడు.

ఈ షట్కోణములలో మూడు అగ్నికోణములు, మూడు జలకోణములు, మూడు అగ్నిరాశులు, మూడు జలరాశులు. అందులో ప్రథమమైంది మేషం, సింహం, ధనుస్సు. మేషం కృత్తికా అంతం కదా కృత్తిక మొదటిది అగ్నిరాశి. అది కుజదోషానికి సంబంధించినది. రెండోది వృశ్చికం కుజుడి యొక్క రెండో ఇల్లు. దానికి సంబంధించినవి ఈ రెండూ. సింహానికేమీ లేదు ఈ దోషం. అక్కడ సుబ్రహ్మణ్యక్షేత్రాలలో కూడా ఈ మేషానికి సంబంధించినవి, వృశ్చికానికి సంబంధించినవి అని వేరే ఉన్నాయి. ఒక చోట కోడి వాహనం ఉంటుంది, ఇంకో చోట నెమలి వాహనం ఉంటుంది. ఈ రెంటికీ తేడాఅది. కోడి ఏమో ఈ కృత్తికలు. పిల్లలకోడి అంటారు ఆకాశంలో ఈ నక్షత్రాన్ని. ఎందుకంటే, అది కోడిలాగా ఉంటుంది. ఆ కృత్తికలు పెరిగేచోట ఈ కోడి వాహనం వాడికి. వృశ్చికంలో అయితే నెమలి వాహనం. ఎందుకంటే జ్యేష్ఠా నక్షత్రంఉంది వృశ్చికంలో. జ్యేష్ఠ ఇంద్రుడినక్షత్రం. ఇంద్రుడు సహస్రాక్షుడు. నెమలికి అన్నికన్నులున్నాయి కదా. అలాగే అది మృత్యుం జయస్థానంకూడ. మృత్యుస్థానం ఎనిమిది. జ్యేష్ఠాంతం గండాంతం. జ్యేష్ఠా నక్షత్రం చివరలో నక్షత్రమూ అంతమవుతుంది. రాశి అంతమవుతుంది. అది గండాంతం, విషస్థానం. దాన్నిహరించేది నెమలి. నీలకంఠం. నీలకంఠం అంటే ఏమిటి? రుద్రుడికుంటుంది. నీలకంఠం నెమలి కుంటుంది. తర్వాత వృశ్చికంకూడ. నరకంపైన ఊర్ధ్వలోకాల్లో నరకం విషస్థానం పాములవి ఉంటవి. వాళ్లు వాసుకిని పెట్టి మందర పర్వతంలో అక్కడ తీసి రాస్తేనే అక్కడ్నుంచే వచ్చింది కాలకూట విషం. దాన్ని కృత్తికలనుంచి కంట్రోలుచేసి విషాన్ని హాలాహలాన్ని ఆపేసాడట, నీలకంఠ మూర్తి మృత్యుంజయమూర్తి. అంటే ఈ సెక్స్‌లో ఉండేటటువంటి ఈ కామం అనేటటువంటి అగ్నిని జయించి దాన్నిజ్ఞానం కింద మార్చగలి గితేనే మృత్యుంజయం కలుగుతుంది. అపుడు

అది అమృతం అవుతుంది లేకపోతే మృతం అవుతుంది. 'అ' ఒకటే తేడా రెండిటికీ. ఆ వృశ్చికంలో ఇది విషం, విషహరం రెండూ పక్కనే ఉన్నాయి. నెమలికి ఈ విషహరం కాళ్ళమధ్యా పాముంటుంది. మళ్ళీ అదే వైష్ణవ సంప్రదాయంలో గరుత్మంతుడు వాడి కాళ్ళలో పాము. విషం తీసి వాడు పైనుంచి వచ్చి విషందాకా తీసుకెళ్ళి అమృతం వాళ్ళకిచ్చి వాళ్ళని తిననీయకుండా మళ్ళీ పట్టుకుపోతాడు ఇంద్రుడి దగ్గరకు. అక్కడే ఇంద్రు డుంటాడు. పాముల్ని మోసంచేసి దర్భల్ని మీద పడేస్తాడు. ఎందువలనంటే ఈ దోషం పోవాలంటే దర్భలతో హోమం చేయాలి. కేతుస్థానం అది. పూర్వ కర్మకు సంబంధించిన వాడు కేతువు. కుజుడు ఎలాంటివాడో 'కుజవత్ కేతుః' అలాంటి వాడు కేతువు. అందుకని కేతువు అక్కడ వృశ్చికాంతంలో ఉంటాడు. అందువలన వాడికి ఆ కర్మవచ్చే తరువాతి జనరేషన్ జీన్స్‌కు సంబంధించిన కర్మ తత్సంబంధమైన దోషం కేతువుది. ఇది విషహరమైనటు వంటి స్థానం.

పాములకి అనేక రూపాలిచ్చాడు వాసుకి, తక్షక, ఆదిశేషుడు. మూడు లోకాల్లోను మూడురూపాలుంటాయి. శేషుడు మోక్షస్వరూపుడు పైన ఉంటాడు. వాసుకి దేవతలకి, రాక్షసులకి సమానస్థాయి. ఇద్దరికీ దొరుకుతాడు వాడు. తక్షకుడు పూర్తి రాక్షస స్వరూపం వాడు. అందువలన త్రిలోకాల్లోనూ ఈ సర్పంయొక్క మూడు aspects ఉన్నాయి.

సుబ్రహ్మణ్యుడు దేవసభలో ఒక రకంగా ఉంటాడు. కార్తికేయుడుగా, సేనాపతిగా ఒకరకంగా ఉంటాడు. భూమి మీద తిరిగినపుడు మానవ రూపంలో దండాయుధపాణిగా ఉంటాడు. ప్రతి దేవతకు మూడు రూపా లుంటాయి. అంటే మూడులోకాల్లోనూ సృష్టి same. Same కాపీలుంటాయి.

శరీరంలో మళ్ళీ అవే ఉంటాయి. అందుకని ఇవి ఏమిటో అని డౌట్ వస్తే రెండో దానిని బట్టి check చేసుకోవడమే. శరీరాన్నిబట్టి చూస్తే మిగతా వాటిల్లో clearగా ఉంటాయి. పైవాటికి అనుమానంవస్తే దీన్నిబట్టి దానికి సరిపోతుంది. వీటికి అందే స్థాయి వేదమంత్రాలు. చదువుకుంటే ఆ డౌట్ వచ్చినపుడల్లా దానికి అర్థం భాసిస్తోంది. అవి కరెక్టుగా తాళానికి తాళం చెవిలాగా ఫిట్ అవుతాయి. అందువలన నాకు ఆశ్చర్యంగా ఉంటుంది ఒక్కోసారి. ఎంత పర్ఫెక్టుగా సూటవుతాయో జ్యోతిషానికి, మంత్రశాస్త్రానికి, ఆయుర్వేదానికి, మరి వీళ్ళందరికి ఎందుకు తట్టవా ఈ పాయింట్స్ అవే చదువుతారు నాకంటే ఎక్కువగా చదువుతారు రోజూ అదే పని వాళ్ళకి.

అందువలన శరీరంలో ఉండే ఆరు కోణాల్లోనూ ఈ స్వాధిష్ఠాన కోణంలో ఉండే సుబ్రహ్మణ్యుడు సర్పరూపంలో ఉంటాడు. మిగతా వాటిల్లో సర్పరూపంలో ఉండడు. కార్తికేయుడుగాను, షణ్ముఖుడుగాను, శరవణ భవుడుగాను ఉంటాడు. అన్నిచోట్లా షణ్ముఖుడుగా ఉండడు. మళ్ళీ పళనిలో ఒక ముఖమే ఉంటుంది. కృత్తికలు కార్తికేయుడు తిరుక్కోయిలూరు వాడు సేనాపతి. భారతంలో మొట్టమొదట వాడు సేనానియొక్క వ్యుత్పత్తి చెప్పాడు. అది కుజదోషాలు అన్నీ పోగొడుతుంది ఆ మంత్రం చదివితే. రామాయణంలో కూడా సుబ్రహ్మణ్యేశ్వర స్వామియొక్క, కార్తికేయుడియొక్క ఉత్పత్తి చెప్తాడు. విశ్వామిత్రుడు రాముడికి రేపు పెళ్ళవుతుందనగా ఆ ముందు రాత్రి కూర్చోబెట్టి చెప్తాడు. కుజదోషం రాముడికుంది జాతకంలో. అందుకోసం చెప్పాడు ఆ కథ. సప్తమములో కుజుడున్నాడు. కర్కాటకలగ్నం కదా రాముడిది. అందుకని కుజదోషం ఉంది. అందువలన సుబ్రహ్మణ్యుడికథ చెప్పాడు. ఈ దేవతలు రావడం, సుబ్రహ్మణ్యుడు ఉద్భవించడం, ఇంద్రుడు వాడిని జయించాలనుకోవడం. ఇంద్రుడికన్నా బలవత్తరమైనవాడు, మహా

బలవంతుడు సుబ్రహ్మణ్యుడు. అప్పుడు ఇంద్రుడు శరణాగతి చేసి తన ఇంద్రపదవిని వాడికి ఇచ్చేస్తాడు.

అపుడు సుబ్రహ్మణ్యేశ్వరుడు నాకెందుకు అంత ఆశ లేదు. నీ ఇంద్రపదవి నీవే ఉంచుకో. నీకేదన్నా ప్రమాదం వస్తే నేను రక్షిస్తానని చెప్పాడు. ఇటువంటి వాడికి ఏదైనా పదవి ఇవ్వకపోతే మన పదవి పోతుందనే భయం చేత ఛీఫ్ మినిష్టర్ పోస్ట్‌లాగా వీడికి సేనాపతి పదవి ఇచ్చాడు వూరికేఉంచకుండా అటువంటివాడిని.

అదే మన వైష్ణవ సంప్రదాయంలో ఇంద్రుడికి ప్రక్కన విష్ణువు ఉపేంద్రుడుగా ఉన్నాడట. కాని విష్ణువు ఇంద్రుడుకంటే బలవంతుడు.కానీ ఉపేంద్రుడువాడు. ఇంద్రుడికి తమ్ముడట అంటే కార్తికేయుడు కూడావాడే సుబ్రహ్మణ్యుడు. శైవ సంప్రదాయంలో అది. వైష్ణవ సంప్రదాయంలోఇది.

సుబ్రహ్మణ్యుడికి పాము అడుగున ఉన్నట్లే మనకి శేషపాన్పులో పాము ఎలాగూ ఉంటుంది. పాము లేకుండా ఉండదు దేంట్లో. అందుకని మూలాధారంలో సర్పములు పైన గరుత్మంతుడు రెండూ గరుడశేషులు ఇద్దరుంటారు. అందుకని నాచన సోముడు 'పన్నగమ్ముల రేడు పగవాడు కూడి నీవు పయనంబు శయనంబు సంతరింప'. వ్యతిరేకస్థులైన వారందర్నీ పక్కన చేరతీస్తాడు. వాడ్నిటు వీడ్నటు బ్యాలన్సులో ఉంచుతాడట. ఎవడ్ని పోనివ్వడు ఎవడ్ని ఓడనివ్వడు. విష్ణువు, కొట్టుకు చచ్చే పాముల్ని గరుడుల్ని చేరదీస్తాడు.

ఒకసారి నేను శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ఇంటికెళ్తే -

వి.స. : ఎందుకొచ్చావు ?

వేదవ్యాస: పత్రిక పెడుతున్నాను.

వి.స.     : ఎందుకు పత్రిక ?

వేదవ్యాస: 'ధర్మం ప్రపంచంలో అన్ని చోట్ల పోతూంది. కాస్త ధర్మ ప్రచారం చేద్దామని' - మనం చెప్పేదంతా చెప్పాము.

(ఆయన ఇంక దేనితోనో విసిగిపోయి ఉన్నాడు)

వి.స.     : 'ధర్మం లేదు, ఏం లేదు, ఇదంతా నాన్సెన్స్'

వేదవ్యాస: అదేమిటండీ అలా అంటారు.

వి.స.     : మీ విష్ణువు ఉన్నాడే ...

వేదవ్యాస: మా విష్ణువేమిటీ ....!!!?

వి.స.     : నువ్వు వైష్ణవుడవు కదా. అంటూ ...

'మీ విష్ణువు పెద్ద పొలిటీషియన్. క్షీరసాగర మథనంలో పాము పుడితే మెడలో వేసుకో బావుంటుంది అన్నాట్ట శివుడితో. భయంకరమైన భద్రకాళి పుడితే శివుడికి తగిలించాడట. మంచి లక్ష్మిదేవి పుడితే తను తీసుకున్నాడట. కౌస్తుభం తీసుకున్నాడట, క్షీరసాగరం బానేఉందని పడుకొన్నాడట, ఏ కష్టంలేకుండా ఉన్నాట్ట. గొప్ప పేరంతా విష్ణువుకి వస్తుంది కానీ శివుడికేమీ రాదట నానా బాధలు పడ్డాకానీ. బూడిద పూసుకున్నాట్ట. కపాలం ధరిస్తాడట, వాడు శ్మశానంలో తిరుగుతాడట, అయినా సరే వాడికి ఎపుడూ అన్నీ కష్టాలే. ఈ భస్మాసురుడు - వీడు వరం ఇచ్చిన వాడే పీకల మీదకి తెస్తుంటారు వాడికి. లౌకికుడు విష్ణువు. అందుకని ఎవడినీ చంపడట, వాడు శత్రువని తెలిసినా రాక్షసులని పెంచుతుంటాడు. ఎందువలన ఈ ఇంద్రుడు మనం చెప్పిన మాట వినడేమో ఎప్పుడైనా అని వాడిని కొంత కంట్రోలులోఉంచడంకోసం వాడి శత్రువుల్నికూడా ఉంచుతాడట, (రాక్షసులు) మళ్ళీ విష్ణువుమీద తిరగబడకుండా కొంత కంట్రోలులో ఉంచడానికి

ఇంద్రుడిని కూడా ఓ పక్కన ఉంచుతాడట. అందుకని వాడు వామనవతారం ఎత్తి ఇంద్రుడికి ఇంద్రపదవి ఇచ్చాడు కదా బలిని చంపేయవచ్చు కదా వాడిని ఉంచాడట పోస్ట్‌పోన్ చేసినట్లు. నువు దిగు తర్వాత మళ్ళీ నీకు ఛాన్స్ ఇస్తాలే (next Ministership) అంటే వీడి పీకల మీదకు వచ్చే ముహూర్తం ఎప్పుడో ప్రక్కన పెట్టే ఉంచుతాడు. మళ్లీ వీడు ఎప్పుడైనా విష్ణుమూర్తిని గనుక మర్చిపోయి అలక్ష్యంగా ఉండి లేచి నమస్కారం పెట్టకపోతే వెళ్లినపుడు వీడ్ని గిల్లుతాడట. నువు చాలా మంచివాడివి, నువ్వు ఇంద్రుడికంటే పరాక్రమవంతుడివి నారదుడిని పంపిస్తేవాడు పంపు కొడతాడు. వీడు లేచి వాడిమీద బయలుదేరుతాడు. విష్ణువు ఎవడినీ ఏమీ చేయడట, ఎందుకని ఇద్దరు పార్టీలకు ఫ్రెండువాడు. ఏ రాక్షసుడు సరాసరి విష్ణువు మీదకు వెళ్ళి అపకారం చేయరు. అందువలన మీ వైష్ణవులంతా ఇటువంటి వాళ్ళేను మీ విష్ణువు పెద్ద పొలిటీషియన్. మీ పత్రిక వద్దు, ధర్మంవద్దు పొమ్మన్నాడు' ఆయన.

అప్పుడు ఆలోచించా - ఓహో! ఈయన చెప్పిందాంట్లో కొంత పాయింట్ వుందయ్యే. (బాధల్లో ఉండి చెప్పినాగాని) అంటే ఇబ్బందులు దేనివలన పడుతున్నాడో తెలుస్తుంది. అంతా అయిన తరువాత (వి.స.) లేచాడు-

వి.స. : 'ఆచార్లు! మరి సమస్యలు ఇట్టా ఉన్నాయి, నా బాధలు దీనికి నివారణ ఏమిటీ అని ... మరి ఇంత చదువుకున్నాను, ఇంత పండితుడిని, నా కర్మ ఇలా కాలిందేమిటి'- అన్నారు. అంటే

వేదవ్యాస: కారణం మీరే చెప్పారు కదా!

వి.స. : 'ఏమిటి'

వేదవ్యాస: మీరు శివుడి శిష్యులు, ఎప్పుడూ కష్టాల్లోనే ఉండాలి, మేము

విష్ణువు శిష్యులము, మిమ్మల్ని ఇలాఉంచుతూ ఉంటాము, మళ్ళీ సలహాలిస్తూ ఉంటాము.

వి.స. : (నవ్వాడు, సంతోషించాడు) బుద్ధిమంతుడవోయ్. అని అన్నారు.

తరువాత నాన్నగారి దగ్గరకు వచ్చినపుడు అన్నారు ఆయన మీ రెండోవాడు ఉన్నాడే వాడు ఎర్రతేలువలె ఉన్నాడు... ఉన్నట్లుండి ఆ చివరకు అంటిస్తాడు, ఏదోటి, ఆ అంటించిన పాయింటుకి మొత్తు కోవల్సిందే, తేలు కుట్టేది ఒక నిముషమే కానీ ఆ బాధ చాలాసేపు పెడుతుంది. అలా ఎదుటివాడు మహాపండితుడు అని చెప్పి వాడికి అజ్ఞానంగా ఉన్న పాయింటు ఒకటి బయటపెట్టి మనం వదిలి పెట్టేస్తే ఇకవాడు మొత్తుకుని ఛావాలి. అంటే విష్ణువుయొక్క పాలిటిక్స్ అన్నీ చెప్పాడు. అపుడు చూశాను ఈ పాలిటిక్స్ అంతా ఇట్టా వచ్చిందన్నమాట. నిజమే ఎపుడూ ఏ రాక్షసుడిని పూర్తిగా చంపడు. బలిని అణగద్రొక్కాడుగానీ చంపలేదు. ప్రహ్లాదుడిని పెంచాడు. మళ్ళీ ఇంద్రుడికి పూర్తిగా సెక్యూరిటీ ఇవ్వడు. ఎప్పుడు ఇంద్రుడు పడిపోయినా కానీ వెంటనే కలగజేసుకోడు, ఏం చేయడు పరుగెత్తుకొచ్చి వాడిని ఏమీ రక్షించడు. పైగా హిరణ్యకశిపుడు రాజ్యం చేస్తున్నపుడు వాళ్ళు పరిగెత్తుకొచ్చి దేవతలు ఏడిస్తే వాడేమన్నాడు 'సమయము కాదిది చనుందాక మీతోవనుండు' అన్నాడు. ఈ హిరణ్యకశిపుని పరిపాలన అయ్యేవరకు నువు కొన్నాళ్ళు ఓపిక పట్టు అన్నాడు. వాడు ఓపిక పట్టక చేసేదేముంది? బలం లేనివాడు పడుంటాడు నోర్మూసుకొని.ఈ లోపల నారాయణమంత్రం చేయమంటాడు. తనకి కాస్త వీడు అనుకూలంగా ఉంటాడని. ఎపుడు చేయకపోతే అపుడువాడు చిక్కుల్లో పడతాడు. అందు వలన ఎపుడూ కొంచెం ట్రబుల్ వచ్చేట్టు కొంచెం ట్రబుల్‌లోంచి బయట పడేట్టు, అయినట్లు కానట్లు సాయం చేస్తాడు విష్ణువు. లేకపోతే మనుష్యుడు

కూడా అంతే వాడికి కావలసినవన్నీ ముందే ఇచ్చేస్తే నీదేముంది పోవయ్యా అంటాడు భగవంతుడిని. అందువలన వాడికో చిన్న పంక్చరు పెడతాడు. చివర గాలి తీసేసి వాడు లబోమని గోల పెట్టిన తరువాత ఏదో నీకుకష్టంగా ఉన్నట్లుందే అని ఎరగనట్లు అనిమాట. ఎదురుగుండానే జరుగుతుంటాయి అవన్నీ. నారదా ఎందుకొచ్చావు అని అడిగాడు. ఎందుకొచ్చేది ఏమిటీనీవు రప్పించావుకదా! నా కింద ఎసరుపెట్టావు కదా అందుకే వచ్చాను. వాడికి తెలుసు. తెలిసీ చేసిందంతా స్వామి వారికి తెలియకుండా ఎట్టా ఉంటుంది. అందుకే ప్రతివాడికీ ముందు ఒకడిని తగిలిస్తాడు. తను ఎప్పుడూ డైరెక్టుగా కర్తకాడు. ప్రచోదకుడు భగవంతుడు. అర్జునుడి చేత యుద్ధం చేయించాడు కానీ తను యుద్ధం చేయలేదు. వెనకాతల ఉండి నడిపిస్తాడు కథంతా.

భాగవతంలో మాయ యొక్క స్వరూపం ఏమిటి ? అని అడిగితే బ్రహ్మనారాయణ సంవాదంలో భాగవతం యొక్క essence అంతా ఒక్క శ్లోకమే ఇది. మిగతా అంతా ఉండే expand చేసి కథా భాగంతో చెప్పాడు. మాయయొక్క స్వరూపం ఏమిటి ? అని అడిగాడు. మాయ ఉన్నదా ? లేనిదా ? అంటే ఇప్పుడు నీవు బ్రహ్మవి ఔను కదా. అవును బ్రహ్మనే. సృష్టి చేస్తున్నావు కదా! అవును. ఈ సకల చరాచర జగత్తంతా జీవరాశుల్ని నీవే కదా సృష్టించింది. అవును. ఇదే మాయ అన్నాడు. ఇది మాయ ఏమిటి? నేను సృష్టిస్తున్నానని నువ్వే అడిగావు కదా ! సృష్టిస్తున్నాను కదా! కాదు. నువ్వు సృష్టిస్తున్నట్లు పైకి కనబడుతున్నప్పటికీ ఇది నిజానికి నేనే చేస్తున్నాను. నువ్వు కాదు. నువ్వు నిమిత్తమాత్రుడివి. అంటే నిజపరిస్థితికి కర్త నీవు కాదు. నిమిత్తుడవే. కానీ బయటికి చూసేవాడికి నిమిత్తమే కర్తలా కనబడతాడు. అది మాయ. దాంట్లో చాలా shuttle గా, జాగ్రత్తగా అర్థం చేసుకుంటే జీవితంలో మనంఅన్నీ చేస్తాం. ఉద్యోగం చేస్తున్నామా! చేస్తు

న్నాం. పూజ చేస్తున్నామా! చేస్తున్నాం. మరి పిల్లపెళ్ళి ఎందుకు చేయలేవు? చేయలేడంతే వాడు. అంటే నిజంగా కర్తలా కనబడతాడు. కానీ కర్తకాడువాడు. వాడికి అక్కడ కనెక్షనుఇస్తే పనిచేస్తాడు. డిస్కనెక్టు చేస్తే ఖాళీయే.

మా దగ్గర ఇలాగే ఒకడు పనిచేసి అస్తమానం వెళ్ళిపోతానని బెదిరిస్తుండేవాడు. అందుకనివాడికి డబ్బులన్నీ తీసేసి సరే వెళ్ళి పొమ్మంటే బట్టలన్నీ సర్దుకొనివెళ్ళిపోయి మరలా అర్థగంటలోవచ్చాడు. ఏం మళ్ళీ వచ్చావు అన్నాను. వెళ్ళడానికి చేతిలో ఖర్చుకు లేవు అన్నాడు. మరి వెళ్ళడానికి డబ్బు అడుక్కున్నప్పుడు ఆ డబ్బుతో ఉండనే ఉండవచ్చుకదా! విశ్వనాధ సత్యనారాయణగారు చెప్పారుకదా! విష్ణువు లౌక్యం అని. ఒకదానికి అడుక్కునేవాడు రెండోదానికి అడుక్కోనేందుకు...నీవు జీతం అడిగేందుకు పౌరుషం వచ్చేకదా వెళ్ళి పోతానన్నావు. ఇప్పుడు వెళ్ళడానికి కూడా అడుక్కోవలసివచ్చింది. ఏదైతేనేమి ఉండిపొమ్మన్నాను. సరే ఏంచేస్తాం అని ఉండి పోయాడు. అట్టాగే వాడికి ఖర్చులు కల్పించి అప్పుడు డబ్బు ఇస్తే అపుడు దానికీ దీనికీ సరిపోతుంది.

అంటే కలియుగంలో మానవుడికి పూర్తి స్వేచ్ఛనిస్తే సరైనవాడు కాడు. పూర్తిగా నాశనం చేయడానికీ వీల్లేదు. వీడు జీవుడు మనవాడు. అంచేత ఎంత దుష్టుడైనప్పటికీ. అందువలన విష్ణువు రాక్షసులని చంపడు. దేవతలను నెత్తినెత్తుకోడు. అదృష్టవంతులు తప్ప దేవతలు వాళ్ళు తలక్రిందులు పనులు బోలెడు చేశారు. గౌతముడు, అహల్య, ఇంద్రుడు చేసిన వెధవపనులన్నీsupport చేయడు. మాట్లాడక 'పూరుకుంటాడు. మీదకి వచ్చిన తరువాత వాడికి దేహశుద్ధి అంతా బలిచక్రవర్తి చేతో ఎవరిచేతో ఇప్పించి బాగా వాడు ఒళ్ళు మాలిష్ చేసిందాకా అప్పుడు వచ్చి కనబడతాడు. అప్పటిదాకా లేడా విష్ణుమూర్తి? ఉన్నాడు కానీ వేరే పనిమీద

ఉంటాడు. గజేంద్రుడు యేడ్చియేడ్చి చివరదాకా వచ్చాక అప్పుడు కదులుతాడు. అప్పుడు వాడు చాలా గొప్పగా కొంచెంచేసినా వాడు పరమానంద పడిపోయి అంటే అవసరపడుతుందన్నమాట వీడి సహాయం. వాడి సహాయం లేకపోతే నీ సాయంఏముంది పోవయ్యా నీవు కాకపోతే ఇంకొకడు చేస్తాడు అంటాడు. ఇంకెవ్వరూలేరు మొర్రోఅన్నాక అప్పుడు 50% సాయంచేస్తాడు అడ్వాన్సుగా.

కాబట్టి ఈ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి గురించి మీరడిగే ప్రశ్నలు ఏమైనా ఉన్నాయా ? అంటే మీకిది బాగుందా. Convincing గా ఉందా. ఏదో తాడు బొంగరం లేకుండా కథచెప్పాడీయన. మ్యాజిక్ చేశాడు అని ఉందా. అర్థం అయితే ఇక డౌటేమి ఉంటుంది.

సందేహం : కుమారోమాతృకార్చితః. వేంకటేశ్వర స్వామి అష్టోత్తరములోని దానికి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామికి ఏమిటి సంబంధం ?

వేదవ్యాస : అనుకోకుండానే మంచి పాయింటు చెప్పావు. కుమారస్వామి గురించి అన్ని చెప్పి సప్తమాతృకలు గురించి చెప్పలేదు.

సప్తమాతృకలు కూడా ఉన్నాయి. అవి ఉంటేనే కానీ కుమారస్వామి యొక్క జ్ఞానం పూర్తవదు. ఈ సప్తమాతృకలంటే దీనికి కూడా మళ్ళీ మూడు లోకాల్లో అంటే దేవలోకంలో, కింద మనుష్యలోకంలో, రాక్షసలోకాలలో మూడింట్లో మూడురకాల అన్వయం ఉంది. అందువలన అడుగున మాతృ గణాలంటే అమ్మవార్లు. అమ్మవార్లంటే ఏమిటి కామెర్లు, smallfox లు ఇలాంటివి క్షుద్రదేవతలని చెప్పబడినటువంటివి ఉన్నాయే ఆవహించి ప్రజలందరినీ బాధపెట్టేవి, బాలకా గ్రహములు పిల్లల్ని ఏడిపించేటటు వంటివి, సూతికాగ్రహములు ఇలాంటివి ఆయుర్వేదంలో కూడా ఉన్నాయి. అవి మాతృకలు. అవి చిన్నబిడ్డ చేష్టలంటారు. అవి కూడా మాతృకలు

అంటే పట్టిపీడించే గ్రహములు. బాలగ్రహములు, భూతగ్రహములు, పిశాచగ్రహ, దుష్టగ్రహ ఈ విధమైన రకరకాల బాలగ్రహాలు మాతృకలు. ఈ పిల్లవాడుగా ఉన్నప్పుడు పిల్లల్ని పట్టిపీడించేవి మాతృకలు. అటువంటివి పిల్లలకు, పసిపిల్లలకు అందరికీ వచ్చి పీడించినపుడు సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని ఉపాసిస్తే లేకపోతే వాడికి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యంత్రం కడితే బాలగ్రహాలచే రక్షింప బడతాడు.

ఎందుకని అంటే ఈ బాలగ్రహముల నుంచి బాలగ్రహములన్ని శక్తులాయనకు 'కాళి' అనే పేరుంది. ఇది కూడా ఒక బాలగ్రహమే. అట్టా ఆరుశక్తులున్నాయి. ఈ ఆరు శక్తులనూ ఏడింట్లో కృత్తికా నక్షత్రాలు ఆరున్ను ఇంకోటి ఏడవ నక్షత్రం ఉండేది. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి పుట్టేముందు అది 'నక్షత్రం గగనాచ్యుతం' ఆకాశం నుంచి కిందపడిందట ఒక నక్షత్రం అప్పుడు ఆరే మిగిలాయట. 'రోహిన్యాసా కరేయసి' రోహిణీలో వెనకాల దానికి చిన్న చెల్లెలుగా ఉండేదిది. అందువలన ఆ రోహిణి పడిపోగా ఈ ఆరునూ మిగిలిపోయి ఆరు మాతృకలు చెల్లెళ్ళు అయినాయి. ఈ ఆరు కృత్తికలున్నూ దేవలోకంలో ఉండే ఆరు తల్లులు. ఎందుకని అంటే పరబ్రహ్మ యొక్క శక్తి అంటే ఆకారంలేనటువంటి భగవంతుడియొక్క శక్తి ఒక ఆకారం ధరించి సృష్టిలోకి వచ్చినపుడు బ్రహ్మఅనగానే బ్రహ్మ సంబంధమైనటు వంటి శక్తి, బ్రహ్మీ-తెలివితేటలు, విష్ణు అనగానే విష్ణుసంబంధమైనటువంటి శక్తి - వైష్ణవి, రుద్రుడు అనగానే 'రౌద్రి', ఇంద్రుడియొక్క శక్తి 'ఇంద్రాణి', కుమారుడియొక్క 'కౌమారి' ఇలా ఈ ఆరు శక్తులున్నూ పైనున్న దేవతలు ఆరు మాతృకలు. అవి వరాహమూర్తియొక్క శక్తి. నారసింహుడి శక్తి అలాగే ఈ దేవతలయొక్క శక్తులున్నాయే పైన ఏఏ దేవతలు అయితే ఆరు ముఖ్యమైనవున్నాయో వాటియొక్క శక్తి స్వరూపములే ఈ ఆరు మాతృకలు.

దేవలోకంలో కింద పాతాళంలోకి వచ్చేటప్పటికి ఈ ఆరు శక్తులునూ దుష్ట గ్రహాలై శరీరంలో ఆయా కేంద్రాలను పీడిస్తాయి. షట్చక్రాలలో అవి శరీరంలో ఉండి అవి ధనుర్వాతం, చిన్నబిడ్డ చేష్టలు ఈవిధంగా శరీరంలో బాల గ్రహాలుగా ఏడిపించేవి మాతృకలు. వీటికోసం ఊర్లో అమ్మవార్ల దేవాలయాలు గుళ్ళు పెడతారే అట్టాగే సప్తమాతృకల విగ్రహాలు కలక చూస్తే తిరుపతిలోగానీ ఎక్కడైనా అక్కడ వరాహముఖం ఒకటి ఉంటుంది. నృసింహ ముఖం ఉంటుంది. ఇలా ఈ ఆరున్నూ భయంకరమైన శక్తులు. ఈ శక్తులన్నీకూడా కుమారస్వామిని చూడగానే వాడిని బిడ్డ అని తల్లిభావం కలిగి వాటికి మాతృప్రేమ కలిగిందట. కలిగినప్పుడు సుబ్రహ్మణ్యేశ్వరుడు ఏమి చేశాడంటే నన్ను ఎవరైతే స్తోత్రం చేస్తారో వాళ్ళందరినీ మీరు పీడించకూడదు అన్నాడట ఈ ఆరు మాతృకలనీ. సరే పీడించమని వాళ్ళు వరమిచ్చారు. అందుకని 'కుమారో మాతృకార్చితః' మాతృకలన్నీ పూజించాయని ఆ కుమారస్వామి స్వరూపమే వేంకటేశ్వర స్వామి. కుమారస్వామి పుట్టినపుడు శివుడియొక్క వీర్యమును పార్వతి ధరించలేక అగ్నిహోత్రుడికి పడేసింది. ఆ అగ్ని మండిపోయి వాడు కూడా భరించలేక అది తీసుకెళ్ళి హిమాలయ పర్వతాల్లో గంగ ప్రవహించే చోట రెల్లు పొదలలో పడేస్తే (శరవణం అంటే రెల్లుపొద) అందులోంచి పుట్టాడు. పిల్లవాడు పుట్టగానే వాడు ఆరుముఖాలతో ఆకలేసి ఏడిస్తే వాడికి ఆరుముఖాలకి పాలివ్వగలవాళ్ళు ఎవరూ లేరు. అపుడు కృత్తికలు ఆరున్ను వాడినిచేరదీస్తారు. ఒక్కసారే వాళ్ళకి మాతృప్రేమ కలిగి వాళ్ళకి స్తన్యం వచ్చింది. వీడు ఒకసారే ఆరు ముఖాలతో ఆరుగురి దగ్గర స్తన్యం తాగాడు కృత్తికలదగ్గర. అందుకని కార్తికేయుడు కృత్తికల కొడుకు. వీడు మా పిల్లవాడు అని వాళ్ళు ముద్దాడారు వాళ్ళారుగురు. అపుడు

పార్వతికి కోపం వచ్చిందట. నా కొడుకుని పట్టుకొని వాళ్ళు నా పిల్లవాడు అంటారేమిటి అని అంటే వాళ్ళన్నారు. నువ్వు ఎంతసేపు తల్లివి కాసేపేకదా మేము చేరదీసి పాలిచ్చి పెంచిన వాళ్ళం అన్నారు. కృష్ణుడికి ఎట్లా అయితే కన్నతల్లి వేరేఉందో అలా ఈ కుమారస్వామికి ఈ ఆరు మాతృకలు పాలిచ్చి పెంచాయి. అలా ఈ ఆరు షట్చక్రాలలోను ఒక్కో చక్రంలో ఒక్కో దేవతఉంది. ఈ కుండలినీ శక్తి ఒక్కో చక్రంలో వెళ్ళినపుడు ఒక్కో రూపంతో శాకినీ,ఢాకినీ, లాకినీ, యాకినీ, రాకినీ అని ఈ ఆరును మాతృకలు. ఈ మాత పైకి వెళ్ళేట ప్పటికి గాయత్రిమాత. అడుగుకి వెళ్ళేటప్పటికి శక్తి మధ్యని ఈ ఆరు మాతృకలూను. దీని యొక్క శక్తి రూపాలే అంటే శరీరంలో ఉండేటటువంటి శక్తియే ఒక్కొక్క నాడీ కేంద్రంలోంచి పనిచేసేప్పుడు ఈ బాలగ్రహాల్లాగ పనిచేసి పీడపెడుతుంది దానిని కంట్రోలుచేసే శక్తి సుబ్రహ్మణ్యా శక్తియే. ఈ ఆరు మాతృకల పీడ పిల్లలకు లేకుండా చేస్తుంది. అందుకని షట్కోణ యంత్రం వేసి పిల్లలకి మంత్రం పెడితే బాల చేష్టలు, బాలగ్రహాలుండవు వాళ్ళకి. ఇవి సప్త మాతృకలు. ఈ సప్త మాతృకలను పూజించేటప్పుడు ఏమైనా మహాదేవతలకింద పూజిస్తే అవిమనకి సప్తశతిపారాయణలో ఈ దేవతలందరూ వస్తారు. వరాహి, కౌమారి, రౌద్రి వీళ్ళంతా వస్తారు.అవన్నీ కలిపి బాలా త్రిపురసుందరి అవుతారు.

ఈ దేవతలందరూ కలసి త్రిపురసుందరి, చండిక, మహాదేవత, పద్దెనిమిది బాహువులు కలిగినటువంటి మహాలక్ష్మి అవుతారు వాళ్ళు. అందు వలన వాళ్ళని పూజించేటువంటి విధానం కూడా నవరాత్రుల్లో చేసేదంతా కూడా అదే. ఇవి సప్తమాతృకలు. ఎందుకంటే సప్తమాతృకలు కొండమీద చిక్కుకున్నాయంటే కుమారస్వామి స్వరూపమే వేంకటేశ్వర స్వామి అందుకని

ఆ పైన కూడా కుమారధార, స్వామిపుష్కరిణీ, స్వామిఅంటే కుమారస్వామి. అందువల్లనే శివక్షేత్రం అనుకుంది వాళ్ళు. (శివభక్తులు). స్వామిపుష్కరిణీ ఉంది కాబట్టి, స్వామి అంటే కుమారస్వామి కాబట్టి, స్వామిమలైలాగా, అందు వలన ఇక్కడున్నటువంటి వాడు శివక్షేత్రమే అని. అది యాదవ రాజుల కాలంలో అయింది రామానుజులకి, శివపండితులకీను. అపుడు ఈ శివక్షేత్రంఉండే లక్షణాలన్నీ చెప్పరు. తిరుపతికి చెప్పి సప్తమాతృక లున్నాయి కాబట్టి ఈయన సుబ్రహ్మణ్యేశ్వరుడే అని విష్ణువుకేం సంబంధం లేదు. అభిషేకం చేస్తారు కాబట్టి అంటే అభిషేకం శివుడికే కాబట్టి ఏ ఆలయంలో విష్ణువుకి లేదు కాబట్టి శివుడేను, వెంకట+ ఈశ్వరుడు, ఈశ్వర ఉందికాబట్టి ఈశ్వరుడు శివుడేను, నాగాభరణాలు ఉన్నాయి కాబట్టి శివుడేను, ఇలా 18 వాదాలు చెప్పారు వాళ్ళు. (శివభక్తులు). అలాగే స్కంద పురాణంలో ఈ కుమారస్వామి వచ్చి తిరుపతిలో తపస్సు చేసినట్లు ఆ పుష్కరిణిలో స్నానం చేసినట్లు ఉన్నది, పురాణం స్టాండర్డు కాబట్టి ఇది కుమారక్షేత్రమేను అని-చేపితే రామానుజులేమి అన్నారంటే స్కాందపురాణాన్ని ప్రమాణంగా ఒప్పుకుంటారా అని - ఒప్పుకుంటామన్నారు. ఎక్కడైతే ఏ అధ్యాయంలో అయితే కుమారస్వామి ఎక్కడ తపస్సు చేసాడని ఉందో దాని ముందు అధ్యాయం తీయమన్నాడు - తీస్తే ఆ కుమార స్వామి అక్కడికి ఎందుకు వెళ్ళి తపస్సు చేయాల్సివచ్చిందో అదివచ్చింది. తారకాసురుడిని చంపినపుడు బ్రహ్మహత్యాపాతకం దోషం కలిగినందు వలన శివుడిని అడిగితే శివుడ న్నాడట. 'వేంకటః' పాపములన్నియూ ఖండించ గలిగినటువంటివాడు వేంకటేశ్వరస్వామి ఒక్కడే (నారాయణుడు) ఉన్నాడు. అక్కడికి పోయి తపస్సు చేయి. ఆయన యొక్క అనుగ్రహం చేత నీకు పాపాలు పోతాయని

చెప్పాడు. కాబట్టి అది వైష్ణవ క్షేత్రమే కాని సుబ్రహ్మణ్య క్షేత్రం కాదని, కుమారస్వామికి ముక్తి కలిగినచోటుతప్ప అది సుబ్రహ్మణ్యేశ్వర స్వామిది కాదని రామానుజులు చెప్పారు. కుమారో మాతృకార్చితః ఇది అష్టోత్తరం లోదే. కుమారస్వామి యొక్క రూపమే వేంకటేశ్వరస్వామి అని చెప్పడం కోసం సప్త మాతృకలకి ఆయనికి సంబంధం ఉంది. ఈ మాతృకలు అంటే ఈ శక్తులు ఏడూను.

హరిః ఓం తత్ సత్

గురుదేవులు 1994 జనవరిలో యజ్ఞంలో అనుగ్రహభాషణం చేసినారు.
పూజ్యగురుదేవుల ఆశీస్సులతో ఈ ఉపన్యాసమును వ్రాసి పంపిన యోగమిత్రులు
బి. హనుమంతరావు, తణుకు మరియు కుమారి శైలజ, పొంగూరు శాఖ.



# 7

# కలియుగాంతంలో - శంబల సందేశము

" నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్ "

" గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః "

" శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవి ఘ్నోపశాంతయే "

ఈనాడు భారతీయ ఆధ్యాత్మిక విద్యా సంస్కృతి సముద్ధరణ సంస్థ (యోగమిత్రమండలి), రావుల పాలెం, ర్యాలీ శాఖల కార్యకర్తల కోరికపై ఈనాటి ఈసభాముఖంగా మీఅందరినీ కలుసుకోవడం నాకెంతోఆనందంగా ఉన్నది. మీలో ప్రతి ఒక్కరిలోనూ ఉత్సాహము, గురువుగారి ఉపన్యాసము

వినాలనే ఆసక్తి, గురువుగారు వచ్చేలోపల వర్షం పడుతుందేమోనని భయం, రాకూడదని జపం ఇవన్నీ కనబడుతున్నాయి. దారిపొడుగూతా నాతో వచ్చినటువంటి మిత్రులు (యోగమిత్రులు) కారుతడిసిపోయేంత వర్షం పడింది. అంతకు మించి చెమట పట్టింది వారికి. ర్యాలీ ప్రోగ్రాం పోయింది బాబోయి అనుకొని భయపడు తున్నారు. కొంచెం దూరం వచ్చాక నేనన్నా ప్రతి చిన్న దానికి భయపడితే ఎట్టాగురా అన్నా. తరువాత రోడ్డుమీద ఎక్కడా కూడా దుమ్ముతడవలేదు. అసలు చుక్కలేదు వర్షం. పాపం వర్షం దేవుడు ఎప్పుడూకూడా గురువుగారికి ఇబ్బంది కలిగించడు. (చిన్నగా నవ్వుతూ...) వర్షందేవుడు ఉపన్యాసం వినదలుచుకుంటే తరువాత ఎప్పుడైనా వీలు ఉంటే వచ్చి కూర్చొని వింటాడు.

ఎప్పటి నుండో ర్యాలీకి గురువుగారినిపిలిపించుకోవాలని, గురువుగారి మాటలు వినాలని ఈ గురువుగారియందు భక్తి, విశ్వాసాలతో ఈ కార్యక్రమాన్ని మీరు ఏర్పాటు చేసుకున్నారు. మీ అందరి భక్తి, నామీద ఉండే ఈ ప్రేమ అన్నీకూడా నాకుతెలుసు పూర్తిగా. అయితే ఈమాట ముందుచెపితే మీరంతా పైనపడతారు. కాళ్ళుపట్టుకుంటారు. మొత్తమంతా గలీజు అయి పోతుంది.

భక్తి, అనుగ్రహం ఈ రెండు కరెంటువంటివి. కరెంటు అంటే ముట్టుకోకూడదు. ముట్టుకుంటే షాక్ కొడుతుంది. దూరం నుంచి అయితే లైట్ వస్తుంది. అందులో చేయి పెడితే షాక్ వస్తుంది. అందువలన గురు కటాక్షం కూడా గురువుకు దూరంగా ఉండీ పొందవచ్చు. ఆలయంలోకివెళ్ళి మనం దేవుడిని ముట్టుకుంటామా, ముట్టుకోము. ముట్టుకుంటే ఆ పవర్ తట్టుకొనే శక్తి మనకుండదు. అంత శక్తి మనకు రావాలంటే మనం సాధన చేయాలి. దానికి రాజయోగం కావాలి. మన శరీరం కర్మలన్నీ పోయి

పరిశుద్ధం కావాలి. సమస్త కర్మలు భస్మం అయిన తరువాతే మనిషి యోగి అవుతాడు. యోగిగా పూర్వజన్మ కర్మలన్నీ బాకీలు తీరిపోయాకే భగవద్దర్శనం అవుతుంది. అంతవరకూ కూడా మనం దూరం నుండి మహాత్ములు, గురువులు ఇచ్చేటటువంటి పవర్‌ను తీసుకోవాలి. ఇక్కడనుండే లైటుయొక్క వెలుగుదూరాన ఉన్నా మనమీద వచ్చి పడుతుంది. మనము వెళ్ళి దండ వేయలేదని, మనం తీసుకెళ్ళే దండ ఆయన చేతికి ఇవ్వలేదని లేక మనం పట్టుకెళ్ళిన కుళ్ళిపోయిన అరటిపండు వారిమీద పడవేయలేదని మనం బాధపడకూడదు. ఎందుకని? అంటే ఈ గురువులెవరు మీరిచ్చే ఫలాలకోసం ఆశించి ఇక్కడకు రారు. మిమ్మల్ని చూడాలని మీ యొక్క భక్తి విశ్వాసాలు పెంచాలని మీరు జపధ్యానాలు బాగా చేస్తే సంతోషించాలనే ఉద్దేశ్యంతో ఇక్కడకు వస్తారు కానీ మాకేమీ స్వార్థం ఉండదు. ఈ ర్యాలీకి వస్తే మీరేదో ఇస్తారనే ఆశతోరాము. మీరిచ్చేటువంటిది భక్తి, ప్రేమ అదిచాలు.

ఈనాటి కార్యక్రమంలో కలియుగాంతం-యుగసంధి - ప్రళయం అన్న అంశంపై ఉపన్యాసం చెప్పమని యోగమిత్రులు కోరారు. అయితే ఎప్పటినుంచో ప్రతిచోట అందరూ అడుగుతూనే ఉన్నారు. అదే టేపురికార్డరు పెట్టడం అవుతుంది. అయినప్పటికీ ఒకచోట చెప్పిన ఉపన్యాసం ఇంకొక చోటరాదు-అది అశ్చర్యం. మొన్న బెంగుళూరు వెళితే వ్యాసమహర్షి ఆలయ ప్రతిష్ఠలో అక్కడ ఉన్నటువంటి రాజుగారు[1], పేజావర్‌మఠాధిపతి వారు విని 'ఒకచోట చెప్పిన విషయం మళ్ళీ ఇంకొకచోట రాకుండా అదే టాపిక్ మీద మీరుచెప్తున్నారు చాలాఆశ్చర్యంగా ఉంది!' అంటే, "నాకూ ఆశ్చర్యంగానే ఉందని" చెప్పాను. ఎందుకంటే చెప్పేవాడిని నేను కాదు. నాలోంచి వస్తుంది

[1] వీరు ఒక యోగమిత్రుడు, చిరకాలంగా గురుసేవలో ఉన్న అదృష్టవంతులు.

కాని. ఈ మైకు ఎలా అయితే నేను ఏం మాట్లాడితే అదే మీకు వినబడేట్లు చేస్తుందితప్ప దాని స్వంతంగా అంటూ ఏం లేదు. అలాగే నేను కూడా భగవంతుడు నాకు లోపల ఏమి పలికిస్తే అది మీకు ఇవ్వడమే మైకులాగా! అందువలన నా మనస్సులో ఉన్నది మీ హృదయానికి హత్తుకుంటుంది. ఈ రాజకీయవేత్తల ఉపన్యాసాలలాగా మీకు ఒళ్ళుమండకుండా భక్తి కలుగుతుంది. అందుచేత ఈ కలియుగం చివరకు వచ్చింది. 1910-2010 దాకా ఈ నూరు సంవత్సరములు యుగసంధి. 1910లో ఒక గొప్ప తోకచుక్క (హేలీస్ కామెట్) కనబడింది. ఈ తోకచుక్క 29 మే 1910లో అర్ధరాత్రి కనబడి ఏడురంగుల తోకచుక్క వెలిగింది. పూర్వం నాడీగ్రంథంలో వ్రాశారు ఈ పంచవన్నెల తోకచుక్క కనబడటం బ్రిటీష్‌రాజు ఆ సంవత్సరమే స్వర్గానికి వెడతాడని. అదే సంవత్సరం ఎడ్వర్డ్ చక్రవర్తి పరమపదించడం. స్వాతంత్ర్యానికి యుద్ధం ప్రారంభం. గాంధీ మహాత్ముడు తన కార్యక్రమానికి అప్పుడే ప్రోగ్రాం వేసుకున్నారు. అది చివరికి ఈ లోపల మన భారతదేశానికి స్వాతంత్ర్యం రావడం. రాజకీయంగా స్వాతంత్ర్యం వచ్చింది కానీ నిజంగా మనకు ఆధ్యాత్మికస్వాతంత్ర్యం రాలేదు. ఎందుకంటే ఈ రాజకీయ స్వాతంత్ర్యం రావడం వలన ఓట్లు దండుకునే వాళ్ళు బాగుపడ్డారు. రాజకీయ వేత్తలు బాగుపడ్డారు. రాజకీయపార్టీల వాళ్ళు బాగుపడ్డారు. ఒక పార్టీ వాడు మంచివాడు కాదు మాకు ఓటెయ్యండి అంటే ఇంకొకడు మాకు ఓటేయమని వాళ్ళు. ఒకడు కుడిజేబులోంచి డబ్బులు కొట్టేస్తే ఇంకొకడు ఎడమప్రక్క జేబులోంచి డబ్బులు కొట్టేస్తాడు తప్ప వాళ్ళు మనకోసంరారు. వాళ్ళకోసమే వస్తారు. దీనికి ఏమిటిదాఖలా, నిర్ధారణఅంటే ఎంతమంది వచ్చి ఓట్లేయించుకొన్నా మనం ఇట్లాగే ఉన్నాం కాబట్టి, మనం ఇలాగే ఉంటాం కాబట్టి, వీళ్ళు మనకు ఏమీ చేయరని గ్యారంటీ. మనకు ఏదైనా చేసేది భగవంతుడే

కానీ ఈ రాజకీయవేత్తలు కాదు. అందుచేత మన స్వయంకృషి మీద, మన సాధనమీద, మన స్వశక్తిమీద ఆధారపడి మన గ్రామాన్ని, మన కుటుంబాన్ని, మన శరీరాన్ని, మన ఆత్మను మనమే ఉద్ధరించుకోవాలి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'ఉద్ధరేత్ ఆత్మనాత్మానం' ఆత్మని తనయొక్క శక్తివలనే స్వప్రయత్నం చేతనే ఉద్ధరించుకోవాలి. అంటే ఇక్కడ కూర్చున్నటువంటి మీరులేవాలంటే మీ అంతట మీరే లేవాలి, ఇంకెవరో బలవంతాన లేవదీసినా, బయటకునెట్టివేసినా దానికి ఉపయోగముండదు. అందుచేత ఆధ్యాత్మికంగా కూడా మనిషిఉద్ధరింపబడాలంటే స్వప్రయత్నంఉండాలి. ఏమిటా ప్రయత్నం? తెల్లవారి లేచింది మొదలు మళ్ళీ రాత్రయ్యేంత వరకూ మానవుడు చేసేటటు వంటి అనేకపనులలో వెనకాతల స్వార్థమే తప్ప మరొకటిలేదు. ఉద్యోగం కోసంగాని, వ్యాపారం కోసంగాని చేసేటటువంటిది. ఇంకేదైనా జీవనోపాధి కోసమైనా 24 గంటలలో 20 గంటలు మనకి దానికి నడిచిపోతాయి. దీనివల్ల మనం చేసే కర్మ నశించదు. మనకు పుణ్యంరాదు. దేనివలన మన పూర్వకర్మ నశిస్తుందో అది నిజమైనటువంటి ఆధ్యాత్మిక సాధన. ప్రాణాయామంవలన, శ్వాస నిలబెట్టటంవలన, మనస్సు ఏకాగ్రత చేయడంవలన, రోజూ కనీసం 10 నిమిషాలు అయినా సంకీర్తన, భగవన్నామాన్నీ, విష్ణుసహస్రనామాన్ని, నారాయణ మంత్రాన్ని మనస్సు దానియందుపెట్టి జపంచేయడంవలన, ప్రేమతో కీర్తన చేయడంవలన మన పాపం కొంచెంక్షయమవుతుంది. కానీ ఈ కలియుగంలో సినిమాలు, టీవీలు పెట్టుకొని ఆ ఉన్న టైముకూడా దండగపెట్టుకొని ఆయుష్షు అయిపోయిన తరువాత విచారిస్తారుగానీ, ఆయుష్షు ఉండగా దానిని సద్వినియోగం చేసికోడు మనిషి. ఈ కారణం చేత ఈ కలియుగం ప్రారంభించి 5000 సం॥ పైన దాటిపోయింది. ఈ 5000 సం॥లుగా కొన్ని కోట్లమంది జనం చేసినటువంటి చెడుకర్మ ఆకాశంలో

మబ్బులు, మేఘాలు క్రమ్ముకొన్నట్లు బయట పేరుకుపోయింది. ఇది వూరికే ఎక్కడపోతుంది. పోదు. మేఘాలు పట్టాయంటే ఈ వేళ గురువుగారు వచ్చారుకాబట్టి వర్షం పడకుండా ఆగింది కానీ లేకపోతే మామూలుగా తడిపేసి దంచేస్తుంది. ఇంట్లో కూర్చున్నాగానీ, చూరులో నీళ్ళు వచ్చిపడ తాయి. గుడిశెలైతే ఇక ఇళ్ళుకూడా... పూరిపాకలైతే నిలబడుతుందో లేదో తెలియదు. మనుష్యులు చేసిన కర్మలు కూడా పైన అట్లా పేరుకు పోయాయి. వాటి ఫలితాన్ని మనిషి మీద పడేయడానికి సిద్ధంగా ఉన్నాయి. ఇది కలియుగాంత లక్షణం. అయితే ఈ కలియుగం అనేది ఎప్పుడు ప్రారంభమైంది. చాలామందికి తెలియదు. దీనికి భాగవత పురాణం, వ్యాస మహర్షి శ్రీమద్భాగవతం పురాణం వ్రాసినారు. 12 స్కంధాలలో భగవంతుని యొక్క పన్నెండు అవతారాలను వర్ణించారు. ఈ కారులో వస్తుంటే ఈవేళ ఇప్పుడు అనిపించింది. ఇన్ని పుస్తకాలు వ్రాశాం, ఇన్ని విషయాలు వ్రాశాం. సంస్కృతంలో వ్యాసమహర్షి భాగవతంలో ఏమి వ్రాశాడో సింపుల్‌గా తెలుగులో భక్తులకు అందించే పుస్తకం వ్రాస్తే బాగుంటుంది. అది, మరి భగవంతుడు ఎందుకు కలిగించాడో ఆ భక్తి భావం ఈ ర్యాలీవారి భక్తిఫలితమో, లేక మీ అదృష్టమో లేక నా అదృష్టమో! అందరూ తరించేటటు వంటిది భాగవతం. భాగవతంఅనగా అర్థం భగవంతుని గురించి చెప్పేది. భగవంతుడు అనగానే మనకు అన్నీ తెలుసు అనుకుంటాం. శివుడు, విష్ణువు, లక్ష్మీదేవి, గణపతి ఇట్లా మన దేవాలయాలలో అనేకమంది దేవుళ్ళు ఉన్నారు. బ్రహ్మ దగ్గరనుంచి ముక్కోటిదేవతలు ఉన్నారు. అంటే మన అసెంబ్లీలో ఎంతమంది యం.యల్.ఏ.లు, పార్లమెంటులో ఎంతమంది యం.పి.లు ఉన్నరో అంతమంది దేవుళ్ళు ఉన్నారు. మరి వీళ్ళందరూ భగవంతులేనా అంటే - కాదు. వాళ్ళ వాళ్ళ నియోజక వర్గాలలో మాత్రమే. మన గ్రామ

దేవతలు కూడా ఉన్నాయి. దానికేదో పోయవలసిన కాస్త కల్లు, దానికివ్వా ల్సిన కాస్త నైవేద్యం పెడితే మన యం.యల్.ఏ.గారికి ఒక సీసా వారికిచ్చే నైవేద్యంలాగా వీరంతా అంతా చిల్లర పనులే చేస్తారుగానీ ముక్తిని ఇవ్వలేరు వీళ్ళు. ఈ భూతగణాలంతా ఇలాంటి వాళ్ళే. ఏదైనా స్వార్థం వాళ్ళని సాటిస్‌ఫై (తృప్తి) చేస్తే కొంచెం పని చేసిపెడతారు. ఇపుడు అది కూడా చేయడం మానేశారు. ఈ కలియుగంలో దేవతలు ఆహారం, నైవేద్యం తీసికొంటున్నారు గానీ ఎవడూ పనిచేయటం లేదు దేవుడుకూడా!!! ఎందుకంటే మనుషులను చూచి వీళ్ళకు పనిచేయక పోతే వాళ్ళకు ఏమీ కాదు కదా! మనంకూడా పనిచేయకపోతే సరి అని. మీకు ఆశ్చర్యం వేయవచ్చు ఏమిటబ్బా ఇలా చెప్తారు, దేవుడు పని చేయకుండా ఉంటారా అని, భాగవతంలో శ్రీకృష్ణుడు, ఇంద్రుడు సరిగా పనిచేయుటలేదు అని ఇంద్రుడికి బుద్ధి చెప్పాలని అప్పుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి ఇంద్రుడికి తన శక్తి చూపించాడు. అప్పటిదాకా ఇంద్రుడు తనే దేవుడని తను వర్షాలు కురిపిస్తేనే ప్రజలు బ్రతుకుతారు అని లేకపోతే వీళ్ళకు ఏదీ ఆధారం లేదు అని అహంకారంతో ఉండేవాడు. 7రోజులు, (7పగళ్ళు, 7 రాత్రిళ్ళు) రాళ్ళ వర్షం కురిపిస్తే ఒక వేలు మీద 7 సం॥ కుర్రవాడు శ్రీకృష్ణుడు, ఈ గోవర్ధన పర్వతాన్ని ఎత్తిపట్టి ఈ గొల్లవాళ్ళని అందరినీ కూడా రక్షించాడు. అపుడు ఇంద్రుడు ఆశ్చర్యపోయి వీడు నిజంగా పిల్లవాడేనా?!! ఈ పర్వతాన్ని ఇలామోశాడే, ఎట్లా చేశాడు ! అని ఆలోచించాడు. దైవానుగ్రహం వలన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అవతరించాడు. తనకు కూడా నారాయణుడు ఎప్పుడూ కనబడడు. దేవతలకు కూడా ప్రతినిత్యం పరమాత్మునియొక్క దర్శనంకాదు. ఎందుకంటే వాళ్ళకి అప్సరసలు, డాన్సులు, సినిమా వాళ్ళలాగా వాళ్ళగొడవలు ఏవో వాళ్ళు ఏడుస్తుంటారుగానీ వాళ్ళకి వైరాగ్యం కలిగి దైవచింతన కలిగితేనే భగవద్దర్శనం అవుతుంది.

ఎప్పుడో అవతారం వచ్చినపుడే తెలియాలి వాళ్ళకి. ఈ రహస్యాలన్నీ కూడా భాగవతంలో వ్యాసమహర్షి ఇచ్చియున్నాడు. అపుడు ఇంద్రుడువచ్చి స్తోత్రం చేస్తాడు, బ్రహ్మదేవుడువచ్చి స్తోత్రంచేస్తాడు. సమస్తదేవతలువచ్చి శ్రీకృష్ణపరమాత్మని స్తోత్రంచేస్తారు. అంటే వాళ్ళందరికీకూడా ప్రతినిత్యం భగవద్దర్శనం కాదు అనిఅర్థం. అయితే వాళ్ళు ముక్తి పొందుతారు. దేవతలు అందరూ కొబ్బరికాయల కోసం, అరటిపళ్ళ కోసం ఆశపడతారు. అట్లా ఆశపడకుండా అనుగ్రహించేవాడే పరమాత్ముడు. భగవంతుడు ఎవ్వరు? అన్న ప్రశ్నకు మనం సమాధానం వెతుకుతున్నాం. ఈ ముక్కోటి దేవతలూ భగవంతుడు కాదని అర్థం. అంటే ఏవో కొన్ని పనులు చేసిపెట్టేవాళ్ళు, మనం ఏవో నైవేద్యాలిస్తే పుచ్చుకొనేవాళ్ళు, మనం పూజించకపోతే కోపగించే వాళ్ళు, కోపతాపాలు ఉన్నవాళ్ళు వీళ్ళందరూ దేవతలు అన్నమాటకు అర్థం కాదు. దేవతలైతే కావచ్చు. భగవంతుడు అన్నమాటకు అర్థం వేరే. భగవంతుడు అనగా మరి ఎవరు ? బ్రహ్మదేవుడా, శివుడా, విష్ణువా. సృష్టి చేసేవాడు బ్రహ్మ, ప్రళయం చేసేవాడు శివుడు. వాళ్ళు కూడా మేము కాదు భగవంతుడు అన్నారు. మరి భగవంతుడు ఎవరు ? ఈ ప్రళయ సమయంలో ప్రపంచం అంతా ప్రళయం, బ్రహ్మప్రళయం అంటారు. మామూలు ప్రళయం అంటే ఈ వరదలు వచ్చి మునిగిపోయినట్లుగా జీవరాశులు అన్నీ చచ్చిపోతాయి. మనుష్యులు, జంతువులు, చెట్లు నశించి పోతాయి. కానీ అంతకంటే పెద్ద ప్రళయం వచ్చినపుడు భూగోళం మొత్తం నశించిపోతుంది. ఇంకా పెద్ద ప్రళయం వచ్చినపుడు - సూర్యుడు, అన్నిగ్రహాలు కూడా ఒకదానికొకటి ఢీకొట్టుకొని భస్మం అయిపోతాయి. అపుడు ఏమీ మిగలదు. ఆకాశం ఒక్కటే నిరాకాశంగా నిరామయంగా ఉంటుంది. అపుడు ఆ నిరామయమైన ఆకాశంలో సముద్రంలా ఉంటుంది ఆదిఅంతం లేకుండా. దాంట్లో యోగ

నిద్రలో సేవించేటటువంటి శ్రీమన్నారాయణుడు ఒక్కడే ఉంటాడు. మిగతా దేవతలు అంతా కొట్టుకుపోతారు. ఆ ప్రళయమప్పుడు ఎవడైతే ఒక్కడు మిగిలి ఉంటాడో వాడే భగవంతుడు. అయితే మనం ప్రళయం చూచిందాకా ఉండం, ఆ మిగిలి ఉండేవాడు ఎవడో కనుగొనే శక్తి మనకు లేదు కాబట్టి ఈ మహర్షులు, తపస్సు చేసినవాళ్ళు, చిరంజీవులు మాత్రం ఆ ప్రళయంలో పైన ఆకాశంలో నిలబడి ఈ పరమాత్ముని దర్శించగలుగుతారు. అది భాగవతంలో ఈ ప్రపంచంవల్ల నశించనివారు ఈ సృష్టి జరిగితే అందులోనే ఇరుక్కోని వాడు సృష్టిస్తే; ఈ సీతాఫలం పండు చూస్తే అందులో సీతాఫలం గింజలు దానిలో విత్తనాలు అన్నీ ఉంటాయే అలాగ ఈ సర్వదేవతలు సృష్టిలో ఉంటారు. కానీ భగవంతుడు సృష్టికన్నా పైన ఉంటాడు. అలాగే సృష్టిలోపల కూడా ఉంటాడు. మరి సృష్టిలోపల ఉండే భగవంతుడుకి మరి సృష్టి పైన ఉండే భగవంతుడికి తేడా ఏమిటి ? చాలా మంది పెద్ద పెద్ద వేదపండితులను అడిగితే చెప్పలేక పోయారు మొన్న తిరుపతిలో వేదసభలో. నేనన్నాను "ప్రపంచంలో ఎన్ని చోట్ల నీళ్ళు కనబడతాయి? అని గంగలో నీళ్ళుంటాయి, చెరువులో నీళ్ళుంటాయి, మురికిగుంటలో నీళ్ళుంటాయి, పంపులో నీళ్ళుంటాయి, సముద్రంలో నీళ్ళుంటాయి. అన్ని నీళ్ళు ఒకటేనా?" పరిశుభ్రత తేడా ఉంటుంది, నీళ్ళ రుచి తేడా ఉంటుంది. కొన్ని నీళ్ళు తాగితే ఆరోగ్యం, కొన్ని నీళ్ళు తాగితే జబ్బుపడతారు. అలాగే కొబ్బరి చెట్టుకు కాయవస్తుంది. దాని లోపల నీళ్ళుంటాయి. మనుష్యులు ముట్టుకోనటు వంటి నీళ్ళు, మనుష్యదర్శనం కానటువంటి నీళ్ళు కొబ్బరి కాయలో ఉంటాయి. అందుకనే టెంకాయ నీళ్ళు పరమాత్మకు సమర్పిస్తాం మనము. అలాగ ఈ లోపల నీళ్ళు, బయట నీళ్ళు రెండూ కలనకుండా టెంకాయలోనూ, సముద్రంలోనూ ఉన్నట్టే భగవంతుడు లోపలా, బయటా ఉంటాడు. ప్రతి

ఒక్క ఆత్మలోనూ టెంకాయలోని నీళ్ళలాగా, లేత కొబ్బరిలాగా అంతరాత్మ స్వరూపుడులాగా ఉంటాడు. అంతర్యామిగా, బయటఉండే సముద్రంలాగ అంటే బహిర్యామిగా బయటా వ్యాపించి ఉంటాడు. లోపలా వ్యాపించి ఉంటాడు. లోపలా, బయటా ఎట్లా వ్యాపించి ఉంటాడు? అదే బయట గాలివీస్తే, చెట్లమీద గాలి వస్తూ ఉంటుంది. మనం ఊపిరి పీల్చినపుడు లోపలి శ్వాస వస్తుంది. ఇదీ గాలే. అదీ గాలే. కానీ ఇది ప్రాణం ఉన్నటువంటి గాలి, అది ప్రాణం లేనటువంటి గాలి. అలాగ బయటఉండేటటు వంటి భగవత్ శక్తి మన లోపల ఉండే భగవత్ శక్తి రెండూ ఒకటే అయినప్పటికీ రెంటికీ తేడాఉంది. ఈ రెండు రూపాలలోనూ ఉన్నటువంటివాడు భగవంతుడు. బయట ఉండేటువంటి గాలివల్ల పక్షులు ఎగరడానికి, తరువాత ఈ వర్షాలు కురవడానికి, పంటలు పండటానికి, ఋతువులు మారడానికి, వీటన్నింటికీ సహాయం చేసి మనకు ఫలితాన్ని ఇస్తాయి. ఈ లోపలఉండే గాలివల్ల మనం బ్రతికి ఉండేటట్లుగా మనకు ప్రాణం, ఆయుష్షు ఇవన్నీఇస్తాయి. ఇది యోగంతో ఎవరైతే తెలుసుకుంటారో వాళ్ళు - ఈ పరమాత్ముడు ఇంత చేస్తున్నాడు కదా అన్నటువంటి భక్తితోటి భగవంతుడు మనకు ఇన్నిఇచ్చాడు కదా, కాలు ఇచ్చాడు, చెయ్యి ఇచ్చాడు, మనస్సు ఇచ్చాడు, మాట ఇచ్చాడు, ప్రాణం ఇచ్చాడు. మన దగ్గర్నుంచి ఏమీ అడగట్లేదు భగవంతుడు అన్న సంగతి తెలుసుకొని ఇతరులకు నిస్వార్థంగా సేవ చేయాలి. ఇతరులకు సేవ చేస్తున్నాం అని అహంకారం లేకుండా, మానవరూపంలోనున్న భగవంతునికి సేవచేస్తున్నాం అనుకోవాలి. మీ అందరికి నేను ఏదో సేవచేస్తున్నాను అనుకుంటే నాలో స్వార్థం ఉన్నట్లు లెక్క. అందువల్ల మీ అందరిలోనూ ఉన్న అంతరాత్మ భగవంతుడున్నాడు కాబట్టి ఆ భగవంతుడిలాగా మనంకూడా నిస్వార్థంగా ఇతరులకు సేవ

చేయాలి. భగవంతునికి సర్వీస్ చేస్తున్నట్లుగా నేను ఇప్పటికి 35 ఏళ్ళుగా ఈ ఉపన్యాసాలు, ఆలయాల ప్రతిష్ఠలు అనేక చోట్ల జపాలు, వేదమంత్రాలు నేర్పుటచేస్తూ ఉంటే ప్రజలందరికీకూడా అంత ఉత్తేజం, భక్తి కలుగుతుంది. ఒకచోట భక్తులంతా చేరి, అప్పటికి సంస్థా, ఇంత జనం లేరు. కొద్దిమందే చేరేవాళ్ళు సర్పవరం అని కాకినాడ దగ్గర ఆలయంలో కూర్చుంటే అక్కడ ఒకాయన అన్నాడు, స్వామీ ప్రపంచం అంతా మిమ్మల్ని జగద్గురువు అంటే ప్రపంచానికే గురువుగా భావిస్తుంది. మేము కూడా అలాగే భావిస్తున్నాం. మీరేమో నేను మీలాంటి వాడినే అని అంటారు. అంటే నేను చెప్పా, "నాయనా జగద్గురువు అంటే మీరేమను కుంటున్నారు, జగత్తంతటికీ నేను గురువుని అనుకుంటున్నారు. కాదు జగత్తంతా నాకు గురువు అందువలన నేను జగద్గురువుని" జగత్తు ఎవరికి గురువో వారు జగద్గురువు. మీరు నాలో భగవంతుడని చూస్తారు. నేను మీలో భగవంతుడిని చూస్తాను. ఎవరైతే అందరిలోనూ భగవంతుడిని చూస్తారో వాడికి జగత్తే గురువు. ఎవరికి జగత్తు గురువో వాడు జగద్గురువు. జగత్తుకు గురువని కాదు. జగత్తు వానికి గురువు. ఆ స్థితి రావాలంటే సమానత్వాన్ని మనం ప్రాక్టీసు చేయాలి. సమానత్వం వలన ఏమిటి లాభం ? "సర్వజ్ఞత్వ సమానత్వం" సమానత్వం వలన సర్వజ్ఞత్వం కలుగుతుంది. అంటే ఒక విషయం గురించి మనం ఆలోచిస్తే వేయివిషయాలు మన మనస్సులోకి వస్తాయి. లైటువేస్తే ఒక వస్తువే కనబడి ఊరుకుంటుందా ఈ లైటు వెలుతురులో మీరు ఒక్కరే కనబడక మరి ఇంతమంది కనబడుతున్నారే ఆ విధంగా నిజమైన జ్ఞానం మనలో కలిగితే అన్ని విషయాలు ఒకేసారి తెలుస్తాయి. ఒకదాని తరువాత ఒకటి తెలియడం,

తెలిసింది మరచిపోవడం, ఒకదానిబదులు ఒకటి చెప్పడం ఉండదు. చాలా మంది అంటారు 20 ఏళ్ళనుంచి ఉపన్యాసాలు, పుస్తకాలూ ఇస్తుంటారు. అప్పటికే అన్ని శాస్త్రాలమీదా వ్రాశారు. ఇది చదవకుండా మీకింత జ్ఞానం ఎక్కడి నుండి వస్తోంది ?అడిగితే నేనుచెప్పా 'ఎక్కడనుంచి వస్తుందో నాకుకూడా తెలియదు, వస్తూంది అని మాత్రం తెలుసు'. అదేమిటి మీకు తెలియకుండా ఎలా వస్తుంది? మీ ఇంట్లో బావి త్రవ్వుకున్నారా ? త్రవ్వు కున్నాం. నీళ్ళుపడ్డాయా ? పడ్డాయి. నీళ్ళు తీసికొని త్రాగుతున్నామా? త్రాగుతున్నాం. మరి ఎక్కడినుండి వస్తున్నాయో తెలుసా? లేదు. అలాగే నాకు కూడా లోపల నీళ్ళుపడ్డాయి, వస్తున్నాయి. తోడి పోస్తున్నాం, లోపలనుండి వస్తున్నాయి. నీళ్ళు తీయగా ఉన్నాయి అందిరికీ దాహం తీరుతోంది. అంతవరకు చాలు. స్వార్థంఉంటే ఉప్పునీళ్ళు వస్తాయి. చాలామంది మీరు ఉపన్యాసాలు మొదలు పెట్టిన 20 ఏళ్ళ తరువాత మొదలుపెట్టిన స్వాములు అందరూనూ ఎయిర్‌కండిషన్డ్ కార్లు కొనుక్కు న్నారు. మరి మీరు ఇలాగే ఉన్నారు అన్నారు. అంటే నేను చెప్పా 'నాయనా ప్రపంచంలో అధికారం, గొప్పతనం అన్నీ సంపాదించుకోవడం కోసం నేను భక్తిప్రచారం చేయడంలా! అవి అన్నీ అనుభవించేసి, ముఖ్యమంత్రి చేత, మరోమంత్రి చేత, కలెక్టరుగా అందరిచేత నమస్కారం పెట్టించుకొని విసిగిపోయి ఉన్నాను.

అందువల్ల ఎవరి చేతులు ఇలా ఉంటాయో (కిందకు) 'తే' తెమ్మని అటువంటివాడు దురాత్ముడు. ఎవడి చేతులు ఇలా ఉంటాయో (పైకి) అతడు మహాత్ముడు. అందువలన ఈ శ్రీమద్భాగవతం మనకు చెప్పేది ఏమిటంటే ఈ భగవంతుడు అనేవాడు ఎవరు ? ఈ సమస్త సృష్టి ప్రళయం

అయినా నశించనివాడు ఎవరు ఉన్నారో అతడు భగవంతుడు. రెండవది మళ్ళీ ఈ సర్వం నశించిపోయిన ప్రళయంలోంచి ప్రపంచం మరలా ఎలా పుట్టుకొస్తుంది. ఒక ఆవగింజ మూలగా ఎక్కడో దాక్కుని ఉండి వర్షం పడగానే అది మొలకెత్తుతుంది. మళ్ళీ ఆ ఒక్క ఆవగింజ నుంచే కొన్నివేల ఆవాలు విత్తనాలు వచ్చి సమస్త సృష్టి వ్యాపిస్తుంది. ఈ సృష్టి ఎప్పుడు వస్తుంది? ప్రళయం ఎప్పుడుపోతుంది? అంటే మామూలుగా ఏమోనండి - సూర్యోదయం అయినపుడు పగలు అవుతుంది. చీకటి పడినప్పుడు రాత్రి అవుతుంది. అదే కొన్నాళ్ళు వాచీ దగ్గరపెట్టుకొని టైము లెక్కవేసికొంటే ప్రతి 12 గం.లకీ సూర్యోదయం ప్రతి 12 గం.లకీ సూర్యాస్తమయం. కాలంలో ఇంత లెక్కలున్నాయి. సూర్యోదయం అయితే పగలు ఇన్ని గంటలు ఉంటుంది. సూర్యాస్తమయం అయితే చీకటి ఇన్ని గంటలు ఉంటుంది. రాత్రి ఎంత పొడుగు ఉంటుందో పగలు కూడా అంతే పొడుగు ఉంటుంది. ఇటువంటి లెక్కలు, యుగాలు కలియుగం, కృతయుగం, త్రేతా యుగం, ద్వాపరయుగం ఇవన్నీ ఒక చక్రంతిరిగిన తరువాత ప్రళయం. ప్రతి యుగం అంతమై మళ్ళీ ఇంకొక యుగం మొదలు అయ్యేటప్పుడు మధ్యలో చిన్న ప్రళయాలు వస్తాయి. చిన్న ప్రళయం అంటే ప్రపంచంలో వరదలు రావడం, సముద్రాలు పొంగి ఉప్పెనలు రావడం, భూకంపాలు వల్ల, అగ్నిపర్వతాలు వల్ల అనేకమంది చచ్చిపోవడం, యుద్ధాల వల్ల, వీళ్ళలో వీళ్ళు కొట్టుకు చచ్చిపోవడం, రాకెట్లు వేసుకొని, బాంబులు వేసుకొని చచ్చిపోవడం, స్వంత తెలివి తేటలవల్లా, సైన్సువల్లా కనిపెట్టి ఆ ఉపాయాలవల్ల చచ్చిపోవడం, తక్కువసమయంలో ఎక్కువ మంది చచ్చే వెపన్స్ కనిపెడుతున్నారు కదా! ఇదే కలియుగం అంటే. ఇంత సైన్సు పరిజ్ఞానంవల్ల ఏమి కనిపెడుతున్నారు అంటే రాకెట్లు కనిపెడుతున్నారు. రాకెట్లు కన్నా ఇంకా పెద్దవి ఆటం

బాంబులు కనిపెట్టారు. అట్లాగే ఇంకా పెద్దవి హైడ్రోజన్ బాంబులు అంటే వీళ్ళు ఆలస్యం అయిపోతుంది ప్రళయం అని తొందర పడిపోతున్నారు, అన్నమాట. నాకు ఒక్కోసారి నవ్వు వస్తుంది. చదువుకోని మూఢుడి నోట్లోంచి ఒక్కోసారి భగవంతుడు జ్ఞానం ఇస్తాడు. పూర్వం నేను కలెక్టర్‌గా పని చేసేటపుడు రాజమండ్రిలో ఒకరోజు నేను క్యాంపుకు వచ్చినపుడు పెద్ద గలాటా జరిగి ఆర్మీని కూడా పిలిచి ఫైరింగ్ అయ్యి చాలామంది చచ్చారు. గొడవఅయ్యింది. ఊరంతా కర్ఫ్యూ పెట్టారు. బయటకు వస్తే కాల్చివేయమన్నారు. 144 సెక్షన్ పెట్టారు. సరే నేను ఐ.ఏ.యస్. ఆఫీసర్‌ని, పనిలేదు. వాకిట్లో కూచుని మంగలి వచ్చాడు. క్రాఫ్ చేస్తున్నాడు. గడ్డం చేస్తున్నాడు. మాకేంటంటే ఊళ్ళో ఏం జరుగుతుంది, ప్రజలు ఏమి అనుకుంటున్నారు తెలియాలంటే ఆఫీసు వారిని, తాసీల్‌దారుని అడిగితే చెప్పరు. ఏం లేదు సార్! అంతా బాగానే ఉందని చెప్తారు. కష్టసుఖాలు ఎప్పుడూ ఆఫీసువాళ్ళు ఛస్తే చెప్పరు నిజం. మన దగ్గర పనికోసం వచ్చేవాళ్ళు కూడా బ్రహ్మాండంగా ఉంది సర్ రాజమండ్రి అని చెప్తారు. అంతేకానీ ఇన్ని ఇబ్బందులు ఉన్నాయని ఛస్తే చెప్పరు వాళ్ళు. చిన్నపిల్లలు చెప్పాలి లేకపోతే ఈ మంగలి వాళ్ళు, చాకలివాళ్ళు, లోకాభిరామాయణంగా వారిచేత మాటాడిస్తే అపుడు వారు చెప్తారన్నమాట. (ఆ మంగలితో)

వే.వ్యా : ఏమిటిరా ఊరంతా సద్దుమణిగిందే? అన్నాను. (వాడు పనిచేసుకు పోతూనే ఉన్నాడు)

మంగలి : ఏందండి బాబయ్యా! నిన్నంతా ఫైరింగ్ అయ్యింది. ఇంతమంది (చాలామంది) చచ్చారండి. (అన్నాడు)

వే.వ్యా : ఎందుకు అయ్యిందిరా ఫైరింగు ?

మంగలి : మన కుర్రాళ్ళు సరైన వాళ్ళుకాదు కదండీ ! వీళ్ళు వెళ్ళి పోలీసుల మీద ఏదో వేశారట. వాళ్ళు వీళ్ళ మీద ఫైరింగిచ్చారు.

(అంతా అయ్యింది. చివరకొచ్చింది పని అయ్యింది, లెగవబోతున్నాడు)

వే.వ్యా : అసలీ గొడవలు ఎందుకురా?! ఇంతమంది ఛస్తారు. ఈ రాజమండ్రిలో ఉండి తిని కూర్చోలేర్రా ఈ కుర్రాళ్ళు.

మంగలి : మా కుర్రాళ్ళని ఇంట్లో అట్టేపెట్టడం కష్టమైందండి.

వే.వ్యా : మరి పోయి, పోయి ఎందుకు కొని తెచ్చుకుంటారు, ఈ ఫైరింగ్ ఛావులు.

మంగలి : ఆ!! నూకల్లేకండి, కాలం వచ్చేసింది గదండీ, కాలం తోసేస్తుంటే ఏం చేస్తాడండి. (అంటూ వెళ్ళిపోయాడు)

కనుక కాలం మనిషికి వినాశాన్ని, మంచి బుద్ధులను, చెడు బుద్ధులను కలిగిస్తుంది. "వినాశకాలే విపరీతబుద్ధిః". శ్రీకృష్ణుడు రాయబారం వచ్చి అన్నిమాటలూ చెప్తాడు. సంధిచేసుకోండిరా లేకపోతే యుద్ధంవస్తుంది. ఇన్ని కోట్ల మంది ఛస్తారు. కౌరవులు, పాండవులు మాత్రమే ఛావరు, కొన్ని కోట్ల మంది జనం ఛస్తారు. యుద్ధం ఎందుకు ? ప్రపంచశాంతి అంటే వారు వింటారా, వినరు. విననప్పుడు చెప్తాడు. ఇప్పుడు తెలియదు మీకు "వినాశకాలే విపరీతబుద్ధిః" ఎదురుగుండా వినాశనం నడుస్తున్నప్పుడు దాని వెనకాలే ముందుగా దానికి విపరీతబుద్ధి కలుగుతుంది. ఎట్టాగా మనకు పంటలు పండేటువంటి సీజన్ వచ్చేటప్పుడు పంట కంటే ముందుగా పూవులుపూసి, పిందెలువేసినట్టుగా తరువాత కాయలుకాసేది అట్లాగే చెడు

అనే ఫలితం వచ్చేముందు విపరీతబుద్ధి అనే పూవు పూస్తుందట ముందు మనస్సుకు. అట్లాగే మంచి రోజులు వచ్చేముందు సద్బుద్ధి - భగవంతుడికి పూజచేద్దాం, ఆ గురువు గారికి ఏదో నమస్కారం పెడదాం వంటి మంచి బుద్ధి కలుగుతుంది. ఈ రెండూ గ్రహించని మనిషి అన్నీ మన తెలివితేటలే అనుకొంటాడు. మన తెలివితేటలు కనుక అయితే మనం కావాలని అనుకొన్నప్పుడు మంచిఆలోచనలు వస్తాయా ? మనకు కోపం వచ్చినపుడు వద్దనుకొంటే వెంటనే కోపం పోతుందా. పోదు. దీనినిబట్టి మన మనస్సు మన వశంలోలేదు మన కర్మయొక్క వశంలో పనిచేస్తుంది. దానివల్ల మనం చేసేవాటి కర్మ ఫలితాలు మనం అనుభవిస్తున్నాం. ఏదో వెధవపని చేస్తాడు. తీసుకెళ్ళి జైల్లో పెడతారు 12 ఏళ్ళు. ఒకసారి కర్నూలులో పనిచేస్తున్నప్పుడు జైలునుంచి విడుదలైన వాళ్ళందరికీ భూమి గవర్నమెంటువారు ఇస్తున్నారు. ఐదేసి ఎకరాలు. మామూలుగా కొద్ది జ్యోతిష్యం, సాముద్రికం ఛాదస్తం నాకు ఎప్పుడూ ఉండేవి. ఒకడు పట్టాలు తీసుకుంటుంటే వాడి చేతిలో గీతలు ఎలా ఉన్నాయో చూశా! చూస్తే అడ్డంగా కట్టెలు కట్టెలుగా ఉన్నాయి చేతినిండా. పట్టాకాగితం ఇవ్వకుండా ఆపి (వాడితో) -

వే.వ్యా : ఎన్నాళ్ళుగా జైల్లో ఉన్నావు.

వాడు : 36 సం.గా దొర.

వే.వ్యా : 36 సంవత్సరములా యావజ్జీవ కారాగారశిక్ష కూడా 17 సంవత్సరములే కదరా! మరి నీకు 36 సం. ఎట్టావేశారు శిక్ష ?

గవర్నమెంటు రూల్స్ప్రకారం 17 సం.కు మించి ఉండదు. (ఇక్కడ రికార్డింగ్ సరిగా జరుగలేదు)

వే.వ్యా : కలిసిపోతే పట్టుకోరురా ?

వాడు : ఆ! ఎందుకు పట్టుకుంటారు స్వామి. వాళ్ళుఅంతా విష్ణు సహస్రనామం నేర్పారు నాకు, నారాయణ మంత్రం చేయిస్తారు. భజనలు చేయిస్తారు.

అందుకని చుట్టుప్రక్కల జనాన్ని పోగుచేసి భజనలు చేయిస్తున్నారట. ప్రసాదాలు పంచి పెడుతున్నారట. వాళ్ళతో తిరుపతి, శ్రీశైలం, రామేశ్వరం, కాశీ అన్ని యాత్రలు చేశారట. అందువలన మంచికర్మవాడికి తెలియకుండానే కొన్ని ఈ చేయించే వాళ్ళు పెద్దలు అన్నాడు. అందువలన ఈ చేతిలోవున్న మంచికర్మ వాడికి తెలియకుండానే చేయిస్తోంది. ఒక మంచి పని చేస్తే ఇంకో మంచిపని. ఒక చెడు పని చేస్తే ఇంకో చెడుపని. ఇట్లా అల్లిక వేస్తే జడ అల్లినట్లుగా అల్లుకుపోతుంది కర్మ. అట్లాగ ఈ కలి యుగంలో 5000 సంవత్సరములుగా మానవుడు చేసిన కర్మలు అన్నీకూడా పేరుకొని అవి పైన మేఘాలుగా ఉండి ఇప్పుడు ఈ నూరు సంవత్సరములు అనగా 1910 సం. నుంచి 2010 సం. దాకా ఈ వచ్చేటువంటి ఫలితాలను అప్పుడు ఇస్తాయి. ఇప్పుడే ఎందుకిస్తాయి ? ఇదివరకు ఎందుకు ఇవ్వలేదు? అంటే మీరుఎప్పుడైనా ఇన్స్యూరెన్సులో పాలసీ కడితే అది పూర్తిగా పరిపాకం అయినపుడే డబ్బిస్తాడు మనకి. అట్లాగే రు.10000/- బ్యాంకులో లోను తీసికొంటే దానిటైము అయిపోయిన దాకా పండుగగానే ఉంటుంది. ఆ తరువాత వారు నోటీసు ఇచ్చి ఇల్లు, వాకిలీ జప్తు చేస్తారు. ఈ లోపల వాడు చేసిన పుణ్యమైనా, పాపమైనా ఫలితం ఇవ్వదు. దాని టైము రావాలి.అట్లాగే పెళ్ళి చేసుకుని 10 నిమిషములు సంతోషంగా ఉంటే 9 నెలల తరువాత దానిఫలితం కనిపిస్తుంది. అట్లా ప్రతీదానికీకూడా ఫలితానికి టైమ్

పడుతుంది. దీన్నికర్మఫలం అంటారు. కర్మ పరిపాకం కావాలి. పుణ్యమైనా సరే. కొందరు అంటారు 'ఏవండీ మీరేదో నిస్వార్థసేవ చేయమన్నారు, నారాయణ మంత్రం చేయమన్నారు, విష్ణుసహస్రనామం చేయమన్నారు. నేను మొదలుపెట్టి 3 నెలలు అయ్యింది. మాకు ఇంకా ఏం ఫలితం రాలేదు." మరి బి.ఎ. చదువుకున్నావు. బి.యల్. చదువుకున్నావు, లాయరు బోర్డు పెట్టావు. ఎన్నాళ్ళు అయిన తరువాత నీకు డబ్బులు వస్తున్నాయిరా? అంటే "10 ఏళ్ళు అక్కడ ఇక్కడ తిరిగానండీ, ఇప్పుడు కొద్ది, కొద్దిగా వస్తున్నాయండీ." మరి నీకు దానికి ఎంత టైము పట్టిందో దీనికీ అంతే టైము పడుతుంది కదరా! అంటే తొందరండీ, అంచేత అడిగాను. చిన్న మొక్క(గింజ)పెట్టాడట పిల్లవాడు. రోజూ మొలిచిందో లేదోనని పీకి చూస్తుంటాడట. ఇంకేం మొలుస్తుంది? అందువలన మనం ఏదైనా సత్కర్మ మొదలుపెడితే దాని ఫలితంగురించి ఆలోచించగూడదు. చేసుకు పోతుండాలి. ఈ విధంగా మనకు ముఖ్యమైనటు వంటి ఆధ్యాత్మికసూత్రా లను చెప్పేటు వంటిది భాగవతం. ఈ భాగవతంలో భగవంతుని యొక్క లక్షణాలు - భగవంతుడు అనగా ఏమి ? పరమాత్ముడుగా ప్రళయ సమయంలో నశించకుండా ఉండేటువంటివాడు. సృష్టికి కారణమైన బ్రహ్మ దేవునికి కూడా పుట్టుకను ఇచ్చిన తండ్రీ, తల్లి ఉంటే కదా కొడుకు పుట్టేది!? అందువల్ల పరమాత్ముడు రెండు. మూడవది ఏమిటి ? ఈ కనబడేటువంటి జగత్తు, ప్రపంచం సర్వమూ కూడా భగవంతునియొక్క నిర్మాణమే. ఆయన తయారుచేసిందే. నిర్మాణంఅంటే కుమ్మరివాడిలా కూర్చుని చేత్తో నిర్మాణం చేస్తాడని కాదు. ఈ సైన్సువాళ్ళు చూసి మాకేం భగవంతుడు కనబడుటలేదు ఇక్కడ ఏం నిర్మాణం జరగటం లేదు అంటే "కడుపులో 9 మాసాలు నీ శరీరం నిర్మాణం అవుతుంటే భగవంతుడు వచ్చి నీకు కనబడ్డాడా, లేకపోతే

నీకాలు, చెయ్యి ఎక్కడున్నాయో ఎక్కడ పెట్టాడో, నీవు పుట్టాక 10 ఏళ్ళు వచ్చేవరకూ నీకాలు ఎక్కడుందో, నీ చేయి ఎక్కడుందో నీకే తెలియదు! తల్లి నెత్తిమీద రెండువేసి అన్నం బలవంతాన తినిపిస్తే బ్రతికుంటాడు. అట్లా భగవంతుడు రక్షిస్తే మనం బ్రతికిఉంటాం. బ్రతికిఉన్నప్పుడు మన తెలివి తేటలు అనుకుంటాం. అలాగ మనకు బుద్ధి, జ్ఞానంలేని టైములో కూడా మనల్ని రక్షించి ఉంచేటువంటిది ఈ భగవత్‌శక్తి." ఇప్పుడు మనం బ్రతికున్నాం, మాట్లాడుతున్నాం. అక్కడకు వెళ్ళుతున్నాం. ఈ కారు తీసికెళ్ళాం, గురువుగారిని తీసుకొచ్చాం.అంతా మన ప్రజ్ఞనుకుంటాం. కానీ ఊపిరి ఆడుతుంటేనే ఈ పనులు చేయగలం. గుండె కొట్టుకొంటేనే ఈ పని చేయగలం.ఎప్పుడు ఊపిరి ఆగిపోతుందో, ఎప్పుడు ఈ గుండె కొట్టుకోవడం ఆగిపోతుందో మనకే తెలియదు.

ధర్మరాజును యక్షుడు ఒక ప్రశ్న అడిగాడు. రాజా 'ప్రపంచంలోకెల్లా అద్భుతం ఏమిటి? చెప్ప'మని అంటే ఆలోచించాడు. అనేక అద్భుతాలు ఉన్నాయి. అందులో వీడు ఏమి అడుగుతున్నాడు. ప్రతినిత్యం ఎదురుగుండా శవాలు పోతున్నాయి. చచ్చిపోయినవాళ్ళు రోజూ గంటకు ఒకడు ఛస్తున్నాడు. స్మశానానికి పోతున్నాయి. అవి చూస్తూకూడా మనుష్యుడు ఇది మనకు కాదులే. మనకు ఇప్పుడప్పుడే కాదులే అనుకుంటాడు. ఇదే మహాశ్చర్యం. అంటే ప్రతినిత్యం మృత్యువు ఎవడినో ఒకడిని పట్టుకుపోతుందని తెలిసీ వాడి ఒక్కడినీ పట్టుకెళ్ళదనుకుంటాడు వాడు. వాడిని పట్టుకెళ్ళినపుడు వాడు విచారించడానికి టైము ఉండదు. వీడికి చెప్పి వస్తాడా. వాడు !? (యముడు) ఇది మహాశ్చర్యం అన్నాడు.అలాగే కాలం ఎప్పుడు ఏమి చేస్తుందో మనకు తెలియదు. అందువలన జ్ఞాని అయినవాడు ఏం చేయాలంటే కాలం మనకు అనుకూలంగా ఉన్న టైములోనే మనమేలు

మనంకోరి ప్రతినిత్యం కొంచెంజపం, భగవధ్యానం, ఈ సమస్తాన్నీ సృష్టించిన ఓ పరమాత్ముడా నా శరీరాన్ని బ్రతికించే ఓ దేవుడా, నా శ్వాస, ఉచ్ఛ్వాసలు నడిపించే పరమాత్ముడా అంటూ కొంచెం భగవంతుడిని తలచి ప్రార్థించడం నేర్చుకోవాలి. ఎందువల్లనంటే మనం 10 మార్లు భగవంతుడిని తలిస్తే భగవంతుడు మనల్ని ఒకసారైనా తలుస్తాడు కదా. మనం వారిని తలవడానికి వారు మనల్ని తలవడానికి తేడా ఉంది. ఒక్కసారి భగవంతుడు మనల్ని గురించి తలిస్తే మనం ముక్తి పొందుతాం. అందువలన ఈ భగవత్‌ధ్యానం, భగవత్ స్మరణ, భగవంతుని సంకీర్తన, భగవంతుని గురించి కథలు వినడం. భక్తి కలగాలంటే ఏమిచేయాలి. భక్తులయొక్క సావాసం, వారి స్నేహం,వారు చెప్పేటువంటి మంచిమాటలు వినడం, వారు చెప్పేటటువంటి వాటి యందు ఆసక్తి కలిగి ఉండటం, విశ్వాసం కలిగియుండటం, వారు చెప్పింది చేయడం, ఈ విధమైనటువంటి సత్సాంగత్యం వలన మానవుడికి తనలో ఉన్న చెడు నశింపు అవుతుంది. లేకపోతే దానంతట అది పోదు. చెడును పెంచేవాళ్ళు బోల్డంత మంది ఉంటారు. ఒరే పేకాట ఆడుదాం రండిరా అంటే 10 మంది 100 మంది పోగవుతారు. సత్సంగం చేద్దాం అంటే సగం మంది వెళ్ళిపోతారు. ఈ మధ్య విజయవాడలో బజారులో మీటింగ్ షరాబు వాళ్ళందరూ పేడితే బంగారు దుకాణాల మధ్యన పెడితే దాదాపు రెండు మూడు వేల మంది ఇలాగే వచ్చారు. అందులో ఒకాయన లేచి వర్తకుడు కదా! తెలివైన వాడు 'ప్రళయం వస్తుందంటున్నారు కదా! చచ్చిపోతారు కొందరు, కొంతమంది మిగులుతారు అంటున్నారు! ఎంతమంది మిగులు తారు ?ఎంతమంది పోతారు? అని అడిగాడు. అంటే నేనన్నాను, "ఇపుడు విజయవాడ నగరంలో మొత్తం జనం ఎంత మంది ఉన్నారు?" 'కొన్ని లక్షల మంది ఉంటారండి' అన్నాడు. ఇప్పుడు ఈ మీటింగుకు ఎంతమంది

వచ్చారు? రెండు,మూడు,ఐదు వేలమంది వచ్చారు. ఇంతమంది మిగులు తారు. అంతమంది పోతారు అని చెప్పాను. వెంటనే పరుగెత్తుకొనివెళ్ళి ఒక టెంకాయ తీసుకువచ్చి సాష్టాంగనమస్కారంచేసి, ఎందుకైనా మంచిదని పెట్టుబడి పెట్టేశాడుఅప్పుడే. పోనీ అలాగైనా సరే వాడు భగవత్ భక్తి. ఏదో ఒకటి. ఒక ప్రక్షాళన అంటే దాన్ని తుంచేస్తాయి. భక్తివిశ్వాసాలు పోగొట్టి, స్వార్థాన్ని పెంచేవి మనిషికి, మనిషికి వైరాన్ని పెంచేవి, హింసను పెంచేవి. యుద్ధాలు, రక్తపాతాలు, కొట్లాటలు, రాజకీయాలు, గొడవలు ఇవి కలియొక్క లక్షణం. కలి అంటే తగాదాలు, కొట్లాటలు, ఇద్దరు రెండు పార్టీలు, రెండు నాలుగు పార్టీలు, నాలుగు పదిపార్టీలు కొట్టేసుకుంటూరు. చచ్చిపోతారు. ఎందుకు చచ్చిపోయారో తెలియదు. చచ్చాక ఎట్లాగా తెలియదు ఈ విధంగా ప్రపంచంలో కొంత జనాభా నశిస్తుంది. ఈ సముద్రాలు పొంగిరావడం, వరదలు రావటం, పంటలుసరిగా పండక పోవడం పండిన పంటలను ఈ మిడతలు అవన్నీ తినేయడం, ఈ క్రిమికాటకాలు నాశనం చేయడం,ఇవిపోగా మిగిలిన ఈ వర్తకులు దాచేసి మామూలు వాళ్ళకు తిండి దొరకకుండా చేయడం, దీనివల్ల చాలా మంది జనక్షయం అవుతుంది. ఈ కలియుగం ఎప్పుడు ప్రారంభమయ్యింది. ఇంత లెక్కలు ప్రకారం చెప్తున్నారే ఈ కలి యుగం ప్రారంభం ఎప్పుడో అంటే భాగవతంలో, విష్ణుపురాణంలో స్పష్టంగా చెప్పారు. "యస్మిన్ కృష్ణో దివంయాతః తస్మిన్ ఏవ తదాహని ప్రతిపన్నం కలౌయుగం" ఏ రోజున అయితే శ్రీకృష్ణపరమాత్ముడు అవతారం పూర్తిగా చాలించి శరీరం విడిచిపెట్టి వైకుంఠానికి వెళ్ళాడో ఆ రోజునే సరిగ్గా అదే గంటలో కలి ప్రవేశించాడుట. ఎందుకయ్యా అప్పుడే ఆ రోజునే ఆ నెలలోనే ఆ గంటలోనే కలిప్రవేశించాడు అంటే అంతకు ముందు నుంచే పైన కాచుకొనిఉన్నాడట "యావత్సపాద పద్మాభ్యాం పస్పర సేయాం వసుంధరం"

భగవంతుడు అయినందు మూలాన శ్రీకృష్ణుడు పాదాలు ఎంతకాలం అయితే భూమిని అంటుకొని ఉన్నాయో అంతకాలం ఈ భూమిని కలి పురుషుడు వచ్చి ఆక్రమించుకోలేక, భయపడి ఊరుకున్నాడట. ఆయన ఎదురుగుండా వస్తేభస్మం అయిపోతానేమో. ఆయన ఎప్పుడుపోతాడో అని కాచుకుకూర్చు న్నాడట. అందువల్ల 125 సంవత్సరములు కృష్ణుడు భూమి మీద బతికి ఉన్నాడు. అంతకాలం కలిపురుషుడు ఏడుస్తూ భూమిమీద పైనెత్తిమీద గుడ్డవేసుకొని కూర్చున్నాడు.శ్రీకృష్ణుడు పోయాడు అని తెలియగానే ఆరోజుననే ఆ క్షణాన్నే కలి ప్రవేశించాడు. అందువల్ల "యస్మిన్ కృష్ణో దివం యాతః" ఏ రోజు అయితే శ్రీకృష్ణపరమాత్ముడు అవతారం చాలించి వైకుంఠానికివెళ్ళాడో ఆక్షణంలోనే ఈ భూలోకానికి కలి ప్రవేశిం చాడట. ఈ కలి ప్రవేశించి ఏమి చేశాడో దానిగురించి భారతంలో ఉంది.

పూర్వం ధర్మంగా నడిచేది. కలి లేనప్పుడు కృష్ణుడు బ్రతికి ఉన్నంత కాలం నాలుగుపాదాల ధర్మం నడిచేది. ఈ ధర్మరాజు బ్రతికుండగానే కలి పురుషుడు వచ్చి ఎప్పుడు ఎప్పుడా అని ఇప్పుడు ఒక మంత్రి ఉండగానే ఇంకొక మంత్రి అధికారం ఎప్పుడు వస్తుందా అని ఎట్లా తాపత్రయపడతాడో అట్లా ధర్మం ఉండగానే తన అధర్మం కోసం అధికారం కోసం తపనబడి పోయాడుట. చివరికి ఒకరోజున కలిపురుషుడు మారు వేషంలో ఒక రాజు వేషం వేసుకొని, ఒక గుఱ్ఱం తీసుకుని ఒక కత్తి, కిరీటం పెట్టుకొని ధర్మరాజు దగ్గరకు వచ్చాడట హస్తినాపురం. వచ్చి. అక్కడ గుఱ్ఱాలుఅమ్ముతాం మేము రాజులకు గుఱ్ఱాలు అమ్ముతాం అని వ్రాసి పెట్టాడు. భీముడు, నకులుడు, సహదేవుడు, అర్జునుడు అందరునూ ఒక్కొక్కడు గుఱ్ఱాలను కొనటానికి పోయి ధర ఏమిటయ్యా ? నాకు ధరలేదు. ఊరకే ఇస్తాను. గుఱ్ఱాలు మరి అమ్ముతానన్నావు, ఊరికే ఇస్తానంటున్నావు. నిమిషానికి ఒక్కోమాట

చెప్తున్నావు. ఇదే మరి కలియొక్క లక్షణం. నేను అడిగిన ప్రశ్నలకు ఎవడైతే సమాధానం చెప్తాడో వాడికి గుర్రాలు ఫ్రీగా ఇస్తాను అన్నాడు. అబ్బా అంత తెలివైనవాడవా నువ్వు చెప్తాము అడుగు అంటే వెయ్యి మణుగుల బరువుని ఒక్క కానీ బరువు ఎప్పుడు మోస్తుంది? ఎలా మోస్తుంది? చెప్పమన్నాడు. భీముడు చెప్పలేక పోయాడు, అర్జునుడు చెప్పలేక పోయాడు. అందరినీ అక్కడ కూర్చోపెట్టేశాడు. ఎవరైతే సమాధానం చెప్పలేదో నేను గీసిన గీతమీద కూర్చోమన్నాడు. ధర్మరాజు చూశాడు. ఏంటిరా! ఈ పాండవులు ఎవరిమటుకు వారు రాలేదు. సభ అయిపోతోంది. ప్రొద్దునే ఎవరో గుర్రాలు అమ్ముతా నన్నాడు. ప్రశ్నలు వేశాడు. మీవాళ్ళు అందరినీ అక్కడ నిలబెట్టాశాడు అన్నాడు. ఎవడురా వీడు ఈ పాండవులు అంతటివారిని నిలబెట్టాడు. ధర్మరాజే స్వయంగా వెళ్ళాడు. ఇదేమాట చెప్పాడు వాడు. నేను అడిగిన ప్రశ్నలకు ఎవరైతే సమాధానం చెప్తే గుర్రాలన్నీ ఫ్రీగా ఇచ్చేస్తాను, మీ తమ్ముళ్ళను విడిచిపెట్టేస్తాను అన్నాడు. ఇదే ప్రశ్న అడిగాడు. ఒక్క కానీ తన బరువుతోటి కొన్ని మణుగుల బరువును ఎప్పుడు ఆపుతుంది? ధర్మ రాజుకు కోపం వచ్చింది. దుర్మార్గుడా ఇది కలియుగంలో జరిగేది ఇప్పుడు అడుగుతున్నావా నీవు. మనిషివేలకొద్దీ పాపాలు చేసి ఒక్క 'కానీ' భగవంతుడికి ధర్మం చేస్తాడు. ఈ 'కానీ' వాడు నరకంలో పడకుండా నిలబెడుతుంది. అదేకదా నువ్వు అడిగింది. అవును స్వామీ నువ్వు చెప్పింది నిజమే. నువ్వు కరెక్టుగా పట్టుకున్నావు. ఇంకొకటేమిటి ? ఆవు దగ్గర దూడపాలు తాగుతుంది సరే. దూడ దగ్గర ఆవుపాలు ఎప్పుడు తాగుతుంది ? అన్నాడు. అంటే ధర్మరాజుకు కోపం వచ్చి కత్తి తీసి దుర్మార్గుడా! ఈ ధర్మరాజు పరిపాలనలోనే ఇంత కలియుగ విషయాలు అడుగుతావా నీవు దూడదగ్గర ఆవు పాలు తాగటం ఏమిటి అంటే నేను అడిగినదానికి అర్థం చెప్పమన్నాడు. అంటే

ఆడపిల్లను కన్నవారు తండ్రి ఆవులాంటివాడు. పిల్ల దూడలాంటిది. ఎందుకని? పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించి వెళ్ళి దానికి నగలు పెట్టినా ఎప్పుడు పిల్లకి ఏంకావాలో, ఏంనగలు పెట్టాలో దాన్ని ఆవు దూడకి ఎట్లాగైతే కావాలో,అట్లా తల్లిదండ్రులు చూడాలి. కానీ ఈ కలియుగంలో ఈ ఆడపిల్లలకు పెళ్ళిచేయకుండా ఉద్యోగాలు చేయించి వాళ్ళు సంపాదించే డబ్బు వీళ్ళు తీసుకొనుట మూలాన దూడదగ్గర ఆవు పాలు త్రాగడం. ఇది ఘోరమైన కలియుగంలో నడిచేది. దుర్మార్గుడా నీవన్నీ ఇట్టాంటి తలకిందులు ప్రశ్న లెందుకేస్తున్నావు ? ఇంక మూడో ప్రశ్న. ఆఖరిప్రశ్న అడుగుతాను చెప్పు అంటే అన్నీపశువులు, ఆవులుగాని, గేదెలుగాని, మేకలుగాని నోటితో గడ్డిమేసి వెనకాలనుంచి పేడ వేస్తాయి. వెనకాల నుంచి మేసి నోటితో పేడ వేసే పశువులు ఏవి? అన్నాడు. దానికి మండిపడి ఈ కలియుగంలో జరిగే అధర్మాలు అన్నీ అడుగుతావా నన్ను వంకరటింకరగా నువ్వు. నిజమే చెప్తానన్నావుగా సమాధానం మీ తమ్ముళ్ళను విడిపించు కోవాలంటే చెప్పు అంటే, అప్పుడు అన్నాడు "నోట్లో నుంచి అబద్ధాలు, ఈ చెడు అబద్ధాలు, అనర్థాలు అన్నీ మాటాడటం, నోట్లోనుంచి పేడవేయటం లాంటిది". ఇది కలియుగంలో ప్రతివాడు స్వార్థం కోసం చేస్తాడు. ఇలా ప్రతీ దానికీ తిరగేసిన సమాధానాలుచెప్పి అప్పుడు ఇంతకీ నీవు ఎవడివిరా? అయ్యా! నేను కలి పురుషుడిని నాకు కూడా పరిపాలన టైమ్ అయింది. మీ పరిపాలన ఎప్పుడు తీరుతుంది. ధర్మరాజుగారు! మీరు ఎప్పుడు దిగిపోతారు. నాకు అధికారం కావాలి. అంటే ఇంకో 10 రోజులు, వారం రోజులు టైమ్ పడుతుంది. శ్రీకృష్ణపరమాత్మ అవతారం అయిపోయే అంతవరకు నీకు ఛాన్సులేదు. ఈలోపల శ్రీకృష్ణుడు ద్వారకలో టైమ్ అయ్యింది కలియుగప్రవేశం అయింది. ఆయన అవతారం అయిపోయింది. కానీ ధర్మరాజుకు ఇంకా వార్త

అందలేదు. అర్జునుడు వెళ్ళి ఇంకా తిరిగి రాలేదు. ఈ లోపల అన్నీ చెడు శకునాలు కనబడుతున్నాయి. దేవాలయాలలోని విగ్రహాల నుండి కళ్ళవెంబడి నీళ్ళు వస్తున్నాయి. ఆకాశంలో తోకచుక్కలు కనబడుతున్నాయి. పట్టపగలే నక్షత్రాలు కనబడుతున్నాయి. భూమి గడగడ కంపిస్తోంది. కారణం లేకుండా ఆవుల కళ్ళ వెంట నీళ్ళు వస్తున్నాయి. హోమాలు, యజ్ఞాలు చేస్తే మంటలు రాకుండా పొగలు వస్తున్నాయి. ఈ విధంగా అన్నీ అపశకునాలే చూచి ధర్మరాజు ఏమిటిరా ఈ అన్యాయం అనుకొంటూ సభకువెళ్ళి కూర్చు న్నాడట, మంత్రివచ్చి 'వీళ్ళు ఇద్దరు బ్రాహ్మణులకి తగాదా ఉంది, రాజుగారు తీర్చాలి.' ఏమిటి అంటే

మంత్రి : వేయి రూపాయలు అప్పు తీసుకున్నాడు. ఆ అప్పు చెల్లించాలి.

ధర్మరాజు : ఆహా..!! చెల్లించాలి, చెల్లించండి.

మంత్రి : కాదండి. మేము అప్పు ఇవ్వక్కర్లేదు. అంటున్నాడు వాడు.

కలిమారేటప్పటికి వీడి బుద్ధి మారిపోయింది. అంటే రాజు వాడిని బెదిరించి దొంగవెధవా నిన్న కదా నీవు వాడి దగ్గర అప్పు తీసుకుంది.అప్పు ఇచ్చాను. మర్నాడు వచ్చి నేను నిన్న ఒప్పుకోలేదు అని చెప్పాడు. అపుడు మంత్రిని అడిగాడు. ఏమిటి చేయడం? ఎట్లా? వీడు నిన్న చెప్పిన మాట ఈవేళ చెప్పలేదంటున్నాడు. వాడి చేత రాయించి సంతకం పెట్టించి దస్తావేజులు వ్రాయమను. ప్లీడరుయుగం ముందే ప్రారంభమైంది. కలికోటు అందుకే వారికి అంటే నల్లకోటు. అవే వేసుకుంటారు. అందువల్ల వాడు ఏం చేశాడంటే ఒక దస్తావేజువ్రాసి నేను ఫలానా ఇన్ని రూపాయలు తీసి కొన్నాను. ఇంత రూపాయలు ఇస్తాను అని సంతకం పెట్టించాడు. ఇంకా వీడెక్కడికి పోతాడులే అనుకున్నాడు ధర్మరాజు. మర్నాడు వారిద్దరూ కొట్టు

కుంటూ వచ్చారుట ఏమంటే నేను వాడి దగ్గర డబ్బు పుచ్చుకోలేదు అంటున్నాడు. అదేమిటిరా!! నిన్ననే వ్రాసి సంతకం కూడా పెట్టావు అంటే ఆ సంతకంనాది కాదు అన్నాడట. ఛ..ఛ..ఛ..దొంగవెధప వీడు. దీనికి ఏమిటి ఉపాయం అన్నాడుట. మంత్రిగారు అన్నారు. దానికి ఒక సాక్షిని పెట్టండి అని. సాక్షి సంతకంకూడా పెట్టించండి. సాక్షి సంతకం పెట్టించారు. మూడో రోజు మరలా కొట్టుకుంటూ వచ్చారు. ఏమిటిరా ? ఆ సాక్షి కూడా సంతకం నాదికాదన్నాడుట. ఒక పదిరూపాయలు తీసుకొని సాక్షి సంతకం నేనుపెట్టలేదు అన్నాడు. ఓరి! వెధవల్లారా. ఇంకేముంది... ఇది వరకు ఊరు వెళుతుంటే పక్కింటి వారికి చెప్పి మేము ఊరువెళ్తున్నాము కాస్త చూడండి అంటే వాళ్ళు ఇల్లు శుభ్రం చేసి ఊడ్చి దీపం పెట్టేవాళ్ళు. తరువాత వాడు వచ్చాడు. అయ్యా! నేను ఊరు వెళితే మా పక్కింటివాడు, ఇల్లంతా ఖాళీచేశాడు. ఏమని అడిగినా నాకు తెలియదు అంటున్నారు. మరి ఏమిటి దీనికి ఉపాయం. అంటే తాళం తీసుకొచ్చాడు. తాళం అంటే ఏమిటి? ధర్మరాజు ఎరగడు. ఇది ఏమిట్రా? తాళం అండి. ఎందుకురాఅది? ఇది వేస్తే రాదు అన్నాడు. మరి రాకపోతే ఎట్టారా ? అంటే వాడి దగ్గర మళ్ళీ తాళంచెవి ఉంటే వస్తుంది. అది వేసి చూపించి, అపుడు పక్కింటి వాళ్ళు రాకుండా వేశారు. ఇంకే ఇక దొంగతనాల భయం ఉండదు. మూడురోజులు అయిన తరువాత వేరేవాడు మారుతాళం పెట్టి తీశాడట. అంటే ఇంకా ఇంకా తెలివిమీరిపోతారన్నమాట. అపుడు ధర్మరాజుఅంటాడు. పరిపాలించ డానికి మన టైమ్ కాదు ఇది. వెళ్ళిపోదాం. రిటైర్ అయిపోదాం అని.పదవి దిగిపోయి. అప్పుడు వచ్చాడు కలిపురుషుడు. మీకు ఎన్ని రోజులకి ఈ విషయం అర్థమవుతుందా. శ్రీకృష్ణుడు అవతారం చాలించాడు. అందుకే రోజూ ఇలాంటి నోటీసులు పంపిస్తున్నాను అన్నాడు. మహానుభావా కలి

పురుషుడా నీవా ఈపని చేస్తుంది అంటే ధర్మరాజు ముందు ముందు ప్రతీవాడు కూడా నామాటే మాట్లాడతాడు, నాయందే ధ్యాస ఉంచుతాడు అన్నాడు. కలిపురుషుడే మెజార్టీ. మెజారిటీ ఉండే రాజకీయ పార్టీ ఎవరు అంటే, కలిపురుషుడు అని అర్థం. ఈ విధంగా అసత్యానికి మెజారిటీ, అన్యాయానికి మెజారిటీ, అక్రమానికే మెజారిటీ, దుర్మార్గం రోజురోజుకీ పెరిగిపోయేది కలియుగం. ఈ కలియుగం ప్రారంభంలో గ్రహాలు అన్నీకూడా 12 రాశులలో మొట్టమొదటి రాశి మేషరాశిలోనే ఒక్కసారి కలిశాయి. ఆ రోజునే శ్రీకృష్ణుడు యొక్క అవతారం పరిసమాప్తి అయింది. అది ఇపుడు నడుస్తున్న సంవత్సరం ప్రమాధినామ సంవత్సరమే శ్రీకృష్ణుడు నిర్యాణం అయిన సంవత్సరం కూడా ప్రమాధినామ సంవత్సరమే. ప్రమాధినామ సంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమిఅంటే ఉగాదినాడు అన్నిగ్రహాలు మేషరాశిలో కలిసినపుడు అర్థరాత్రి శ్రీకృష్ణుడు అవతారం చాలించాడు. అందువల్ల ఇది కలియుగ ప్రారంభం కాబట్టి యుగాది అని పేరు. యుగాది అంటే యుగం యొక్క ప్రారంభం అది ప్రజలు పలకలేక ఉగాది అయిపోయింది. ఉగాది పండగ సంవత్సరాదినాడు ఈ కలియుగం ప్రారంభం అయింది. ఇలా 5000 సంవత్సరములు ఈ కలియుగం వచ్చి ఏం జరుగుతుందో వ్యాసమహర్షి భవిష్యత్ అంతా కూడా ఈ నాడీగ్రంథం వ్రాసినట్లుగా ఇన్ని సంవత్సరాలు ఈ క్షత్రియుల పరిపాలన దాని తరువాత ఇన్ని సంవత్సరాలు శూద్రుల పరిపాలన, ఇన్ని సంవత్సరములు తరువాత ముస్లిముల పరి పాలన ఆ తరువాత యూరోపియన్‌ల పరిపాలన ఆపైన గోమాంస భక్షకులు పరిపాలించే వాడు ఎవడు లేకుండా రాజు అనే వాడు లేకుండా ఎవరి దగ్గర డబ్బుంటే వాడే దండుకుంటాడు. ఇప్పుడు ఎవరి దగ్గర డబ్బుంటే వాడే ఎన్నికల్లో నిలుచుంటాడు. యం.యల్.ఏ. లను కొంటాడు. పశువుల

వ్యాపారమల్లే సంతలో పశువులను కొన్నట్లు కొంటారు. ఇక వారికే అధికారం. ఈ విధంగా ఈ కలియుగం యొక్క భవిష్యత్తంతా కూడా ఈ పురాణంలో ఇచ్చాడు. ఈ కలియుగం ప్రారంభం అవకముందే ద్వాపరయుగం అంతమైనపుడు. యుగసంధిఇప్పుడు వచ్చినట్లే అప్పుడు కూడా యుగసంధి వచ్చింది. కృష్ణ నిర్యాణం, కృష్ణపరమాత్ముడు శరీరం వదిలేస్తూ ఉద్ధవుడికి చెప్పాడు. 'ఉద్ధవా మీరు అందరూ ద్వారకలో ఉండకండి ప్రళయంవస్తుంది. ఈ సముద్రంవచ్చి ద్వారకను ముంచివేస్తుంది. 7 రోజులలోపల ఈ ఊరు విడిచిపెట్టి వెళ్ళిపోండి'. అర్జునుడిని తోడు ఇచ్చి పంపాడు. వారు ఆశ్చర్యంగా ద్వారక మునిగిపోవటం ఏమిటి అని 7 రోజులలో. అర్జునుడు తొందర పెట్టాడు శ్రీకృష్ణుని మాట తప్పదు, పోదాం రండి. వీళ్ళు వెళ్ళి ద్వారకదాటి సముద్రము ఒడ్డున కొండమీదకి వచ్చారో లేదో అక్కడకు వెళ్ళి చూస్తే సముద్రం అడుగునఉంది గుజరాత్ వెళ్ళితే అక్కడ చూస్తే సముద్రంలో సందేహించిచూస్తే, ద్వారకానగరం కనబడింది. ఈ ద్వారకఉన్నట్లే ఇన్నాళ్ళు ఎవరికీతెలీదు. సముద్రంలోఉన్నట్లు ఇపుడు మళ్ళీ కలియుగం అంతమయ్యే టైమువచ్చింది, కాబట్టి ద్వారక మళ్ళీకనబడింది. ఇప్పుడు మళ్ళీ భూకంపాలువచ్చి ఈ పర్వతాలు పైకి లేచి భూకంపాలు వచ్చినపుడు ఏం అవుతాయి? మునిగిపోయిన ద్వీపాలు, దేశాలు, భూమి నీళ్ళలోంచిపైకి వస్తాయి. అట్లా ఈ ద్వారక మళ్ళీ పైకి వస్తుంది. అట్లాగే ఇదివరకు కలి యుగంలో పైకివచ్చిన దేశాలు అన్నీ మునిగిపోతాయి. ఈ కలియొక్కప్రదేశం ఇంగ్లాండు అని మనంఎట్లాగైతే అనుకొంటున్నామో ఆ దేశం మొట్ట మొదట పైకివచ్చి అక్కడ కలిపురుషుడు పుట్టాడు. బైబిల్‌లో చెప్పినటువంటి కథంతా చరిత్ర అంతా ఈ కలియొక్క పురుషుడు, అంతా భవిష్యపురాణంలో ఉంది. ఈ కలిపురుషుడు, వాడు చేసేటువంటి అన్యాయాలు, అక్రమాలు,

వావివరుసలు లేకుండా, గోత్రాలు లేకుండా, కులాలు లేకుండా, ఎవరికి ఎవరు ఇష్టమైతే వాళ్ళను పెళ్ళి చేసుకోవచ్చు. లవ్ మ్యారేజెస్ అన్నమాట. ఇది కలిధర్మం. దీనివల్ల ప్రపంచంలో గందరగోళాలు. ఈ ప్రళయాలు ఈ కలియుగాంత లక్షణాలు. దీన్నిగురించి ఇదివరకు 'కలియుగాంతం' మొదటి పుస్తకంలో ఇచ్చాను. బ్రహ్మంగారి కాలజ్ఞానంలో వ్రాశాడు కొన్ని ఆయన. వీరబ్రహ్మేంద్రయోగి తపస్సుచేసి కర్నూలులోఅక్కడ దివ్యదృష్టితో యాగంటి గుహల్లో జరగబోయే భవిష్యత్ అంతాచూచాడు, చూసి ఏంచేశాడు. 'కలౌతు అర్థసహస్రాణి యావత్ పంచగతాంచ' ఎప్పుడైతే కలియుగంలో ఐదువేల సంవత్సరములు పూర్తి అయి ఐదువేల నూరవ సంవత్సరము పూర్తి అవడంతో అపుడు యుగసంధి పుడుతుంది అన్నాడు. అంటే రెండు యుగాల మధ్యసంధి 1910కి 2010కి మధ్య ఉండే నూరేళ్ళు యుగసంధి. ఏం జరుగుతుందయ్యా ఈ యుగసంధిలో అంటే 'బహూన్యదిష్ట పూర్వాణి యంత్రాణి వివిధాని చ' ఇదివరకు 5000 సంవత్సరములలో ప్రజలు ఎప్పుడూ ఎరుగనటువంటి మిషన్‌లు, యంత్రాలు, రాకెట్‌లు, విమానాలు, స్టీమర్‌లు, ఎన్నెన్ని వచ్చాయి. 70 ఏళ్ళుగా వచ్చాయి ఇవన్నీ. మీరు ఇది వరకు ఎప్పుడైనా విన్నారా, సినిమాలు వచ్చాయి, టీ.వీ.లు వచ్చాయి.ఇంకా సెల్యులర్ ఫోన్‌లు అంటారు ఇంకా ఇంకేమిటో అంటారు. మనుష్యులతో మాయాశక్తి మాటలాడును. అంటే రేడియోలు ఉన్నాయి, వైర్‌లెస్‌లు, రోబోట్ అంటే మనిషిలాగా ఉండే యంత్రాలు, అన్నం వండి పెట్టే యంత్రాలు, ఇంట్లో అన్ని పనులు చేసి పెట్టేవి, అమెరికాలో సంసారం చేసే యంత్రాలు కూడా కనిపెట్టారట. "వినాశకాలే విపరీత బుద్ధి" అన్నారు. ఈవిధంగా మాయాశక్తి అంటే ప్రాణం ఉండకుండానే మనిషిలాగే మాట్లాడటం, టి.వి.లు, సినిమాలు అన్నీ కనబడుతుంటాయి కానీ అక్కడ ఏమీ ఉండదు.

తరువాత పక్షిలాగ ఆకాశంలో మనిషి ఎగురుతాడు, చేపలాగ నీళ్ళలో ఈదు తాడు. ఈవిధంగా అనేక ఉపాయాలు చేసి భస్మం అయిపోతాడు మనిషి. చేసి, చేసి, చేసి. చీమలకు రెక్కలు ఎప్పుడు వస్తాయి ? చీమలు చచ్చిపోయే ముందు వస్తాయి. పైకి ఎగిరేప్పుడు, రెక్కలు వచ్చి ఎగిరాక చచ్చిపోతాయి. అట్లాగే మనిషి కూడా రెక్కలువచ్చి ఎగిరి, నూరేళ్ళలోనూ అంతమై పోతుంది. అప్పుడు ముప్పాతికవంతు అంటే ప్రతిఒక ముగ్గురికి ఒక్కరు మిగులుతాడు. మూడువంతులు నాశనంఅవుతుంది. ఎట్లా నాశనం అవుతుంది. భూకంపాల వల్ల కొంతమంది ఛస్తారు. ఇదివరకు ఎప్పుడో 50 ఏళ్ళకు 30 ఏళ్ళకు ఒకసారి భూకంపాలు వచ్చేవి. ఇప్పుడు మనం న్యూస్‌పేపర్‌లో చూస్తే ఎక్కడోఅక్కడ భూకంపం వస్తూనే ఉంది. 'అభీక్ష్ణం కంపతే భూమిః' ప్రతి నిత్యం భూమి కంపిస్తుంది అన్నాడు. 'మూగశ్చేనిత్యపర్వతాః' అంటే పర్వతాలు ఊగుతాయి అన్నాడు. సముద్రం కూడా ముందుకు, వెనుకకు వచ్చి దేశాన్ని ముంచేస్తుంది అన్నాడు. ఇది ఈ యుగంలో యుగసంధిలో జరుగుతుంది. అట్లాగే ఇంకా ప్రజలందరూ కూడా దుర్మార్గత్వం వలన వాళ్ళు కొట్లాడుకొని ఒకరినొకరు చంపుకొని హత్యల వల్ల, ఈ మతకలహాల వల్ల రాజకీయం కొట్లాటల వలన కేవలం ఇంకొకడిని మంత్రిని చేయడం కోసం సంబంధంలేని వాళ్ళందరూ ఛస్తారు. ఈ చచ్చినవాడికి ఏమీ ఉపయోగం ఉండదు. ఇంకా అన్యాయం ఏమిటి ఈ సినిమా స్టార్ పెద్ద వాడని ఆ సినిమాస్టార్ పెద్దవాడని ఇద్దరి మధ్యా స్టార్లుకాని వాళ్ళంతా చచ్చిపోతారు. స్టార్ బాగానే ఉంటాడు. ఇట్లాగ నానారూపాలలో నానా విధాలుగా జన నష్టం అవుతుంది. ఈలోగా పైనుండి 'ఇనుపకోడి నిప్పులు కక్కేను' అన్నాడు బ్రహ్మంగారు అంటే ఒక కోడి ఆకారంలో రెక్కలు ఉండి వస్తుంది. అది ఇనుముతో తయారై ఉంటుంది. నిప్పులు కక్కుతుంది.

రాకెట్‌లు అన్నమాట. రాకెట్ నిప్పులు కక్కుతుంది. రెండు లక్షల మంది ఛస్తారట ఒక్కొక్క రాకెట్‌కి. ఆకాశంలోంచి పిడుగులు పడతాయి అన్నాడు. నిప్పు పిడుగులు అంటే బాంబులు పడతాయి. మాయాశక్తి మాటలాడుతుంది అన్నాడు. ఈ విధంగా ఎక్కడపడితే అక్కడ ఆకాశంలో సముద్రంలో, భూమి మీద పిడుగులు, బాంబులు పడి జనం ఛస్తారు. ఈ బాంబులే కాకుండా సూక్ష్మక్రిములు, వైరస్ బాంబులు అని ఈ టైఫాయిడ్ వచ్చేవి, మలేరియా వచ్చేవి, జబ్బులు వచ్చే క్రిములను బాంబుల్లో పెట్టి వదులుతారు. దాంతో అదేం చేస్తుందంటే పైకి పేలినపుడు బాంబులాగా ఏమీ కనబడదు, నీళ్ళ లోనూ, సముద్రంలోనూ, ఆహారంలోను, గాలిలోను అన్నీ చోట్ల వ్యాపించి కుప్పలు తెప్పలుగా జనం చచ్చిపోతారు ఎందుకు ఛస్తున్నారా అని రోగ లక్షణాలు తెలిసేటప్పటికే కొన్ని లక్షల మంది ఛస్తారు. ఈవిధంగా వైరస్ డిసీజెస్‌వల్ల, తెగుళ్ళవల్ల, ప్లేగువల్ల, కాలంలో నానారకాలుగా జనక్షయం అవుతుంది. ఈ జనక్షయం అవటం వల్ల భూదేవికి భారం తగ్గుతుంది. భూమి భరించలేదు ఈ పాపాన్ని, అపుడు భగవంతుడికి మొరపెట్టుకొంటే భగవదవతారం వస్తుంది. పురాణంలో పూర్వం ఎలాగైతే భూదేవి నేను ఈ భారం మోయలేను, అని చెప్పినపుడు కృష్ణావతారం వచ్చి మహాభారత యుద్ధం వల్ల ఈ భారాన్ని తగ్గించాడు. అట్లాగే ఈ కల్కిభగవానుడి అవతారం వస్తుంది. 'కల్కి విష్ణుయశోనామ ద్విజఃకాల ప్రచోదితః' ఈ తక్కిన అవతారాలు అన్నీకూడాను ఏ యుగం నడుస్తుందో ఆ కులంనుంచి అవతారం వస్తుంది. నాలుగు యుగాలు కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర లక్షణాలు కలిగి ఉంటాయి. వచ్చేది కృత యుగం కాబట్టి ఈ బ్రహ్మజ్ఞానం ప్రజలకి ఇచ్చేటువంటి అవతారం కల్కి భగవానుడు అవతారం, తెల్లటివర్ణంలో ఉంటుంది. కృతయుగం, ఈ

విధంగా కల్కిభగవానుడి అవతారంవస్తుంది. శంబల అనేగ్రామంలో "శంబలే విష్ణుయశసః' విష్ణుయశస్సుడనే బ్రాహ్మణుని యొక్క కుమారునిగా జన్మిస్తాడు. "భగవత్‌యత్యావతీర్ణ" రామునికి, కృష్ణునికి ఉన్నటువంటి మహిమలు కలిగి ఉంటాడు. రామచంద్రమూర్తిలో ఉండేటువంటి సత్యం, కృష్ణుడు మహిమలు చూపించాడుగాని సత్యం లేదు. ఇప్పుడు చెప్పేదంతా ఇంకో నిమిషంలో ఉండదు. ఉండేదంతా పాలిటిక్స్ అన్నమాట. అప్పుడు వచ్చేది కలియుగం కదా కలియుగ ధర్మంప్రకారం చేశాడు. రాముడు సత్యం అన్నమాట చెల్లించే వాడుగాని మహిమలు ఏవీచూపించలేదు. కృష్ణుడికుండే మహిమలు, రాముడుకుండే సత్యం ఈ రెండూ కనబడతాయి. ఈ కల్కి భగవానుడికి అందువల్ల బ్రహ్మంగారి కాలజ్ఞానంలో రామధర్మజులవారు వచ్చేను అన్నాడు. రామధర్మజులు - ధర్మరాజు అంటే ధర్మంతో పరిపాలించే వాడు. రామచంద్రమూర్తి యొక్క ఆకారం, లక్షణాలు కలిగినటు వంటివాడు. ఆయన కార్తీకశుద్ధ నవమినాడు అవతరిస్తాడు. ఈ కార్తీకమాసంలో లక్ష వత్తులు దీపారాధన ఎప్పుడూ ఆడవాళ్ళు పూజలు చేస్తుంటారు. ఎందుకు చేస్తారంటే ఎప్పటినుంచో పూర్వఋషులు నేర్పారు. ఈ దీపాలు పెట్టే రోజునే కలియుగం చీకటి పోయేటువంటి దీపంపెట్టే అవతారం వస్తుందని ఆయన్ని స్మరించడం వల్ల ఆయనపేరు జపం చేయడం వల్ల ఈ కలియుగం పాపాలు కొంచెం తగ్గి ఈ పోయే వాళ్ళలో మనం మిగిలి కొంచెం వారి దర్శనం చేసికోగలిగితే తరించడం. యుగసంధి పుట్టు నిజమన్నాడు. ఈ యుగసంధి ఈ మధ్యన ఈ నూరు సంవత్సరాలలో ఇంత జరుగుతుంది. ఈ యుగసంధి ఇందుకు తప్పితే మాల వారింట పుట్టుదు అన్నాడు బ్రహ్మంగారు. ఇందులో ఏ ఒక్కటి జరగక పోయనా నేను మాలవారింట్లో పుడతాను అని గ్యారంటీ ఇచ్చాడు. అంటే గ్యారంటీగా జరుగుతాయి. వీరగురువాక్యం తప్పదన్నాడు.

గ్రహగతులు మారేను ఈ గ్రహాలు అన్నీకూడా అవి తిరిగేటువంటి వైనం మారిపోతాయి. ఈ పంచాంగంలో కూడా 19 ఏళ్ళకొకసారి గురువు 12 రాశులు తిరగాలి. ఇప్పుడు 10 ఏళ్ళకు, 9 ఏళ్ళకు కూడా గురువు మారుతున్నాడు. కుజుడు, అంటే అంగారకుడు, 15 రోజులకు రాశిమారాలి. ఇప్పుడు 9నెలలనుంచి ఒక్కచోటే తిష్టవేసిఉన్నాడు. కదలకుండా 'సంవత్సర స్థాయినోచైవ..' భారతంలోకూడా సంవత్సరం ఒకేచోట ఉన్నా యట గ్రహాలు కదలకుండా భారతయుద్ధం ముందు అపుడు భయంకరమైన యుద్ధాలు వస్తాయి. అట్లాగ ఇప్పటికి 5,6 నెలలుగా గ్రహాలు సరిగా కదలిక లేకుండా ముందుకు వెనక్కి, ముందుకు వెనక్కి ఉంటాయిగాని ముందుకు వెళ్ళలేవు అవి ఇవన్నీ రేపు 2000 సంవత్సరం రాగానే మే 4వ తేదీన అన్నిగ్రహాలు ఒక్కచోట చేరుతాయి. కలియుగం ప్రారంభించినపుడు, కృష్ణపరమాత్మ నిర్యాణం అయినపుడు, కలియుగం ఆదిలో ఎట్లా అయితే ఈ గ్రహాలు అన్నీ ఒక చోట కలిశాయో అదే సంవత్సరం ప్రమాధినామ సంవత్సరంలో అదే చైత్రమాసంలో, అదే మేషరాశి మొదట్లోనే మళ్ళీ అన్ని గ్రహాలు కలుస్తాయి. అందువల్ల ఇప్పుడు వచ్చేది యుగం మారి సత్యయుగం వస్తుంది. 'యదా చంద్రశ్చ, సూర్యశ్చ, తదా శుక్ర బృహస్పతిః మేషరాశౌ సమేష్యంతి తతో భవతి వై కృతం'. భాగవతంలో వ్యాసమహర్షి ఎప్పుడైతే సూర్యుడు, చంద్రుడు, శుక్రుడు, బృహస్పతి, ఈ సమస్త గ్రహాలు ఒకే రాశిలో కలుస్తాయో అపుడు కృతయుగం అవుతుంది. 'కల్కి విష్ణుయశోనామ' విష్ణుయశస్సుడనే వాడి కొడుకుగా హిమాలయాలలో శంబల అనే గ్రామంలో జన్మిస్తాడు. ఆయనకు ఎనిమిదేళ్ళకే అష్టమహాసిద్ధులు కనబడతాయి. ఇప్పుడు రామచంద్రమూర్తికి ఎట్లాగైతే విశ్వామిత్రుడు గురువో అట్లా పరశురాముడు గురువై సమస్త అస్త్రవిద్యలు నేర్పుతాడు. తన శరీరంలో

ఉండే యోగశక్తితోటి ఈ అణుబాంబులు బయట నుండి వచ్చే దుష్టగ్రహ శక్తులు నిగ్రహించి కంట్రోల్ చేసి తన భక్తులను రక్షించి కలిధర్మాన్ని రూపుమాపి కొన్ని కోట్లమంది పాపులను చంపివేస్తాడు. ఎవరిని చంపుతాడు అంటే నోస్ట్రడేమస్ అనే ఫ్రెంచి భవిష్యత్‌ద్రష్ట ఈ భవిష్యత్ అంతా వ్రాశాడు. ఈ జరుగబోయే భవిష్యత్తు ఇప్పుడు వచ్చే ఆగష్టు నెల సంచిక 'శుభవార్త'లో కొన్నివివరాలు ఇచ్చాను. కొన్ని ఈ కలియుగాంతం మూడవ వాల్యూంలో ఇచ్చాను. ఈ కలియుగం మొదలెట్టాక క్రొత్త క్రొత్త మతాలు వచ్చాయి. ముస్లింమతం, బౌద్ధమతం, క్రిష్టియానిటీ ఈ మతాలు అన్నీ నశించి పోతాయి. ఆరుమతాలు ఒక్కటగును. బ్రహ్మంగారు ఆరుమతాలు కలిసి ఒకటి అవుతాయి. భగవంతుని మతం మాత్రమే సత్యధర్మం ఒకటే మిగులుతుంది. మిగతా మతాలన్నీపోతాయి. మనుష్యుడు స్థాపించిన మతాలన్నీ మట్టికొట్టుకు పోతాయి. ఈ విధంగా ఈ కలియొక్క ధర్మాలు అన్నీ కూడా నశించి మళ్ళీ కృతయుగ ధర్మం 'ఏకవర్ణ స్తదాలోకో' ఒకటే ధర్మం ప్రపంచాన్ని నడిపిస్తుంది. అందరికీ మంగళాశీస్సులు.

హరిః ఓం తత్ సత్

7-8-99న రావులపాలెంలో చేసిన అనుగ్రహభాషణం.

గురుసేవగా ఈ ఉపన్యాసమును వ్రాసి పంపినవారు

చీరాల శాఖ యోగమిత్రుడు శ్రీ జి.పూర్ణచంద్రరావు



# పూజ్యశ్రీ వేదవ్యాస గురుదేవుల - రచనలు

క్రొత్త ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | మన సనాతన ధర్మం-జాతీయవిద్య (జాతీయ వాచకం) | 96/- |
| 2. | శ్రీగణేశ పురాణం-I | 108/- |
| 3. | శ్రీగణేశ పురాణం-II ( hard bound) | 150/- |
| 4. | 'మాస్టరు C.V.V.-గారి ఎలక్ట్రానిక్ యోగం' | 73/- |
| 5. | పరాశర జ్యోతిషం Vol.-I | 64/- |
| 6. | పరాశర జ్యోతిషం Vol.-II | 54/- |
| 7. | పరాశర జ్యోతిషం Vol.-III | 110/- |
| 8. | శివపూజా రహస్యాలు | 29/- |
| 9. | యదార్థ భగవద్గీత (తెలుగు భగవద్గీత) (hard bound) | 45/- |
| 10. | ప్రాచీన భగవద్గీత (hard bound) (revised edition) | 65/- |
| 11. | శ్రీ విష్ణుసహస్రనామ నవనీతవ్యాఖ్యానము (మొదటిభాగము) | 120/- |
| 12. | శ్రీ విష్ణుసహస్రనామ నవనీతవ్యాఖ్యానము (రెండవభాగము) | 120/- |
| 13. | శ్రీభాగవత రసామృతము (ఏకాదశ, ద్వాదశ స్కంధములు) | 75/- |
| 14. | శ్రీభాగవత రసామృతము (దశమస్కంధము ప్రథమగుచ్ఛము) | 150/- |
| 15. | శ్రీభాగవత రసామృతము (దశమస్కంధము ద్వితీయభాగము) | 150/- |
| 16. | 1999-కలియుగాంతం - కాలజ్ఞానం-I | 60/- |
| 17. | 1999-కలియుగాంతం - కాలజ్ఞానం-II | 39/- |
| 18. | 1999-కలియుగాంతం - "ప్రళయం" | 60/- |
| 19. | నిత్యజీవితంలో యోగసాధన | 30/- |
| 20. | సాధనా రహస్యాలు | 36/- |
| 21. | మీ ఇంటినిబట్టి మీ అదృష్టం | 12/- |
| 22. | మీ జీవితంలో అదృష్ట ఘడియలు | 12/- |
| 23. | మీ జన్మతేదీలో మీ అదృష్టం | 12/- |
| 24. | నవగ్రహ శాంతి విధానం | 20/- |
| 25. | నవ్వితే నవరత్నాలు (మీ దురదృష్టాన్ని జయించే అదృష్టరత్నం ఏది) | 18/- |
| 26. | శ్రీరామ చరితామృతం | 36/- |
| 27. | శ్రీ సత్యనారాయణవ్రత రహస్యం-అంతరార్థం | 25/- |
| 28. | శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రం | 30/- |
| 29. | శ్రీలక్ష్మీ సహస్రనామ స్తోత్రం | 20/- |
| 30. | వినాయక చతుర్థి - గణేశ మంత్రాలు | 10/- |

# పూజ్యశ్రీ వేదవ్యాస గురుదేవుల - రచనలు

| | | |
|---|---|---|
| 31. | శ్రీ విద్యారణ్యస్వామి చరిత్ర (హిందూరాష్ట్ర స్థాపకుడు) | 25/- |
| 32. | మహాభారత కాలనిర్ణయం—(Ph.D.) (డాక్టరేటు డిగ్రీపొందిన పరిశోధనా సారం) | 45/- |
| 33. | సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు | 40/- |
| 34. | ప్రాచీన భగవద్గీత (745 శ్లోకాలతో) (పురాతనప్రతి ప్రచురణ, పరిశోధనా పీఠికతో) | 45/- |
| 35. | నిత్యపూజకు చదువవలసిన స్తోత్రాలు | 15/- |
| 36. | మనదేశం – మనసంస్కృతి | 60/- |
| 37. | మన – పండుగలు | 30/- |
| 38. | భగవంతుని దీపాలు | 25/- |
| 39. | ఏరిన ముత్యాలు | 25/- |
| 40. | పురుషసూక్త – రహస్యం | 42/- |
| 41. | శ్రీసూక్త – రహస్యం | 36/- |
| 42. | నివేదిత | 20/- |
| 43. | గురుగీత | 10/- |
| 44. | సాయినాథ చరిత్ర (పారాయణ గ్రంథం) | 59/- |
| 45. | యుగపురుషుడు (శ్రీకృష్ణునిపై చారిత్రక-పరిశోధనా గ్రంథం) | 39/- |
| 46. | జ్యోతిషం సైన్సా? – మూఢవిశ్వాసమా? | 30/- |
| 47. | శ్రీ వేదవ్యాస మహర్షి – దివ్యచరిత్ర | 60/- |
| 48. | అణుయుగంలో హిందూమతం | 50/- |
| 49. | హజీవారీష్ ఆలీషా దివ్యచరిత్ర (షిర్డీ సాయినాథుని గురువు) | 25/- |
| 50. | గాయత్రీ మంత్రానుష్ఠాన విధానము | 42/- |
| 51. | ఇండియాలో – జీసస్? (కాశ్మీరులో క్రీస్తు సమాధి జీసస్ జాతకం... వంటి అద్భుత పరిశోధనల గ్రంథం) | 50/- |
| 52. | సత్సంగం | 15/- |
| 53. | శ్రీరామానుజ వైభవం-I | 60/- |
| 54. | శ్రీరామానుజ వైభవం-II | 70/- |
| 55. | శ్రీవేంకటేశ్వర వైభవం-I | 96/- |
| 56. | శ్రీవేంకటేశ్వర వైభవం-II | 96/- |
| 57. | శ్రీవేంకటేశ్వర వైభవం-III | 96/- |
| 58. | శ్రీవేంకటేశ్వర వైభవం-IV | 96/- |
| 59. | తిరుప్పావై (ధనుర్మాసవ్రత పారాయణగ్రంథం) | 45/- |
| 60. | ఆయుర్వేద హృదయం | 40/- |

# పూజ్యశ్రీ వేదవ్యాస గురుదేవుల - రచనలు

| | |
|---|---|
| 61. జ్యోతిష-రహస్యాలు (బాబిలోనియా-హిబ్రూ జ్యోతిషగ్రంథం) | 40/- |
| 62. వేదాలలో హిందూమతం Vol.-I | 62/- |
| 63. వేదాలలో హిందూమతం Vol.-II 'సనాతన హిందూమతం'లో పునర్జన్మ! | 62/- |
| 64. వేదాలలో హిందూమతం Vol.-III అవతార సిద్ధాంతం | 62/- |
| 65. వేదాలలో హిందూమతం Vol-IV 'సాధనా మార్గాలు'! | 62/- |
| 66. వేదాలలో హిందూమతం Vol.-V 'దేవతార్చన - పూజావిధానం'! | 62/- |
| 67. 'అదృష్ట-రేఖ' | 51/- |
| 68. హస్తసాముద్రికం | 50/- |
| 69. వ్యాసగీత | 18/- |
| 70. మంత్రశాస్త్ర రహస్యాలు | 45/- |
| 71. శ్రీమన్నారాయణ పరత్వము | 25/- |
| 72. వ్యాసపీఠం | 25/- |
| 73. **1999 - End of Kali Yuga** | 75/- |
| 74. **Hinduism in the Space Age** (hard bound) | 200/- |
| 75. **WORD OF GOD** | 60/- |
| 76. **Astronomical Dating of the Mahabharata War** | 300/- |
| 77. **Dr. Vedavyas - The Saint of the Space Age** | 35/- |
| 78. **Ancient Bhagavad Gita** | 65/- |
| 79. **Science of Time** | 360/- |
| 80. **A Concise Text Book of Vedic Hinduism** | 72/- |
| 81. **Wisdom of Longevity (Ayurveda)** | 60/- |
| 82. **World Parliament of Religions Chicago Address** | 36/- |
| 83. **Master-C.V.V. And His Electronic Yoga** | 105/- |
| 84. **Making And Unmaking India as a Nation** | 60/- |
| 85. **Everything And Nothing** | 96/- |

కాపీలకు : పుస్తకం ఖరీదు + పోస్టేజి కలిపి Y. సాంబశివరావు, హైదరాబాదు పేర D.D. తీసి ఈక్రింది అడ్రసుకు పంపాలి

**"శుభవార్త"–ఆధ్యాత్మిక మాసపత్రిక** (విడిప్రతి : రు.7/-, సంవత్సర చందా : రు.84/-)

రు.84/- లు సెక్రటరీ, USCEFI, Hyderabad పేర D.D. తీసి ఈక్రింది అడ్రసుకు పంపాలి.

For Copies

**Smt. Sikha Pushpavati**
No. 5/2, Chandramouli Nagar,
Guntur - 522 001. Ph : (0863) 351108